'అమ్మా! నేను గూటికి చేరాను.. కానీ ఆ గూట్లో రాబందులున్నాయి. వాటితో నీ చిన్నారి పిచుక ఎలా స్నేహం చేస్తుందో కాలమే నిర్ణయిస్తుంది. నీ ఆరోగ్యం జాగ్రత్త! మన ఆపరేషన్‌ను పూర్తి చేయడానికి ఎక్కువ సమయం తీసుకోను' అని తల్లికి లేఖ రాసింది ప్రియంవద.

ఆ పాతకొంపలో చేరిన మరుక్షణం ఆమె చేసిన పని అదే.

ఇంతకీ ఆ అమ్మాయి ఏ ఉద్దేశంతో ఆ ఇంట్లోకి చేరింది? ఆమె పూర్తి చేయాలనుకున్న ఆపరేషన్ ఏమిటి? ఆద్యంతం ఉత్కంఠగా చదివించే

అత్తలూరి విజయలక్ష్మి నవల

# ఆ గదిలో..

చతుర ఏప్రిల్ కానుక!



అది హైదరాబాద్‌లో ఎంతో ప్రాము ఖ్యం కలిగిన నల్లకుంట ప్రాంతం. విద్యానగర్ నుంచి శంకరమఠం వెళ్లే రోడ్డు వైపు డౌన్‌లోకి వెళ్లి ఎడమవైపు సందులోకి తిరిగి కొంచెం ముందుకు వెళితే డాబా ఇల్లు కనిపిస్తుంది. ఆ ప్రదేశం పూర్తిగా రెసిడెన్షియల్ ఏరియా. అక్కడున్న ఇళ్లన్నీ చాలా కాలం క్రితం కట్టిన పాత ఇళ్లే.

అలాంటి ఇళ్లల్లో ఒకటి, చాలా పాతది, సుమారు యాభైఏళ్ల నాటిది.. కాంపౌండ్ వాల్ నానుకుని నల్లటి ఇనపగేటు.. గేటు కిందవైపు మట్టితో మూసుకుపోయి ఉంది. కాంపౌండ్‌వాల్ చాలాచోట్ల పగుళ్లు వచ్చి, పడిపోడానికి సిద్ధంగా ఉంది. కానీ ఓసారి అలా తట్టి చూస్తే బలంగానే ఉన్నట్టు అని పిస్తుంది.

గేటు లోపల విశాలంగా ఉన్న ఖాళీ స్థలం. గేటుకి రెండుపక్కలా పెద్ద కొబ్బరి చెట్లు.. కొంచెం పక్కగా కాంపౌండ్ వాల్ చివర పెద్ద మామిడిచెట్టు.. వెనకాల ఎక్కడో రావిచెట్టు, వేపచెట్టు ఉన్నట్టుగా ఖాళీస్థలంలో ఉన్న ఎండిన రావాకులు, వేపాకులు తెలియచేస్తున్నాయి.

లోపలికి వెళ్లేముందు ఒక వరండా ఉంది. ఆ వరండాలోకి వెళ్లడానికి గ్రిల్స్ అడ్డంగా పెట్టి ఉన్నాయి. ప్రధాన ద్వారం కూడా బలంగానే ఉంది. కానీ, దాన్ని తెరిచి చాలాకాలమైంది అన్నట్టుగా ఉంది. ఆ ఇల్లు ఒకప్పుడు బాగానే ఉండేదేమో కానీ, ప్రస్తుతం ఆ ఇంట్లో ఎవరూ నివాసం ఉంటున్న జాడలులేవు. అంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ నిశ్శబ్దంలో ఏదో ఒక భయం ఉంది. ఖాళీ ప్రదేశం అంతా ఎండిన వేపా కులు, రావాకులు, చెత్తా చెదారంతో నిండి ఎంతో కాలంగా అక్కడ ఎవరూ శుభ్రం చేయడం లేదని తెలియచేస్తోంది.

సమయం ఉదయం పదకొండు, పద కొండున్నర మధ్య..

ఆ డాబా ఇంటి గేటుముందుకు ఒక ఆటో వచ్చింది.

ఆ ఆటోలో ఇరవైరెండేళ్ల అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి చాలా అధునాత నంగా ఉంది. జీన్సు ప్యాంటుమీద తెల్లటి చెక్స్ ఉన్న గులాబీరంగు టీషర్టు వేసు కుంది. జుట్టు భుజాలదాకా వంకీలు తిరిగి ఒత్తుగా ఉంది.. ఆ జుట్టుకి మొదట్లో ఒక తెల్లటి వెడల్పాటి క్లిప్పు పెట్టుకుంది. చేతు లకి గాజులు, మెడలో గొలుసు ఏమీ లేవు.. చెవులకి చిన్న ముత్యాల టాప్స్ ఉన్నాయి. ఆమెని చూడగానే బాగా చదు వుకున్న అమ్మాయిలా విజ్ఞానంతో వెలిగి పోతోంది మొహం.

ఆ అమ్మాయి ఆటోలోంచి తల బైటకి పెట్టి ఆ ఇంటివైపు తొంగిచూసింది. కొన్ని సెకన్లు ఆ అమ్మాయి కళ్లు దేన్నో అన్వేషి స్తున్నట్టు అటూఇటూ చంచలంగా కదిలి, గేటుకానుకుని ఉన్న పిల్లర్‌మీద నిలి చాయి. ఎడమచేతిలో ఉన్న డైరీ తీసి అందులో ఇంటినెంబర్ కోసంచూస్తూ, కొంచెం గట్టిగా అంది "ఇదే ఆపెయ్"

ఆటో ఆగింది.

ఆమె ఆటో దిగి గేటు దగ్గరగా నడుస్తూ 'అంకుల్ చెప్పిన బండ గుర్తులు, అడ్రస్ ఆధారంగా చూస్తే కచ్చితంగా ఇదే ఇల్లు' అనుకుంటూ గేటు పక్కనే ఉన్న పిల్లర్ దగ్గరకు వెళ్లి తన డైరీలో ఉన్న పేరుకోసం చూసింది. పిల్లర్‌కి పైన కుడి చేతివైపు దట్టంగా దుమ్ము కొట్టుకుపోయి ఉన్న నల్లటి పలక కనిపించింది. కానీ ఆ పలకమీద మాత్రం ఏమీ కనిపించలేదు. కొన్నిక్షణాలు అలాగే చూసి, ఒక్కసారి నిలబడిన దగ్గరే కిందకి చూసింది. గాలికి కొట్టుకొచ్చిన కాగితాలు కొన్ని కనిపిం చాయి. వాటిలోంచి చిన్న కాగితం ముక్క తీసుకుని మునివేళ్లతో పట్టుకుని దుమ్ము కొద్దిగా తుడిచింది. 'రాంభొట్ల సుంద

రయ్య, రిటైర్డ్ సూపరింటెండెంట్' అని ఉంది.

'యస్.. ఇదే' అనుకుంది కచ్చితంగా.

ఆటో దగ్గరకు నడిచి లోపల ఉన్న సూట్‌కేస్‌ను కింద పెట్టి పర్సులోంచి వంద రూపాయల నోటు తీసి డ్రైవర్‌కి చ్చింది.

"చిల్లర లేదమ్మా" అన్నాడు అతను సందేహంగా.

"ఫర్లేదులే, ఉంచు.. స్టేషన్ నుంచి నన్ను జాగ్రత్తగా తీసుకొచ్చావు. అందుకు నీకు థాంక్స్" అంది.

"థాంక్స్ మేడమ్" అంటూ ఆటో స్టార్ట్ చేసుకుని అతను వెళ్లిపోయాడు.

ఆ అమ్మాయి భుజానికి హాండ్‌బ్యాగ్ కాక, మరో బ్యాగు వీపుకి ఉంది. దాంట్లో ల్యాప్‌టాప్ ఉంది.

సూట్‌కేస్ లాక్కుంటూ గేటు దగ్గరకు వచ్చి దాన్ని తెరవబోయింది. కానీ అది తెరుచుకోలేదు.

గేటుకున్న సందులోంచి లోపలికి కుడి చేయి పోనిచ్చి చూసింది. లోపల తాళం ఉంది.

ఆ అమ్మాయి ఒక్క క్షణం లోపలికెలా వెళ్లాలో అర్థం కానిదానిలా పెదాలు కొరుక్కుంటూ నిలబడిపోయింది.

లోపల ఎవరున్నారో, తను ఎవరిని పిలవాలో తెలియక ఆలోచిస్తున్న ఆమెకి వెనకనుంచి ఓ అమ్మాయి స్వరం వినిపించింది. "ఎవరండి మీరు? ఎవరు కావాలి? " అంది.

"ఈ ఇంట్లోవాళ్లకోసం వచ్చాను" సందేహంగానే అంది ఆ అమ్మాయి.

"అమ్మోల్లింటికొచ్చారా? " ఆశ్చర్యంగా అడిగిన ఆ అమ్మాయిని చూస్తుంటే పనిమనిషిలా ఉంది. తననే చిత్రంగా చూస్తోంది.

అవునన్నట్టు తలాడించింది.

"రండి, ఎనకనించి ఎల్దాం. ఈ గేటు తీయరు. నేనాల్ల పనిమనిషినే" అంటూ గేటు పక్కన ఉన్న ఇరుకుసందువైపు నడిచింది.

ఆ అమ్మాయి ఆమెని అనుసరించింది.

ఇద్దరూ కొంచెం ముందుకెళ్లి చెక్కగేటు దగ్గరకు వచ్చారు. పెరటివైపు దారి. చెక్క గేటు కేవలం గడియ వేసుంది. ఆ గడియ తీసి లోపలికి వెడుతూ "రండి.." అందా అమ్మాయి.

"నేనీ ఇంట్లో పనిచేస్తాను. మీరెవరు? ఎక్కడ్నించి వస్తున్నారు? " అడిగింది.

"నా పేరు ప్రియంవద. గుంటూరు నుంచి వస్తున్నాను"

"ఆళ్లేమవుతారు మీకు? "

ప్రియంవద నెమ్మదిగా అంది "వరసకి తాతగారు, నానమ్మ"

"అట్టాగా.. నేను మూడేళ్లనుంచీ చేత్తున్నానీ ఇంట్లో పని. ఏనాడూ ఓ సుట్టం, పక్కం వచ్చింది చూళ్లేదు. ఇన్నాళ్లకి మన వరాలు ఒచ్చిందంటే మురిసిపోతారేమో. పాపం, ఆల్లకి సొంత మనవడు, మనవరాలు లేరు" అంటూ పెరటిలోంచి లోపలికి వెళ్లే తలుపు మీద దడదడ కొట్టింది "అమ్మమ్మగారూ, తాతా.." అంటూ పిలుస్తూ.

కొన్ని నిమిషాల తరువాత ఒక పెద్దాయన స్వరం "ఎవరు? " అంటూ విసుగ్గా వినిపించింది.

"నేనండి గౌరిని, మీ ఇంటికి సుట్టాలొచ్చారండి" అంది గౌరి ఉత్సాహంగా.

ఇప్పటికి ఆ ఇంట్లో మూడేళ్లనుంచి పని చేస్తోంది. కానీ, ఆ ఇంటికి ఏనాడూ చుట్టాలు, స్నేహితులు, పరిచయస్తులు వచ్చిన జాడలేదు. ఇప్పుడెవరో అమ్మాయి, పైగా హిందీ సినిమాల్లో హీరోయిన్ లాంటి అమ్మాయిని చూడగానే గౌరికి చిత్రంగా, ఉత్సాహంగా అనిపిస్తోంది.

రెండుమూడు నిమిషాల తరవాత గ్రిల్ డోర్ తెరుచుకుంది. డెబ్బై ఐదేళ్ల వ్యక్తి పొడుగ్గా గుమ్మంలో నిలబడ్డాడు.

ఆయనకి తెల్లటి మీసాలు, తెల్లటి గడ్డం ఉన్నాయి. ఒంటిమీద మాసిన పంచె, మాసిన బనీను, తీక్షణంగా చూస్తున్న కళ్లు.. బొంగురు స్వరంతో అడిగాడు "ఎవరు? "

ఆ స్వరం విని ప్రియ ఉలిక్కిపడింది. సర్దుకుంటూ సన్నటి స్వరంతో తడబడుతూ అంది "మీరు.. మీరు సుందరయ్యగారు.."

"నేనే.. ఏం? ఏం కావాలి? నువ్వెవరు? " అదే స్వరంతో అడిగాడు. ఆ స్వరంలో మచ్చుకి కూడా ఆప్యాయత, మృదుత్వం, పెద్దవాళ్ల స్వరంలో ఉండాల్సిన వాత్సల్యంలాంటివేమీ లేవు. దర్పంగా, చిరాగ్గా, అసహనంగా ఉంది.

"నా పేరు ప్రియంవద" రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ అంది.

ఆయనకి చాలా ఆశ్చర్యంగానూ, చిరాగ్గానూ ఉంది. ఆ ఇంటికి ఎప్పుడన్నా ఒకసారి వచ్చి, బాగున్నారా? ఏమన్నా కావాలా? అంటూ పొడిపొడిగా పలకరించి వెళ్లే పనిమనిషి గౌరి, ఆయుర్వేద వైద్యం చేసే నరసింహాచారి, టిఫిను క్యారేజి తెచ్చిచ్చే శీను తప్ప బంధువులు, మిత్రులు రావడం అంటూ జరగదు.

గౌరి ఉదయాన్నే ఓసారి వచ్చి గబగబా వాకిలి ఊడ్చానిపించి, బైట పంపు దగ్గర ఉన్న అంట్ల గిన్నెలు తోమేసి వెళ్లిపోతుంది. మళ్లీ తొమ్మిదింటికి వచ్చి హాలు, కిచెను, వసారాలో అటొక చీపురు, ఇటొక చీపురు వేసి ఊడ్చానిపించి, కామేశ్వరమ్మ గారికి స్నానం చేయించి, బట్టలు మార్పిస్తుంది. బైట నుంచి రోజూ రెండు ప్లేట్లు ఇడ్లీ తీసుకొచ్చి ఆ ఇద్దరికీ చెరో ప్లేటు తినిపించి, ఉన్న నాలుగు గిన్నెలు తోమేస్తుంది. పన్నెండింటికి మెస్సు నుంచి శీను వచ్చి క్యారేజీ ఇచ్చేసి వెళ్లిపోతాడు.

ఆ రెండు గంటలూ ఎవరితో ఓ మాటా పలుకూ ఉండదు. ఇంట్లో పాలు, పెరుగు, పళ్లు, వారిద్దరికీ చిరుతిళ్లు, వారానికోసారి మంచినీళ్ల క్యాన్ కూడా గౌరే తీసుకొస్తుంది. అందుకుగాను నెలకి పదిహేను వందలు ఆమె జీతం. ఇంతకుముందు చాలామంది పనిమనుషులు చేశారు. కానీ, ఎవరూ ఏడాదికన్నా ఎక్కువకాలం నిలదొక్కుకోలేదు. కారణం కామేశ్వరమ్మగారి సతాయింపు, సుందరయ్యగారి పిసినారితనం.

గౌరి మాత్రం కచ్చితంగా చెప్పేసింది, తననేమాత్రం సతాయించినా గంట కూడా ఉండనని, నెల తిరిగేసరికి జీతం నయాపైసతో సహా ఇచ్చి తీరాలని. దిక్కులేకో, గౌరి పనితనం నచ్చడం చేతనో ఇప్పటివరకూ ఆమె నిరాటంకంగా పని చేసుకుంటూ పోతోంది. గౌరి ఆ ఇంట్లో ఇంతకాలం నుంచి పనిచేయడానికి కారణం మరోటుంది. బతికిచెడ్డ కుటుంబానికి చెందిన గౌరి మచిలీపట్నం నుంచి వచ్చింది. నాలుగిళ్ళల్లో పనిచేసుకుంటూ పిల్లల్ని పోషించుకుంటోంది. భర్త ఏదో ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. ఆమెకి ఎవరితో ఎలా మాట్లాడాలో, ఎవరితో ఎలా మసులుకోవాలో బాగా తెలుసు. ఈ ఇంట్లోవాళ్లతో కొంచెం మాట్లాడేది, చనువుగా మసలుకునేది గౌరే.

గౌరికాక ఆ ఇంటికి మరో వ్యక్తి ఆయుర్వేద వైద్యుడు నరసింహాచారి వస్తుంటాడు. కామేశ్వరమ్మ కాళ్లకి, చేతులకి మర్దనా చేసి, మందేయడానికి పన్నెండింటికి వస్తాడు. అంతే, ఆ తరవాత ఆ ఇంటికి ఎవరూ రారు. పనిమనిషి గౌరి, నరసింహాచారి కూడా వెనకవైపునున్న చెక్కగేటు లోంచి, పెరటిగుమ్మం ద్వారా మాత్రమే

లోపలికి వస్తారు. తిరిగి అటునుంచే వెళ్లి పోతారు. వీధివైపు ఉన్న పెద్దగేటు ఏనాడూ తీయరు. అది మూసి ఎన్నేళ్ల యిందో ఎవరికీ గుర్తులేదు కూడా.

ఇప్పుడు ఎవరో అమ్మాయి, ఇంతకు ముందు ఎన్నడూ చూడని అమ్మాయి ఆ ఇంటికి రావడం గౌరికే కాదు, తలుపు తీసిన సుందరయ్యకి కూడా ఆశ్చర్యంగా, చిత్రంగా అనిపించింది.

“ఎక్కడినుంచి వస్తున్నావు? ” అడిగాడా యన గుమ్మానికి అడ్డంగా నిలబడి.

ప్రియంవదకి చాలా అసహనంగా, చిరాగ్గా అనిపించింది. ఒక్క క్షణం కూడా అక్కడ ఉండాలనిపించలేదు. వెంటనే గోపాలం అంకుల్ మాటలు గుర్తొచ్చాయి. తనను తాను సంబాళించుకుని నెమ్మదిగా అంది “గుంటూరు శాస్త్రిగారు పంపిం చారు.. అదే రామశాస్త్రిగారు”

“గుంటూరు శాస్త్రిగారా? ” ఆశ్చర్యంగా చూశాడాయన.

గుంటూరు శాస్త్రిగారంటే ఆయన స్నేహి తుడు. దాదాపు ఆయన వయసే ఉంటుంది. ఓపిక ఉన్నంతకాలం ఇద్దరి మధ్యా రాకపోకలు బాగానే ఉండేవి. ఆ తరవాత మాటలు లేవు, క్షేమ సమాచారా లూ లేవు. చాలాకాలం అవుతోంది ఇద్దరూ కలుసుకుని. ఇంతకాలం తరవాత రామ శాస్త్రి తనని గుర్తుంచుకుని ఒకమ్మాయిని తన దగ్గరకు పంపించడం ఆయనకి కాస్సేపు మింగుడుపడలేదు. కాకపోతే ఆయన మాటంటే చాలా విలువ ఇస్తాడు సుందరయ్య. అందుకు ప్రత్యేకమైన కారణం ఉంది.

అందుకేనేమో ఆయన పంపించిన అమ్మాయి కావడంతో ఆయన స్వరంలో అప్రయత్నంగానే కొంచెం మెత్తదనం వచ్చింది.

“లోపలికి రా” అంటూ గుమ్మంలోంచి

కొంచెం పక్కకి జరిగాడు.

ప్రియంవద గౌరివైపు చూసి నెమ్మదిగా కదిలి సూట్‌కేసు తీసుకోబోతుంటే గౌరి చటుక్కున తన చేయి అడ్డుపెట్టి "లోపలి కెళ్లండి నేనట్టుకొస్తాను" అంది.

"థాంక్స్" అంటూ ప్రియంవద లోపలికి నడిచింది.

గౌరి సూట్‌కేస్ తీసుకుని ఆమె వెనకాలే నడిచింది.

పెరటివైపు నుంచి వచ్చి వంటగదికి, హాలుకి కలిపి ఉన్న చిన్న నడవాలోంచి హాల్లోకి వచ్చింది ప్రియంవద.

హాల్లో పాతకాలం సోఫాలు రెండు, వాటి మీద న్యూస్‌పేపర్లు, బట్టలు నిండి ఉన్నాయి. ఆ సోఫాలు పూర్తిగా పాడైపోయాయి.

ఆ హాల్లోంచి బైట వరండాలోకి వెళ్లడానికి ఉన్న ద్వారం మూసి ఉంది. ఆ ద్వారానికి రెండుపక్కలా రెండు మంచాలు వేసి ఉన్నాయి. పెద్దవాళ్లు ఇద్దరూ చెరో దానిమీదా పడుకుంటారు. ఒక మంచం మీద వృద్ధురాలు కామేశ్వరమ్మ, ఆ ఇంటి యజమానురాలు కాబోలు ఇంకా నిద్రలేవ లేదు. ఆవిడ మంచానికి ఆనుకుని చేతికర్ర ఉంది. పక్కనే స్టూలుమీద మంచినీళ్ల జగ్గు, రెండు గ్లాసులు ఉన్నాయి. ఆ స్టూలు రెండు మంచాలకి మధ్యలో ఉంది. అర్ధరాత్రి ఎవరికి మంచినీళ్లు కావాల్సి వచ్చినా అందుబాటులో ఉండేట్టు పెట్టుకున్నారు.

ఆ ద్వారానికి ఎదురుగా టీవీ స్టాండ్, దానిమీద పాత కలర్ టీవీ మంచాల మీద పడుకున్న వాళ్లకి కనిపించేలా పెట్టి ఉంది. టీవీ మీద దట్టంగా దుమ్ము పేరుకుని ఉంది. అది కూడా అప్పుడప్పుడూ చేత్తో అటూఇటూ తుడిచినట్టు ఆ పక్కా, ఈ పక్కా అల్లుకుని ఉంది. బహుశా బొమ్మ కనిపించనప్పుడల్లా వాళ్లిద్దరిలో ఎవరో చేత్తోటో, పేపర్‌తోటో తుడిచి ఉంటారు. హాలంతా స్టూలు, చెక్క టేబిలు, కామేశ్వరమ్మ వాకర్, ఇంకా ఏవో వస్తువులతో మొత్తం గజిబిజిగా భయంకరంగా ఉంది. బల్లమీద ఎంగిలి ప్లేట్లు రెండు, మంచినీళ్ల గ్లాసులు, చిన్నచిన్న గిన్నెలు.. హాలు దాటి వెళితే ఎడమ పక్క ఓ గది ఉంది.

గౌరి సూటుకేసు తీసుకుని, తలుపు తోసి ఆ గదిలోకి వెళుతూ "రండమ్మాయి గారూ" అంటూ పిల్చింది.

ప్రియంవద పెద్దాయనవైపు చూసింది.

'వెళ్లు' అన్నట్టు తలాడించాడు.

ప్రియంవద గౌరిని అనుసరించింది.

"ఈ గదిలో ఉండండి మీరు. నేను చిటికెలో శుభ్రం చేస్తాను" అంటూ సూట్‌కేసు గోడకానించి చకచకా హాల్లోకి వెళ్లి చీపురు తీసుకొచ్చి ఊడవసాగింది గౌరి.

ఆ గది చూస్తుంటే చిటికెలో కాదు కదా.. కచ్చితంగా దానికో ఆకారం రావడానికి వారం పడుతుందనిపించింది.

సీలింగ్‌కి నాలుగువైపులా బూజులు వేలాడుతున్నాయి. కిటికీలు ఎంతకాలంగా మూసి ఉన్నాయో మరి, గదంతా వాసన. ఏం సామాన్లో, అవి ఎవరికి సంబంధించినవో తెలియదుగానీ, గదంతా పరచుకుని ఉన్నాయి. ఒక మంచం ఉంది. దానిమీద జిడ్డోడుతూ కంపుకొడుతున్న దిండ్లు, దుప్పట్లు అడ్డదిడ్డంగా పడి ఉన్నాయి. ఉన్న ఒకే ఒక షెల్ఫ్‌లో పిచ్చిపిచ్చి బొమ్మలు, వైరుతో అల్లిన ఫ్లవర్‌వాజ్‌లు, విరిగిన పింగాణీ కప్పులు, హెయిర్ పిన్నులు, విరిగిన రెండు ప్లాస్టిక్ కుర్చీలు.. ఇంకా అనేకం పేరు తెలియని వస్తువులు.

ప్రియంవద నెమ్మదిగా అంది "కిటికీ తెరుస్తావా? "

గౌరి చీపురుకింద వదిలేసి కిటికీ తెరవడానికి వెళ్లింది. బలవంతంగా బోల్టుతీసి

ఒక రెక్క తెరవగానే ఠప్పున బల్లికింద పడింది.

ప్రియంవద కెవ్వున అరిచి చటుక్కున గదిలోంచి బైటకి పరిగెత్తింది. గౌరి చీపురుతో ఆ బల్లిని కిటికీలోంచి బైటకి వెళ్లగొట్టింది.

భయంతో పరిగెత్తుకు వచ్చిన ప్రియంవదని చూస్తూ చిరాగ్గా అడిగాడు సుందరయ్య... "ఏమైంది? "

గౌరి నవ్వుతూ బైటకి వచ్చి "ఏం లేదు తాతా! అమ్మాయిగారు బల్లిని చూసి భయపడ్డారు" అంటూ "రండి, పోయిందిలే" అంది ప్రియంవదతో.

"నువ్వు క్లీన్ చేశాక వస్తాను" భయంగా అంది ప్రియంవద.

"సరే, అట్టా కూర్చోండి" అంటూ ఓ ఇనపకుర్చీ జరిపింది గౌరి.

ప్రియంవద భయంభయంగా కూర్చుంటూ ఆయనవైపు చూసింది.

"ఇప్పుడరిస్తే అరిచావు కానీ, ఇంకెప్పుడూ అంత గట్టిగా అరవమాక" అన్నాడు.

ఆయన స్వరంలో ఏ మాత్రం మృదుత్వం లేదు. ఈయన తరహానే ఇంతా లేక?

"ఎప్పుడు బయల్దేరారు? స్నానం చేస్తారా అమ్మాయిగారూ? " అడిగింది గౌరి.

"లేదు.. నేను ఉదయం సాన్నం చేసి బయల్దేరాను. ఫ్రెష్‌గానే ఉన్నాను" అంది.

అప్పుడే గట్టిగా ఆవలిస్తూ కామేశ్వరమ్మ లేచింది "ఎవరూ!" అంది కళ్లు చికిలించి చూస్తూ.

ఆయన ఆవిడకి సమాధానం చెప్పకుండా, ఆమె మంచం దగ్గరగా నడుస్తూ ప్రియంవదతో అన్నాడు "ఆవిడ నా భార్య.. పక్షవాతం వచ్చి, కాళ్లు చచ్చుప

డ్డాయి. ఐదేళ్లయింది"

ఆవిడ ఆయన చేతి ఆసరాతో లేచి కూర్చుని "ఎవరు నువ్వు? " అంది.

ప్రియ సమాధానం చెప్పకుండా లేచి ఆమె దగ్గరగా నడిచి కొద్దిగా వంగి పాదాలకు నమస్కరించింది. ఆవిడ ఆశీర్వదించే అలవాటు లేని దానిలా భర్త వైపు సందేహంగా చూసింది.

"గుంటూరు శాస్త్రిగారు పంపించారుట" ఆవిడకి వినపడదల్లే ఉంది.. కొంచెం గట్టిగా చెప్పాడు.

ప్రియంవద అంది "నా పేరు ప్రియంవద. నాకు ఈ ఊళ్లో సాఫ్ట్‌వేర్ ఇంజినీరుగా ఉద్యోగం వచ్చింది. మా ఊరు కూడా గుంటూరే. శాస్త్రిగారి ఇంటిపక్కనే ఉంటాం. నాకిక్కడ తెలిసినవాళ్లెవరూ లేరని, శాస్త్రిగారు మీ అడ్రస్ ఇచ్చి ఇక్కడికి వెళ్లమన్నారు నన్ను. ఈ ఇంట్లో మీరిద్దరే ఉంటారని, నేనిక్కడ ఉంటే నాకు పెద్దవాళ్ల అండ, మిమ్మల్ని కనిపెట్టి ఉండడానికి మీకో తోడు ఉన్నట్టుంటుందన్నారు"

భార్యాభర్తలిద్దరూ మొహాలు చూసుకున్నారు.

"నీకిక్కడ వండి పెట్టడానికి ఎవరున్నారు? మేమే బైటనుంచి క్యారేజీ తెప్పించుకుంటాం. నీకు వంటొచ్చా? "

"వచ్చండి. నాకు శాస్త్రిగారు అంతా చెప్పారు. రేపట్నించీ నేనే మీకిద్దరికీ వంట చేసి పెడతాను. మీ ఆరోగ్యం, మీ అవసరాలు అన్నీ చూసుకుంటాను"

ఆవిడ కళ్లతోటే ప్రియని స్కాన్ చేస్తున్నట్టు కొన్ని క్షణాలు నిలువెల్లా చూసింది. తరవాత "మీ నాన్న ఏం చేస్తాడు? " అడిగింది.

"లేరండి.. పోయారు"

"ఎంతమంది మీరు అక్కచెల్లెళ్లు? "

వాళ్ల మాట పూర్తికాకుండానే అంది "నేనొక్కదాన్నే"

"మీ అమ్మ ఉద్యోగం చేస్తోందా? "

"చేసేదండి. ఇదివరకు కొంతకాలం అమ్మ స్టేట్స్‌లో తెలిసినవాళ్లకి హౌస్‌కీపర్‌గా వెళ్లింది. నేను అప్పుడు మా మేనమావ గారింట్లోనే ఉండి చదువుకున్నాను. తరవాత అమ్మ పనిచేసేవాళ్లు అక్కడి నుంచి ఇండియా వచ్చేశారు. అమ్మకూడా వచ్చేసింది. అప్పట్నించీ ఇద్దరం గుంటూరులోనే ఉన్నాం. నేను గుంటూరులోనే కాలేజీలో చదువుకున్నాను" తడబడకుండా, అవలీలగా చెప్పేసింది చెప్పాలనుకున్న విషయం.

"ఇప్పుడు మీ అమ్మ మీ మేనమామ దగ్గరే ఉందా? "

"లేదండి. విడిగా ఇల్లు తీసుకున్నాం. అక్కడే ఉంటోంది"

"మరిప్పుడు మీ అమ్మ ఏంచేస్తోంది? "

"ఏం లేదు. ఖాళీగానే ఉంటోంది. నాకు జాబ్ వచ్చింది కదా"

"ఉత్తరం ఏమన్నా తెచ్చావా? "

ఆ అమ్మాయి గబగబా తలూపుతూ "ఇచ్చారండి, సారీ.. మర్చిపోయాను" అంటూ తనకి కేటాయించిన గదిలోకి వెళ్లి, హాండ్‌బాగ్‌లోంచి ఒక తెల్లటి పొడుగాటి కవర్ తీసుకొచ్చి సుందరయ్య చేతికిచ్చింది. ఆయన కవర్‌లోంచి ఓ కాగితం తీసి విప్పుతూ ఆగి మంచం మీద కళ్లద్దాలు వెతుక్కుని తీసుకున్నాడు.

కొన్ని క్షణాలు ఏదో చదవడానికి ప్రయత్నించి "చదువు" అంటూ ప్రియంవద చేతికిచ్చాడు.

ప్రియంవద అది అందుకుని చదవడం ప్రారంభించింది.

'మిత్రులు సుందరయ్యగారికి నమస్కారాలు.

మీ ఆరోగ్యం ఎలా ఉంది? నేను పూర్తిగా మంచం పట్టాను. ఆ దేవుడి పిలుపు కోసం ఎదురుచూస్తున్నాను. ఈ

ఉత్తరం తెస్తున్న అమ్మాయి పేరు ప్రియంవద. మనకి కావాల్సిన వాళ్ల అమ్మాయి. బుద్ధిమంతురాలు. హైదరాబాదులో ఉద్యోగం వచ్చిందని చెప్పింది. ఆడపిల్ల కదా.. పైగా రోజులు అసలే బాగాలేవు. అంచేత వాళ్లమ్మ దిగులు పెట్టుకుంది. అందుకే మీ దగ్గరకు పంపిస్తున్నాను. మీరు, చెల్లెమ్మగారు కూడా పెద్దవాళ్ల యారు కదా.. కాస్త తనూ మీకు తోడుగా ఉంటుంది. పెద్దవాళ్ల అండ ఆ అమ్మాయికీ ఉంటుంది. మీకభ్యంతరం లేదను కుంటాను, చెల్లెమ్మని అడిగానని చెప్పండి.

ఇట్లు

మీ గుంటూరు శాస్త్రి'

ఆవిడ మొహం కొంచెం సంతృప్తిగా మారింది.

ప్రియంవద కాగితం మడిచి కవర్‌లో పెట్టి ఆయనకిచ్చేసింది.

"ఊ.. కానివ్వు. ఈ ఇంట్లో ఉండాలంటే కొన్ని నియమాలున్నాయి. అవి తరవాత చెప్తాను. అవి తప్పకుండా పాటించాలి. టైంకి ఆఫీసుకి వెళ్లి, టైంకి రావాలి. స్నేహితులు, షికార్లు అంటూ ఆలస్యంగా రాకూడదు. జాగ్రత్తగా ఉండాలి" అంది కామేశ్వరమ్మ.

"అలాగే" అంది ప్రియంవద.

"అంతేకాదు చుట్టుపక్కలవాళ్లతో బాతాఖానీలు వేయడం, ఈ ఇంటి విషయాలు చర్చించడంలాంటివి చేయకూడదు"

"అలాగే"

"ఇల్లు చూశావుగా ఎలా ఉందో, ఈ పని మనిషి సరిగా పనిచేయదు. ఈ పూట మాకు క్యారేజీ వస్తుంది. అందులోనే కొంచెం మిగులుతుందిలే. ఇవాల్టికి అందులో తినేసెయ్. రేపటినుంచీ వంట చేద్దువుగానీ.. గౌరికి చెప్తాను.. సామాను

తెచ్చిస్తుంది. దుబారా చేయకూడదు, అర్థమైందా? ”

ప్రియంవద పెదవులపైన మెరిసీమెరియకుండా సన్నని మందహాసం మెరిసి మాయమైంది “అలాగే” అంది.

“వెళ్లు.. ఆ గదిలో నీ సామాను సర్దుకో.. గౌరి శుభ్రం చేస్తున్నట్టుందిగా”

“అవునండి” అంది తల తిప్పి గదివైపు చూస్తూ.

గౌరి చీపురుతో ఊడ్చేసి, బకెట్‌తో నీళ్లు తీసుకొచ్చి బట్టతో తుడుస్తోంది.

ఆయన మొహం చిట్లించి చూస్తున్నాడు. ఇప్పుడంత అవసరమా అన్నట్టుంది ఆయన చూపు.

గౌరి తుడవడం పూర్తిచేసి బక్కెట్ బైటకి తీసికెడుతూ అంది “మీరెళ్లండమ్మాయిగారూ!”

ప్రియంవద ‘హమ్మయ్య!’ అనుకుంటూ ఆ ముసలావిడ చూపుల్నించి తప్పించుకుంటూ గదిలోకి వెళ్లిపోయింది.

మంచంమీద కంపు కొడుతోన్న దుప్పట్లు, దిండ్లు తీసేసి, పరుపు దులిపేసింది కాబోలు గౌరి, పరుపు మీద దుప్పటి లేదు. బూజులు కూడా దులిపింది, షెల్ఫ్‌లు తప్ప. ఫరవాలేదు మిగతా గది కొంచెం ఓ ఆకారాన్ని సంతరించుకుంది. కిటికీలు తెరిచి ఉంచింది. బైటనుంచి గదిలోకి వెచ్చటి సూర్యకిరణాలు పడుతున్నాయి. పూర్తిగా కాకపోయినా ముక్కులు బద్దలు కొట్టేంత వాసన కూడా లేదు. కొంచెం పోయింది.

‘థాంక్‌గాడ్’ అనుకుంటూ సూట్‌కేసులోంచి బట్టలు తీసుకుని జీన్స్ ప్యాంట్ మార్చేసుకుని నైటీ వేసుకుంది.

హాల్లోంచి వాళ్లిద్దరి మాటలు వినిపిస్తున్నాయి.

“ఎప్పటి శాస్త్రి.. ఇంకా ఉన్నాడా? ” ఆవిడ స్వరం.

“ఏమో! ఉండే ఉంటాడు. లేకపోతే ఈ పిల్లకెలా తెలుసు? ”

“అదేంటండి.. ఎనభై దాటలా? మీకన్నా పెద్దవాడు కాదూ? ”

“ఎందుకు దాటలా? దాటే ఉంటాయి. మనిషి ఇనుపకడ్డీలా ఉంటాడు. బస్కీలవీ తీసేవాడుగా. దిట్టంగా ఉండి ఉంటాడు”

“అయితే బతికే ఉన్నాడనమాట!”

ఆయన బతికున్నందుకు బాధపడుతున్నారో, సంతోషిస్తున్నారో అర్థం కాలేదు ప్రియంవదకి.

కాళ్లుచేతులు కడుక్కుని కాఫీ తాగాలనిపించిందామెకు.

గదిలోంచి మళ్లీ హాల్లోకి, వాళ్ల ముందు నుంచి వంటగదిలోకి, అక్కడి నుంచి పెరట్లోకి తల వంచుకుని వెళ్లింది. ‘బాత్ రూమ్ ఎక్కడుందో.. అదెలా ఉందో’ అనుకుంటుండగా గౌరి వచ్చి “రండి స్నానాల గది చూపిస్తాను” అంటూ పిలిచింది. ఆమెని అనుసరించింది ప్రియంవద.

పెరట్లోకి తీసికెళ్లి పైన రేకులు కప్పి ఉన్న బాత్‌రూమ్, లావెట్రీ చూపిస్తూ “మీరివి వాడుకోండి.. లోపల పెద్దాళ్ల కోసం వేరేవి ఉన్నాయి. మీరక్కడ వాడుకోలేరు” అంది.

ప్రియంవద భయంగా తొంగిచూస్తూ “బల్లులుండవుగా” అంది.

గౌరి నవ్వుతూ "ఉండవు. నేనప్పుడప్పుడు వాడుకుంటాను. సుబ్బరంగా కడిగేస్తుంటాను. వాళ్లవి కూడా కడుగుతాను. కానీ పెద్దవాళ్లు కదా సుబ్బరంగా ఉంచుకోరు" అంది.

ప్రియంవద ఆమెవైపు కృతజ్ఞతగా చూస్తూ అంది "నేను స్నానం చేసి వచ్చాను. నాకిప్పుడు భోజనం కన్నా కాఫీ కావాలి, దొరుకుతుందా? కాస్త తలనొప్పిగా ఉంది"

"నేనిప్పుడెళ్లి పాల ప్యాకెట్టట్టుకొస్తాను. కాఫీ పొడి ఉందిలెండి" అంది గౌరి.

ప్రియంవద మరోసారి థాంక్స్ చెప్పి లోపలికి వెళ్లింది.

గౌరి పాలు తేడానికి వెళ్లిపోయింది.

ప్రియంవద తిరిగి తన గదిలోకి వచ్చేసరికి పాతికేళ్ల కుర్రాడొకడు క్యారేజీ తీసుకొచ్చి వంటగదిలో పెట్టి ముసలాళ్లకి వినిపించేలా గట్టిగా అరిచాడు "అమ్మగారూ! క్యారేజీ"

"ఆ.. ఆ.. సర్లే, అన్నట్టు ఒరే శీనూ! సాయంకాలం ఓసారి రా. నీ డబ్బులు లెక్కచూసి ఇచ్చేస్తాను. రేపట్నించీ క్యారేజీ అవసరం లేదు" అంది కామేశ్వరమ్మ.

"మంచిదండి.. వస్తాను" అంటూ ఆ కుర్రాడు వెళ్లిపోయాడు.

అతనలా అనడంలో 'హమ్మయ్య! ఓ బాధ వదిలింది' అన్న రిలాక్సేషన్ కనిపించింది.

ప్రియంవద నవ్వుకుని తన గదిలోకి వెళ్లిపోయింది.

'ఏంటో? జీతానికి వంటమనిషిని కుదుర్చుకున్నట్టుగా తను రాగానే వంట డ్యూటీలో జాయిన్ అవమంటోంది ఈవిడ. టిపికల్ ఉమన్' అనుకుంది.

ఇంతలో గౌరి పాల ప్యాకెట్లతో వచ్చింది.

"గౌరీ ఎక్కడికెళ్లావే? క్యారేజీ వచ్చినట్టుంది. నా పని వదిలేసి ఎక్కడికెళ్లావు? " గట్టిగా అరిచింది కామేశ్వరమ్మ.

"ఒస్తున్నానమ్మగారూ! అమ్మాయిగారికి కాఫీ కావాలంటేనూ.." అంటూ చేతిలో కాఫీ కప్పుతో వచ్చి ఆవిడకి సమాధానం చెబుతూనే ప్రియంవద దగ్గరికి వెళ్లి కాఫీ కప్పు అందించింది.

"వేళకాని వేళ కాఫీలేంటమ్మాయ్? నీకు కాఫీలు, టీలూ బాగా అలవాటా? మానుకోవాల్సి వస్తుంది" అందావిడ హెచ్చరికగా.

ప్రియంవద బిత్తరపోయి గౌరి వైపు చూసింది. 'తాగండి' అన్నట్టు సైగచేసి గౌరి వెళ్లిపోయింది. మౌనంగా కాఫీ తాగుతూ కిటికీలోంచి బైటికి చూడసాగింది.

గౌరి స్వరం వినిపించింది. "రండి, మీరు స్నానం చేద్దురుగానీ. ప్రయాణం చేసొచ్చారుకదండి అమ్మాయిగారూ, పొద్దననంగా బయల్దేరారు ఆ రైల్లో.. తలనొప్పిగా ఉందన్నారు" అంటోంది.

"క్యారేజీ వచ్చింది. ఆ క్యారేజీలో ఉన్నది ముగ్గురం తినచ్చు. బోలెడిస్తాడు వాడు" అంది ముసలావిడ గట్టిగా.

ప్రియంవదకి అబ్బా అనిపించింది.

తనకసలు ఇప్పుడు అన్నం తినాలని లేదు. పైగా మెస్సు భోజనం, అమ్మ చేతి వంట, అమ్మమ్మగారి చేతి వంట తప్ప తనకసలు ఏమీ సయించదు. అందులోనూ పెద్దవాళ్లకోసం ప్రత్యేకంగా చేయించిన వంట, ఉప్పు, కారం లేకుండా.

"సర్లెండి. అలాగే చేద్దాం.. రండి" అంటూ గౌరి ఆవిడని వాకర్ సహాయంతో నడిపించుకుంటూ బాత్‌రూమ్‌వైపు తీసుకెళ్లింది.

★ ★ ★

'వీళ్లకసలు సంస్కారం, మొహమాటం ఏమీ లేవు కాబోలు' అనిపించింది ప్రియం

వదకి.

ముందు ఫోన్ చేయాల్సిన వాళ్లకు చేసింది. "నేను చేరాను అమ్మమ్మగారూ.. సేఫ్! మొత్తానికి గూట్లో చేరాను" అంది నవ్వుతూ.

"ఏం ఇబ్బంది కాలేదుగా? ఏ ట్రైన్‌కి వచ్చావు, ఎప్పుడు బయల్దేరావని ముసలి వాళ్లు యక్షప్రశ్నలేయదుగా? "

"లేదులెండి, పెద్దగా పట్టించుకోలేదు. గుంటూరు నుంచి వచ్చానన్నాను. నేరుగా ఇటే వచ్చాననుకున్నారు"

"మీ అమ్మ గురించి ఏం చెప్పావు? "

"అంకుల్, శాస్త్రిగారు చెప్పమన్నదే చెప్పాను"

"మంచి పనిచేశావు.. జాగ్రత్తగా ఉండు. వాళ్లేమన్నా కొంతకాలం పట్టించుకోకు"

"అలాగే పట్టించుకోను. కానీ, ఏంటో ఇంట్లోకి అడుగుపెట్టగానే ఏదో చాలా భయం వేసిందమ్మమ్మగారూ"

"అలాగే ఉంటుందిలే ఆ ఇంట్లో. ఫర్లేదు, రోజూ దీపం పెడుతుండు దేవుడికి"

"అలాగే"

"గాడ్ బ్లెస్‌యూ! అంకుల్‌కి కూడా మెయిల్ ఇవ్వు"

"ఫర్లేదు. కాల్ చేస్తాను. బెంగళూరేగా... నా సెల్‌లో రోమింగ్ ఉంది"

"సరే.. నీ ఇష్టం. జాగ్రత్త!"

"అలాగే"

ఫోన్ పెట్టేసి, ఊపిరి పీల్చుకుంది ప్రియంవద. గోపాల్‌కి కూడా ఫోన్ చేయబోయి ఆగిపోయింది. 'ఆఫీసులో ఉంటారు. డిస్టర్బ్ చేయడం దేనికి? సాయంత్రం చేయచ్చుకదా' అనుకుంటూ ల్యాప్‌ట్యాప్ తీసుకుని ఆన్ చేసింది.

అయితే ఆమెకి ఎక్కువసేపు ఆ ఆనందం దక్కలేదు. మధ్యాహ్నం పన్నెండవుతుండగా గౌరి వచ్చి "అమ్మాయిగారూ! రండి, భోంచేద్దురుగాని" అని పిలిచింది.

నిస్సహాయంగా చూసింది ప్రియంవద. "నాకు ఆకలి లేదు గౌరీ" అంది.

"అమ్మో! ఆ మాట అనమాకండి. ఆరూరుకోరు. రండి, ఏం తిన్నా ఆరితోటే తినాలి. మీరిప్పుడు ఆకల్లేదంటే నేనేదో మీకు రగస్యంగా తింటానికేదో తెచ్చి పెట్టాననుకుంటారు. ఎంత తినాలనిపిస్తే అంతే తినండి" అంది.

ఉసూరుమంటూ లేచి బైటికి నడిచింది ప్రియంవద.

క్యాబేజీ కూర, ఏదో ఆకుకూర పప్పు, నిజానికి ఆ భోజనం ఇద్దరికే సరిపోతుంది. కానీ వాళ్లు పెద్దవాళ్లవడం వలన ఎక్కువ తినలేక రాత్రికి కొంచెం దాచుకుంటారు అందులోనే. ఇప్పుడు మూడో వ్యక్తి వచ్చింది కాబట్టి అందులోనే సర్దుకున్నారు. ప్రియంవద నీళ్లు కారుతున్న ఆ క్యాబేజీ కూర తినలేక బలవంతంగా కొంచెం తిని కంచం తీయబోతుంటే ఆవిడ కఠోరంగా అంది "ఎందుకమ్మాయ్ అన్నం పారేస్తున్నావు? చెప్పానా దుబారాలు మాకు ఇష్టం ఉండదని"

ప్రియంవదకేం చెప్పాలో అర్థం కాలేదు. బిక్కచచ్చినట్టు నిలబడిపోయింది.

"మజ్జిగ పోసుకుని తిను" అంది ఆవిడ మళ్లీ.

ప్రియంవద మౌనంగా గౌరి వైపు చూసింది.

గౌరి ఏం మాట్లాడకుండా పల్చటి మజ్జిగ తెచ్చి పోసింది.

కాస్సేపు బలవంతంగా అలాగే నాలుగు మెతుకులు తిని, వాంతి వస్తున్నట్టు అనిపించి చివుక్కున లేచింది ప్రియంవద.

ఆవిడేదో అనబోయి ఏమనుకుందో గుర్రుగా చూసి మౌనంగా ఉండిపోయింది.

అక్కడినుంచి గబగబా తన గదిలోకి

వెళ్లిపోయి ఊపిరి పీల్చుకుంది. 'బాబోయ్ ఆవిడ చూపులు అసలు బాగాలేవు. చాలా ఇరిటేటింగ్‌గా ఉంది' అనుకుంది. పడుకోవాలనిపించింది. చూస్తే పరుపుమీద దుప్పటి లేదు. కుర్చీ జరుపుకుని కూర్చుంది. అలా కిటికీలోంచి బైటికి చూస్తుంటే ఏదోలా అనిపిస్తోంది.

ఆ ఇంట్లో ఎందుకో ప్రశాంతంగా అనిపించడం లేదు. మనసంతా ఆందోళనగా, దిగులుగా ఉంది. ఇల్లు అన్నాక ఉదయం పూట ఒక పవిత్రత ఉంటుంది.

తన ఇల్లు గుర్తుకు తెచ్చుకుంది. అమ్మ ఐదింటికే లేచి వాకిలి ఊడ్చి ముగ్గులేస్తుంది. ఆ చిన్న రెండుగదులూ శుభ్రంగా ఊడ్చి ప్రతిరోజూ తడి బట్టతో తుడుస్తుంది. స్నానం చేసి గూట్లో ఉన్న దేవుడి పటాల ముందు దీపం పెట్టి అగరువత్తులు వెలిగించి, పూజ చేసుకుంటూ తనకి వచ్చిన శ్లోకాలు చదువుకుని, నైవేద్యం పెట్టి, హారతిస్తూ గంట మోగిస్తుంటే ఆ గంట శబ్దం ఎంత హాయిగా అనిపిస్తుంది. అగరువత్తుల పరిమళం ఇల్లంతా వ్యాపించి తను నిద్రలేచేటప్పటికి ఒక ఆహ్లాదకరమైన వాతావరణం ఏర్పడుతుంది.

'ఇదేంటి ఈ ఇంట్లో దేవుడు, దీపం, వాకిలి ఊడ్చుకోడం.. ఇలాంటివేం లేవా? శ్మశానంలా అనిపిస్తోంది. ఈ ఇంట్లో తనకి సెక్యూరిటీ ఉండడం ఏంటి? భయంగా ఉంటేనూ.. ఎందుకో వాళ్ల మాటలు వింటుంటే భయం వేస్తోంది. ఈ ఇంట్లో తను ఉండగలనా? తను తీసుకున్న నిర్ణయం కరెక్ట్ కాదేమో. ఎందుకింత సాహసం చేస్తున్నానా? తెలిసితెలిసీ ముళ్ల మీద కాలేసానా? వీళ్ల మాటల్లో ఎక్కడా కొంచెం కూడా వాత్సల్యం, ఆప్యాయత లేదు. మర్యాద ఇవ్వకపోయినా కొంచెం వాత్సల్యం చూపించవచ్చుకదా! ఏంటి వీళ్ల మనస్తత్వాలు? కొత్తమ్మాయి అని కూడా లేకుండా ఎంత ఆమర్యాదగా ప్రవరిస్తున్నారు' అనుకుంది ప్రియంవద.

వెంటనే గోపాల్ అంకుల్ మాటలు గుర్తొచ్చాయి.

'ఆయన మాటలు, ఆవిడ మాటలు, ప్రవర్తన నీకు ఇబ్బందిగా అనిపిస్తాయి. కానీ కొంతకాలం భరించాలి, తప్పదు'

'నా వల్ల కాదేమో అంకుల్' దిగులుగా అనుకుంది.

ఆలోచనల్లోంచి తప్పించుకోవడానికి కుర్చీలోంచి లేచి ల్యాప్‌టాప్‌ను బ్యాగులోంచి తీసుకుని దాన్ని ఓపెన్ చేసింది.

మానిటర్ మీద 'యువర్ బ్యాటరీ ఈజ్ లో' అని మెసేజ్ కనిపించి, బ్యాగ్‌లోంచి చార్జర్ తీసుకోవడానికి లేచింది.

చార్జర్ తీసుకుని ప్లగ్‌లో పెట్టుకోడానికి చూస్తే ఎక్కడా పవర్‌పాయింట్ కనిపించలేదు. అన్నీ పాతకాలంనాటి స్విచ్‌బోర్డులే.

'అయ్యో ఎలా? సెల్ కూడా చార్జి చేసుకోవాలి' అనుకుంటూ అలాగే ల్యాప్‌టాప్ ఒళ్లో పెట్టుకుని కూర్చుండి పోయింది.

కాసేపట్లో గౌరి అన్నీ సర్దేసి వచ్చింది. ఆమె చేతిలో దుప్పట్లు, దిండు కవర్లు ఉన్నాయి.

పరుపు మీద దుప్పటి పరుస్తూ రహస్యంగా అంది "నాకు తెలుసులెండమ్మాయి గారూ! ఆ మెస్సు కూడు మీకు నచ్చదని. పోనీలెండి సాయంకాలం సామాను తెస్తాను. మీరే వండుకుందురుగాని. ఆ భోజనం వాళ్లకే సరిగా చాలదు. అందులో మీక్కూడా పెడతామంటారు. ఒట్టి కక్కుర్తి మనుషులు!"

"ఫర్లేదులే గౌరీ.. తిన్నాను కదా" అంది ప్రియంవద.

"మీకు తెలీదులెండి, మెల్లిగా తెలుసుకుందురుగాని వీళ్ల కథలు. ఏం చేసుకుంటారో డబ్బు! కాటికి కాళ్లు చాచుకుని కూడా

కక్కుర్తే. ఏం మనుషులో? ఉండండి ఇప్పుడే వస్తాను" అంటూ మళ్లీ హాల్లోకి వెళ్లింది గౌరి.

'ఏం చేయడం? ' అసహనంగా అనుకుం టూ కిటికీ దగ్గరకు నడిచింది.

కిటికీలోంచి బైటికి చూస్తుంటే ఎదురుగా మేడ, ఆ పక్కనే అపార్ట్‌మెంట్, అన్నీ కని పిస్తున్నాయి. కాంపౌండ్‌వాల్ అడ్డంగా ఉండడంతో రోడ్డుమీద నడిచేవాళ్లు కనిపిం చడం లేదు. నల్లగేటుకి తాళం లోపలి నుంచి వేసి ఉంది. చూస్తుంటే ఆ తాళం తుప్పుపట్టినట్లు ఉంది. 'వీళ్లకి వీధివైపు గేటు తీయడం అంటే భయం దేనికో? ' అనుకుంది.

గేటుముందు గచ్చుంతా ఎండుటాకు లతో, చెత్తాచెదారంతో నిండి ఉంది. 'ఇలా ఉంటే ఇంటికి దరిద్రం పట్టుకుంటుంది అనేది అమ్మ. అందుకేనేమో ఈ ఇంట్లో ఈ మానసిక అశాంతి' అనిపించింది ప్రి యంవదకు.

కాసేపలా కూర్చున్నాక హాల్లోంచి కామే శ్వరి స్వరం వినిపించింది "గౌరీ! పోయిన వారం ఇచ్చిన డబ్బుల లెక్కలన్నీ రాశావా? "

"నేనేడ రాస్తాలెండమ్మా.. నాకేం సదువా, సట్టుబండలా? మా ఆయనతో రాయించాను. ఇంద.." గౌరీ జాకెట్టులో దాచుకున్న పర్స్ తీసి, అందులోంచి ఓ కాగితం మడత తీసిచ్చింది.

"కరెక్ట్‌గా రాశావా అన్ని లెక్కలు? "

"తెచ్చిన సామాన్లన్నిటికీ బిల్లులిచ్చాను క దండీ! ఆ బిల్లులు తీసుకుని, ఈ లెక్కలతో పోల్చుకోండి"

గౌరి మాటల్లో నిర్లక్ష్యం! ఆమె లేకపోతే ఈ ఇంట్లో గడవడం కష్టం మరి. ఆ బల హీనతతోటే ఆమె ఏం మాట్లాడినా వీళ్లు భరిస్తున్నారు. దాపరికం లేకుండా మొహం మీదే అన్నీ అనేస్తుంటుంది.

"ఇదిగో ఈ డబ్బులు పట్టికెళ్లి బియ్యం, పప్పులవీ పట్రా. రేపట్నించి ఆ పిల్ల వంట చేస్తుంది. దుబారా చేయకుండా దగ్గరుండి చేయించు. కాఫీలనీ, టీలనీ పాలు ఎక్కువ కొనకు. ఆ పిల్లకి కాఫీలు, టీలు అలవాటు న్నట్టుంది"

వద్దనుకున్నా ఆ మాటలు ప్రియంవదకి వినిపిస్తున్నాయి.

ఆపుకోలేనంత కోపం వచ్చింది. తమా యించుకుని గౌరి మాటలకోసం చెవులు రిక్కించింది.

"కాఫీ, టీలే కదండీ, సదువుకున్నోళ్లకి అవి లేకపోతే గడవదు. ఈ లెక్కలన్నీ కట్టమాకండి. అమ్మాయిగారు బాధపడ తారు. అయినా ఇంతకాలానికి మనవరా లొచ్చింది. ముద్దాముచ్చట్లు చేయండి" అంది గౌరి.

"మనవరాలా? పాడా? మాకేం చుట్ట రికం లేదు. ఎవరిపిల్లో, ఏం కులమో? పెద్దాయన ఉత్తరం ఇచ్చి పంపించాడని ఊరుకున్నా. ఇంతకీ ఏం కులమో అడగ లేదే, ఏవండీ ఆ పిల్లది ఏం కులమట? అడిగారా? మాంసాలు, పాడు తింటుం దేమో, ముందే చెప్పండి. అవన్నీ ఇక్కడ కుదరదని"

"అవన్నీ తింటే మూటా ముల్లె సర్ది

పంపించేయడమే" సుందరయ్య స్వరం.

ప్రియకి అవమానంగా అనిపించింది. మొహం జేవురించింది. తను కోరికోరి పులి గుహలోకి వచ్చిందేమో అనిపించింది. ఒక్కక్షణం కూడా అక్కడ ఉండాలనిపించలేదు.

నిజంగా గౌరీ అంటున్నట్టు ఇది శ్మశానమే. పరిశుభ్రతలేని పరిసరాలు, పవిత్రత లేని ఇల్లు, స్వచ్ఛత లేని మనుషులు.. ఏం ఇల్లిదీ? ఏం మనుషులు వీళ్లు? పెద్దవాళ్లు, లేవలేనివాళ్లు.. ఎవరి సాయం కోసమైనా ఎదురు చూస్తుంటారు.. పలకరించే మనిషికోసం పలవరిస్తుంటారు, వీళ్లేంటి? ఏదో నేరం చేసి, పట్టుబడకుండా ప్రయత్నిస్తున్న వాళ్లలా ఈ చీకటి బతుకేంటీ?

తను ఈ ఇంట్లో ఉండాలంటే ప్రతిక్షణం ఓ నరకం.

ఈ నరకంలో ఉండాల్సిన అవసరం తనకేం ఉంది? ఎందుకుండాలి?

ఆప్యాయతలకీ, అభిమానాలకీ, అనుబంధాలకీ విలువలేని ఈ మనుషుల దగ్గర బతికేకన్నా కీకారణ్యంలో భయంకరమైన జంతువుల దగ్గర హాయిగా బతకవచ్చు. ఊహు.. ఉండలేను. నేనిక్కడ ఎట్టి పరిస్థితుల్లో ఉండలేను. అంకుల్‌కి చెప్పాలి.. నేనిక్కడ ఉండలేనని చెప్పేయాలి.

"అమ్మాయిగారూ! ఏం చేస్తున్నారు? కాస్సేపు పడుకోండి. ఉతికిన దుప్పటి పరిచాకదా.. మీకేం అనుమానం అక్కర్లేదు. అప్పుడప్పుడూ దుప్పట్లు ఉతికి ఉంచుతాను. ఆల్లకైనా పక్కబట్టలు మారుస్తుండాలిగా" అంటూ వచ్చింది గౌరి.

"నాకు నిద్రరావడం లేదుగానీ, ఇది చార్జి పెట్టుకోవడానికి పవర్ పాయింట్ కనిపించడంలేదు.. ఎక్కడ పెట్టుకోను? " అని అడిగింది ల్యాప్‌టాప్ చూపిస్తూ.

"ఏంటండి అది? కంప్యూటరా? ఇక్కడెక్కడా పెట్టుకోవడానికి లేదు. ఆ.. ఉండండి" అంటూ మంచానికి వెనకవైపు ఉన్న స్విచ్‌బోర్డు చూపిస్తూ అదిగో.. అక్కడ పెట్టుకోండి" అంది దుప్పటి సరి చేస్తూ.

"థాంక్యూ" అంటూ స్విచ్‌బోర్డ్ దగ్గరగా నడిచి చార్జర్ ప్లగ్ పెట్టబోతూ సన్నగా అరిచి చేయి వెనక్కి తీసుకుంది ప్రియంవద.

"షాక్కొట్టిందేంటండి? ఇక్కడ ఏది సరిగా ఉందిలెండి. మీరేం బాధపడమాకండి.. రేపు మా ఆయనకి చెప్పి మీకేం కావాలో చెబితే బాగు చేయిస్తాను" అంది గౌరి.

ప్రియంవద ఉసూరుమంటూ ల్యాప్‌టాప్ అలాగే వదిలేసి వచ్చి మంచం మీద కూర్చుంది.

గౌరి ఆమెకి కొంచెం దగ్గరగా కింద కూర్చుని రహస్యంగా అడిగింది "మీరెందుకిక్కడికి వచ్చారమ్మా. వీళ్లేమవుతారు మీకు? "

ప్రియంవద నవ్వి "చెప్పాగా వరుసకి తాత, నానమ్మ. నేనిక్కడ ఉద్యోగం కోసం వచ్చాను" అంది.

"మరైతే, వాళ్లు అట్టా అంటారేంటి? మిమ్మల్ని ఎన్నడూ చూడలేదా? "

"లేదు.."

"అందుకే ఆపేక్ష ఎట్టా ఉంటుంది?

సొంతవాళ్ల మీదే ఉండదు వాళ్లకి. మీ మీద ఏం ఉంటుందిలెండి. నామాట విని హాయిగా ఇంకెక్కడైనా ఉండండి. వీళ్లు మీకు కడుపునిండా తిండికూడా పెట్టరు. వీళ్లలాంటి మనుషుల్ని నేనెక్కడా చూళ్లేదు. చాలా చెడ్డవాళ్లు.. సొంత కొడుకుని చంపేశారని చుట్టుపక్కలవాళ్లందరూ అనుకుంటుంటారు"

ఒక్కసారిగా భయంతో ప్రియంవద ఒళ్లంతా జలదరించింది. నిలువెల్లా వణికిపోయింది.

"నిజం అమ్మాయిగారూ! ఒక కొడుకు వెర్రిబాగులవాడు. బంగారంలాంటి పిల్లని మోసం చేసి వాడికి కట్టబెట్టి, ఆ పిల్లని రాచిరంపాన పెట్టారంట. ఆ పిల్ల ఆ బాధలు భరించలేక ఎంచక్కా ఎదురింటి కుర్రాడిని తీసుకుని లేచిపోయిందిట. ఇంకో కొడుక్కి వెర్రితోబాటు కురూపితనం కూడా ఉండేదట. అందరూ వీళ్లని చూసి అసయ్యించుకునేవాళ్లట.. ఆ అవమానంతో ఓ కొడుక్కి విషం పెట్టి చంపేసిందంట ఆ ముసల్ది"

ప్రియంవద వణికిపోతూ అంది "అలా ఎవరన్నా చంపుతారా సొంత పిల్లల్ని? లేదులే, అదంతా నిజం కాదు. అలాంటివి ఊరికే పుట్టిస్తారు.. నమ్మకూడదు"

"మీలాంటి చదువుకున్నవాళ్లంతా ఇట్టాగే మాట్లాడతారు లెండి. నిజానిజాలు భగవంతుడికెరుక. కానీ, వీళ్లు మాత్రం మంచి మనుషులు కారు.. జాగ్రత్త!" అంది గౌరి స్వరం బాగా తగ్గించి.

ప్రియంవద గుండెలోని ఆవేదనని అణచుకుంటూ అంది "అది సరేగానీ, రేపు ఆ మెయిన్ గేటు తాళం తీసి, వాకిలంతా ఊడుస్తావా? నీకు డబ్బులు నేనిస్తాను"

"అమ్మో!" గుండెల మీద చేయేసుకుని "ఆ గేటు తీశానంటే నాతోలు వలిచేస్తారు ఈ ముసలాళ్లు" అంది గౌరి భయంగా.

"ఏం.. ఎందుకు? " ఆసక్తిగా అడిగింది ప్రియ.

"ఎందుకేంటండి? ఆ గేటు తీస్తే ఇంట్లోకి ఎవరన్నా వచ్చి వాళ్లని చంపేసి, వాళ్ల ఆస్తులు తీసుకుంటారని చాలా భయం"

"ఏం ఆస్తులున్నాయి ఇక్కడ? ఈ ఇల్లేగా.. ఇల్లెలా తీసుకుంటారు? "

"భలేవారే.. నాన్నమ్మగారి మంచం వెనకాల తలుపుంది చూశారా? "

ప్రియ ఆలోచిస్తూ అంది "చూడలేదే. అయినా ఇంకా ఇల్లు మొత్తం చూడలేదు కదా నేను"

"ఆ గది తలుపు తీయనివ్వదు. అందులో ఆయమ్మగారి నగలు, పట్టుచీరెలు, డబ్బు ఉన్నాయంట!"

"ఎవరు చెప్పారు? "

"చుట్టుపక్కల ఇళ్లవాళ్లందరికీ వీళ్ల భాగోతం తెలుసమ్మా"

"గౌరీ ఏం చేస్తున్నావు? ఎక్కడ చచ్చావు? " కామేశ్వరమ్మ స్వరం కఠినంగా వినిపించింది.

"వచ్చేస్తున్నానమ్మగారూ!" అంటూ చటుక్కున కదిలింది గౌరి.

"ప్లీజ్.. నువ్వు రేపు మాత్రం ఆ గేటు తీసి, వాకిలంతా శుభ్రం చేయి. నేను ఎల్లుండి నుంచి అంటే బుధవారం నుంచి జాబ్‌లో చేరుతున్నాను. నేను వెనకనుంచి వెళ్లను. ముందునుంచే వెడతాను. వాళ్లేమన్నా అంటే నేను చూసుకుంటాన్లే. నీకేం భయం లేదు" కొంచెం అభ్యర్థిస్తున్నట్లు అన్నా ఆమె స్వరంలో వినిపించిన ఆదేశానికి కొన్ని క్షణాలు చకితురాలై చూసింది గౌరి. తరవాత మరేం మాట్లాడకుండా తలూపి గదిలోంచి వెళ్లిపోయింది.

ప్రియంవద గౌరి మొహంలో కనిపించిన భావాలకి పల్చగా నవ్వుకుంది. మంచం మీద వాలుతూ ఎదురుగా కనిపి

స్తున్న షెల్ఫ్ చూస్తూ 'రేపు ఆ షెల్ఫ్‌లో ఉన్న చెత్తంతా బైటపారేసి, ఈ గది ఫినాయిల్‌తో కడిగించాలి' అనుకుంది.

అయితే ప్రియంవద చెప్పినట్లు గౌరి చేయలేదు.

మర్నాడు ఆమె చేస్తుందేమో అని ప్రియంవద ఎదురుచూసింది. అసలా విషయమే గుర్తులేనట్లు గౌరి తప్పించుకు తిరిగింది.

ఇంట్లోకి కొంచెంకొంచెం బియ్యం, పప్పులు, ఉప్పు, కారం, కూరగాయలు వచ్చి చేరాయి. గౌరి అన్నీ తెచ్చి పెట్టి కామేశ్వరమ్మగారికి కచ్చితమైన లెక్కలన్నీ చెప్పి చిల్లరతో సహా మిగిలిన డబ్బులిచ్చింది.

ఆవిడ ప్రియంవదని పిలిచి "ఇదిగో అమ్మాయ్! సామానొచ్చింది. జాగ్రత్త! వంట చక్కగా చేస్తావుగా? " అంది.

"చేస్తానండి.." మృదువుగా జవాబిచ్చింది ప్రియ.

నిజానికి ప్రియ ఎప్పుడూ వంటచేయలేదు. అ అవసరం, అవకాశం కూడా ఆమెకి రాలేదు.

కానీ, ఇక్కడికి పంపించే ముందు గోపాల్ ప్రియంవద తల్లికి చెప్పాడు. 'పిండివంటలు కాకపోయినా మామూలు వంటలు నేర్పించమ్మా. ఆడపిల్లకదా.. వంటగదిలోంచే మొదలవుతుంది అసలు కథ' అంటూ.

అతని మాటల మీద అత్యంత గౌరవంతో ఆవిడ ప్రియంవదకి బెండకాయ, దొండకాయ, బంగాళాదుంపల వేపుడు, క్యాబేజీ, పెసరపప్పు కూర, మామిడికాయ, ఆకుకూరలు మొదలైన వాటితో చేసే కలగలుపు పప్పు, పప్పుచారులాంటి సులువైన వంటలు నేర్పించింది. చూపిస్తుండగానే చకచకా చేసేస్తున్న కూతుర్ని చూసి ఆడపిల్లలకి వంట రాకపోవడానికి అదేమన్న బ్రహ్మ విద్యా? అనుకుంది మురిపెంగా.

ఆ ప్రాక్టికల్స్ ఈరోజు బాగా ఉపయోగపడుతున్నందుకు చాలా సంతోషంగా అనిపించింది ప్రియంవదకి.

అదృష్టవశాత్తూ తను చేసిన వంట పెద్దవాళ్లిద్దరికీ నచ్చినట్టుంది. మెచ్చుకోకపోయినా వంక పెట్టకుండా తినేశారు.

చాలిది అనుకుంది.

మర్నాడు గౌరిభర్త వచ్చి ప్రియకి ల్యాప్‌టాప్, సెల్‌ఫోన్ చార్జి చేసుకోడానికి ఒక ప్లగ్‌పాయింట్ ఏర్పాటుచేసి వెళ్లాడు. దానికి కావాల్సిన డబ్బులు ప్రియే ఇచ్చి చేయించుకుంది. అతనికి కొంచెం ఎలక్ట్రికల్ పని తెలిసి ఉండడం తన అదృష్టం అనుకుంది ప్రియ. 'అందుబాటులో ఉన్నాడు ఎలక్ట్రీషియన్ లేకపోతే ఎంత ఇబ్బంది? ' అనుకుంది.

ఆ రోజు గోపాల్‌కి మెయిల్ ఇచ్చింది. తను వచ్చిన దగ్గర్నించి జరిగిందంతా పూసగుచ్చినట్లు రాసి, చివరలో ఇలా రాసింది. 'అంకుల్ వీళ్లలాంటి మనుషులుంటారని వీళ్లని చూడకుండా ఉండి ఉంటే ఎవరన్నా చెప్పినా నమ్మేదాన్ని కాదు. బాప్‌రే! రియల్లీ టిపికల్ కపుల్. నాకు మాత్రం చాలా సహనం కావాలి. నాకు కావల్సిన సహనం ప్రసాదించమని బాబాని కోరండి ప్లీజ్'

అట్లాగే తల్లికి కూడా ఉత్తరం రాసింది.

'అమ్మా.. నేను గూటికి చేరాను. కానీ ఆ గూట్లో రాబందులున్నాయి. వాటితో నీ చిన్నారి పిచుక ఎలా స్నేహం చేస్తుందో, ఎలా కలిసి ఉంటుందో? చూద్దాం. నా సంగతి తెలుసుగా.. అనుకున్నానంటే సాధించి తీరుతాను. కాబట్టి నువ్వేం బెంగ బెట్టుకోకు. బి హ్యాపీ.. నీ ఆరోగ్యం జాగ్రత్త! మన ఆపరేషన్ పూర్తి చేయడానికి ఎక్కువ సమయం తీసుకోను. వీలైనంత త్వరలో పూర్తి చేస్తాను.

నీ ప్రియ'

మధ్యాహ్నం మూడైంది. పెద్దవాళ్లిద్దరూ మంచి నిద్రలో ఉన్నారు.

ప్రియంవద తలుపులు వేసుకుని తన గది సర్దుకోవడానికి ఉపక్రమించింది.

షెల్ఫుల్లో ఉన్న చెత్తంతా తీసి ఒక పెద్ద ప్లాస్టిక్ కవర్‌లో వేసింది.

చీపురు, పాత బట్ట తీసుకుని షెల్ఫులు తుడిచేసింది. గోడకి ఒకదానిమీద ఒకటి తగిలించిన క్యాలెండర్‌లన్నీ తీసి చింపి కవర్‌లో పడేసింది. మంచం కింద రాత్రి చప్పుడైన పెట్టెను ముందుకు లాగింది. నల్లటి ఇనప్పెట్టె, దానికి తాళం లేదు. దుమ్మును బట్టతో తుడిచి మూత తెరిచింది. దాన్నిండా ఫొటోలు. ఒక్కో ఫొటో తీసి చూస్తుంటే చెదలు పట్టిన ఫొటోల్లో ఉన్న పొడి విరిగిన ఫ్రేముల్లోంచి పడుతోంది.

అన్నీ ఎప్పటివో.. ముసలాళ్ల పెళ్లి ఫొటోలు, బ్లాక్ అండ్ వైట్, బట్టల్లేకుండా తీసిన చిన్నపిల్లల ఫొటోలు, గ్రూప్ ఫొటోలు.. అన్నీ కూడా అస్పష్టంగానే ఉన్నాయి. కొన్ని సగం చిరిగి ఉన్నాయి. ఆఖరున రెండు ఫొటోలు మిగిలాయి. మొదటి ఫొటో తీసింది. ఆ ఒక్క ఫొటో మాత్రమే కొంచెం బాగుంది. పెళ్లికూతురు, పెళ్లికొడుకు మెడలో పూలదండలతో ఇనప కుర్చీల్లో కూర్చుని ఉన్నారు. ఎవరివో.. అనుకుంటూ పెళ్లికూతురివైపు చూసి, ఉలిక్కిపడింది. విశాలమైన నేత్రాలు, ఉంగరాలు తిరిగిన నల్లటి జుట్టు, లేతగా, గులాబీరేకుల్లా ఉన్న పెదాలు నాజూగ్గా, అందంగా ఉంది.. పెదవి కింద గడ్డం మీద కుడిపక్క కనిపిస్తున్న పుట్టుమచ్చ మీద ఆమె చూపులు నిలిచిపోయాయి. పెళ్లికొడుకు కళ్లు కూడా పెద్దగా ఉన్నా, ఆ కళ్లలో జీవం లేదు. చూపులు ఎటో ఉన్నాయి. మొహంలో ఏ మూల చూసినా ఇసుమంత కూడా తేజస్సు లేదు. చూడగానే తెలిసిపోతోంది అతనొక వెర్రిబాగులవాడని. చూస్తుండగానే ఆమె కళ్లు నీటితో నిండిపోయాయి. బట్టతో శ్రద్ధగా తుడిచి పక్కన పెట్టింది.

తన బ్యాగులోంచి మరో ఫొటో తీసింది. కళ్లనిండా నీళ్లతో, అమాయకంగా పుట్టెడు దుఃఖాన్ని, కొండంత అవమానాన్ని దిగమింగుకుంటూ కూర్చుంది అమ్మాయి. ఆ అమ్మాయికి బోడిగుండు, నుదుటి మీద దెబ్బ తగిలింది కాబోలు ప్లాస్టర్ వేసి ఉంది. మెడలో పసుపుతాడు, ముతకచీర కట్టుకుని ఉంది. పెదవి కింద, గడ్డం మీద కుడివైపు పుట్టుమచ్చ. రెండు ఫొటోలు పోల్చి చూసుకుంది.

ప్రియంవదకి దుఃఖం ఆగలేదు.

ఫొటోలన్నీ తిరిగి పెట్టెలో పడేసి, దాన్ని మంచం కిందికి తోసేసింది. ఆఖరున చూసిన ఫొటో మాత్రం శుభ్రంగా తుడిచి తన దగ్గర ఉన్న ఫొటోతో బాటు తన సూట్‌కేసులో పెట్టుకుంది. చెంపలమీదికి జారుతున్న కన్నీరు తుడుచుకుంటూ, మంచంమీద వాలిపోయి కరువుతీరా ఏడ్చింది. ఆ ఏడుపులోనే స్థిరంగా నిర్ణయించుకుంది.

'అమ్మా! నేను తప్పకుండా నా లక్ష్యం నెరవేరుస్తాను. ఏం జరిగినా సరే, ఇంత కాలం నువ్వు మానసికంగా అనుభవించిన

చిత్రవధ నుంచి నీకు రిలీఫ్ ఇస్తాను. ఆడవాళ్లంటే వాళ్లకు తెలిసిన నిర్వచనం మార్చేస్తాను. ఆధునిక యువతిగా నేనేంటో రుజువు చేస్తానమ్మా.. చేస్తాను.. తప్పకుండా చేస్తాను'

అలా అనుకున్నాక ప్రియకి కొంచెం సాంత్వనగా అనిపించింది.

మంచంమీంచి లేచి తలుపు తీసుకుని బైటకి వచ్చింది. పెరట్లోకి వెళ్లి చన్నీళ్లతో మొహం కడుక్కుంది.

చున్నీతో మొహం తుడుచుకుంటూ పెరడంతా కలయచూసింది. అప్పుడే ఎండ తగ్గుమొహం పడుతోంది.

వేప, రావిచెట్ల నీడ పడిన చోట చల్లగా, హాయిగా ఉంది. ఒక గమ్మత్తైన పరిమళం గాలిలో తేలివస్తోంది. కాంపౌండ్‌వాల్ అవతల ఉన్న ఇంటివాళ్ల పెరట్లోంచి పని మనిషి చేస్తున్న గిన్నెల చప్పుడు అస్పష్టంగా వినిపిస్తోంది.

గౌరి ఎందుకు ఇదంతా క్లీన్ చేయమంటే చేయడంలేదు. ఇదంతా పరిశుభ్రంగా ఉంటే ఇక్కడ కుర్చీలేసుకుని కూర్చుంటే ఎంత బాగుంటుంది!

ఎందుకు భయపడుతోంది? ఏమవుతుంది ముందు గేటు తీస్తే?

సరే కానీ, ఇంకొక్క రోజు చూస్తాను. చేయకపోతే నేనే చేస్తానని అనుకుంది నిశ్చయంగా.

కాస్సేపలా చుట్టుపక్కల తిరిగి ఆ అపరిశుభ్రంగా ఉన్న పరిసరాలు చికాగ్గా అనిపించి లోపలికి వచ్చేసింది.

★ ★ ★

మర్నాడు ప్రియంవద ఉద్యోగంలో చేరే రోజు.

త్వరగా లేచి స్నానంచేసి, దుమ్ముకొట్టుకుపోయి జిడ్డుగా ఉన్న దేవుడి ఫొటోలు, ఆ గూడు శుభ్రం చేసింది. నూనెతో, కాలిన వత్తులతో ఉన్న ఇత్తడి కుందిని శుభ్రంగా కడిగి దీపం పెట్టింది.

అప్పుడే వచ్చిన గౌరి ఆమెని ఆశ్చర్యంగా చూసింది.

“మీకు బాగా భక్తి ఉన్నట్టుందమ్మాయి గారూ!” అంది.

“ఇంట్లో దీపం పెట్టాలి కదా” అంది ప్రియంవద.

“సర్లేండి.. వారానికోసారి, అదీ శనారం అయ్యగారు పెడతారు”

“అవునా? పాపం పెద్దాయన ఆయనకి చేతకాదు. నువ్వన్నా ఈ గూడు, పటాలు శుభ్రం చేయచ్చుకదా? ”

“నేనా? మంచోరే.. నన్ను ముట్టుకోనివ్వరమ్మా”

“అలాగా!” ప్రియంవద ఎందుకు అని అడగలేదు.

మౌనంగా వంటపనిలో మునిగింది. ఆ రోజు పప్పు వండే టైం లేదు. ఆ ఇంట్లో ఎక్కడా కుక్కర్ కనిపించలేదు. అన్నం వార్చాలి. లేదంటే అత్తెసరు పెట్టాలి. తనకి రెండూ చేతకాదు. గౌరి సాయంతో అన్నం వండేసింది. వండే ఆ గిన్నె కూడా ఇత్తడిది. స్టీలు గిన్నెలు చాలా తక్కువగా ఉన్నాయి. మంచినీళ్లు తాగే గ్లాసులు ఎప్పటివో నల్లగా చారలు వచ్చాయి. కంచాలు వంకర్లు పోయి ఉన్నాయి. సాయంత్రం వస్తూవస్తూ, కొంత సామాను కొనుక్కురావాలనుకుంది.

వంకాయ కూర చేసి, అన్నం వండింది. రసం పెడదామంటే రసం పొడిలేదు. తనకి ఇంట్లో తయారు చేయడం రాదు.

గౌరికి చెప్పింది “పెరుగు తీసుకొచ్చి, కూర, పెరుగుతో వాళ్లకివాళ వడ్డించెయ్. రేపు చూద్దాం”

“అలాగేలెండి.. వాళ్లు తినే తిండికి ఎన్ని వంటలు కావాలిలెండి? ” అంది గౌరి నిర్లక్ష్యంగా.

“మీరేం తినరా? క్యారేజీ తీసికెళ్లరా? ”

అడిగింది మళ్లీ.

"లేదు, నాకేం బాక్సులు కనిపించలేదు. వదిలెయ్, నేను బైట తినేస్తాను. వాళ్లతో అనకు" అంటూ తను తయారవడానికి గదిలోకి వెళ్లిపోయింది.

గౌరి తోమడానికి గిన్నెలన్నీ పెరట్లో వేసుకోసాగింది.

ఆకుపచ్చ చుడీదార్ వేసుకుని, అందంగా ముస్తాబై భుజానికి హ్యాండ్‌బ్యాగ్ వీపుకి ల్యాప్‌టాప్ బ్యాగ్ వేసుకుని హాల్లోకి వచ్చి పెద్దవాళ్ల మంచాలవైపు చూసింది ప్రియ.

అర్థరాత్రి దాకా టీవీ చూశారు. ఎప్పుడు పడుకున్నారో? త్వరగా లేవరు. కాఫీలు, టీలు తాగరు. లేచి స్నానాలు చేసి నేరుగా అన్నాలు తింటారు. మధ్యాహ్నం కాస్సేపు పడుకుని మళ్లీ ఐదింటికి లేచి బైట నుంచి తెప్పించుకున్న బిస్కెట్లు, స్వీట్లు తింటారు. అంత వయసొచ్చినా ఇద్దరికీ కూడా బీపీ, షుగరు లేదంటుంటే ఆశ్చర్యం వేసింది ప్రియకి. అవునులే దిగులూ, చింతా లేని వాళ్లకి ఏం జబ్బులుంటాయని అనుకుంది. అయినా పిసినారివాళ్లు డాక్టర్‌కెప్పుడన్నా చూపించుకున్నారో లేదో?

కొన్ని క్షణాలు అలాగే నిలబడింది ఆలోచిస్తూ.

గోపాల్ మాటలు చెవుల్లో ప్రతిధ్వనించాయి.

'ఉద్యోగంలో చేరడానికి వెళ్లేముందు వాళ్ల పాదాలకి నమస్కరించి, దీవించమని అడుగు'

ఎందుకో మనస్కరించలేదు. మనసులో లేనిది ఎలా నటించగలదు? వాళ్లని చూస్తుంటే.. వాళ్ల మాటలు, ప్రవర్తనకి ఏమాత్రం వాళ్లమీద గౌరవభావం కలగడంలేదు. కానీ తప్పదు.. వేషం వేసుకుని, వేదిక ఎక్కింది. ఇప్పుడు నటన రాదంటే ఎవరూరుకుంటారు?

ఈలోగా ఆవిడ కదిలింది. గట్టిగా ఆవలించింది.

## అన్ని ప్రక్రియల్లోనూ రాశా!



### అత్తలూరి విజయలక్ష్మి

తండ్రి ఏ.ఎల్. నరసింహారావు 'ఈనాడు'లో పని చేశారు. తల్లి అత్తలూరి అనసూయ. నా మొదటి కథ 'వర్ధమాన రచయిత్రి' 1975లో ఆకాశవాణి హైదరాబాదు నుంచి ప్రసారమయింది. దాదాపు రెండువందల కథలు రాశాను. మొదటి నవల 'దత్తపుత్రుడి'తో ప్రారంభించి, 'ప్రతిమాదేవి', 'గూడు చెదిరిన గువ్వలు', 'అమావాస్యతార', 'అర్చన', 'తెల్లగులాబీ' తదితర నవలల్ని రాశాను. మొదటి రేడియోనాటిక 'అభ్యుదయం ఎక్కడ?'. ఆ తర్వాత ముప్ఫై నాటికలు, నలభై నాటకాలు రేడియోలో ప్రసారమయ్యాయి. ఆటావారు నిర్వహించిన నాటికల పోటీలో 'స్పర్శ' నాటికకు ప్రథమ బహుమతి పొందాను. 'ఈ దారి ఎక్కడికి?' 'ఈ కథ ఎవరు రాశారు?' మొదలైన టెలీఫిల్ములు, 'కాంతిరేఖ', 'ఆశలపల్లకి', 'డాక్టర్ రేవతి', 'మేమూ మనుషులమే' తదితర దూరదర్శన్ సీరియల్స్ రాశాను. కవితలు మొదలుకుని దాదాపు అన్ని ప్రక్రియల్లోనూ రాశాను. నా కథలు తమిళ, కన్నడ, హిందీ, ఇంగ్లిష్‌లోకి తర్జుమా అయ్యాయి.

చిరునామా:
**అత్తలూరి విజయలక్ష్మి,**
ఇంటి నెం. 1-4-880/2/11,
ఎస్.బి.హెచ్. కాలనీ,
గాంధీ నగర్,
హైదరాబాద్-500080

ప్రియ నెమ్మదిగా ముందుకు అడుగేసింది.

ఆవిడ పాదాలు కొంచెం గట్టిగా ఆవిడకి స్పర్శ తెలిసేలా తాకింది.

"ఎవరూ? ఎవరదీ? ?" ఆవిడ ఉలిక్కిపడి అడిగింది.

"నేనండి. ఈరోజు ఉద్యోగంలో చేరుతున్నా. మీ ఆశీర్వాదం కోసం.." నసిగింది ప్రియ.

"మండినట్టే ఉంది.. నిద్రలేపి దణ్ణాలు పెట్టాలా? ఉద్ధరించావులే.. వెళ్లు" విసురుగా అందావిడ.

ప్రియకి అవమానంతో మొహం ఎర్రబడింది.

గిరుక్కున తిరిగి బైటకి వచ్చింది.

చెక్క గేటు తీస్తూ వెనక్కి తిరిగి గౌరితో అంది "గౌరీ నీకు ఒక పని చెప్పి రెండు రోజులైంది.. నువ్వు చేయలేదు?"

గౌరికి అర్థమైంది.

నసుగుతూ అంది "ఇక్కడ పని లేటైతే ఇంకా నాలుగిళ్లల్లో చేసుకునేందుకు కష్టం అవుద్దమ్మా.. ఆదారం చేస్తాలెండమ్మా"

"సరే.. ఆదివారం కచ్చితంగా చేయాలి. లేకపోతే ఊరుకోను. నాకు సెంటిమెంట్స్ ఎక్కువ. నేనిలా వెనకవాకిట్లోంచి వెళ్లడం నా కిష్టంలేదు"

"అంటే ఏంటండమ్మా?"

ప్రియ గట్టిగా శ్వాసవిడుస్తూ అంది "ఏదోలే.. నువ్వు మాత్రం కచ్చితంగా ఆదివారం నేను చెప్పిన పని చేయాలి" అంటూ గేటు తోసుకొని వెళ్లిపోయింది.

'ఏంటో ఈ అమ్మాయిగారు! ఉన్నచోట తిన్నగా ఉండక?' అనుకుంటూ తన పనిలో పడింది గౌరి.

ప్రియకి హైటెక్ సిటీకి అంతదూరం నుంచి వెళ్లడం అంటే మొదటిరోజు చాలా కష్టంగా అనిపించింది. కష్టమైనా, ఇష్టమైనా తప్పదుకదా అనుకుని బస్‌కోసం ఎదురుచూస్తూ నిలబడింది.

ఆ తరవాత మిగతా మూడు రోజులూ చాలా బిజీగా గడిచిపోయాయి. ఉదయమే లేచి, వంటచేసి పెట్టి పరుగులు పెట్టడం చిరాగ్గా ఉంటోంది. నాకేం అవసరం ఈ పనంతా? వీళ్లకెందుకు చేయాలి ఈ సేవలు? అనిపిస్తోంది. కానీ ఒక్కసారి మనసుకి సర్ది చెప్పుకుని ఆలోచిస్తే లక్ష్యం సాధించాలంటే ఏదైనా భరించాలి, తప్పదు అనుకుంది.

ఆ రోజు శనివారం. కార్పొరేట్ ఆఫీసులకు శని, ఆదివారాలు సెలవు. కొంచెం ఆలస్యంగా లేచి, అన్ని పనులూ ఆలస్యంగా చేసింది. గౌరిని బైటకి పంపించి బొంబాయి రవ్వ తెప్పించి ఉప్మా చేసింది.

పెద్దవాళ్లిద్దరూ తన వంటకి ఏ వంకా పెట్టకుండా తినేస్తున్నారని గమనించింది. అంతేలే, మెస్సు తిండి తిని మొహం వాచిపోయి ఉంటారు అనుకుంది. ఉప్మాకూడా ఎందుకు చేశావు? ఏంటి? అని అడక్కుండా తినేయడం గమనించింది.

ఉప్మా తిన్నాక వంటగదిలో కూర్చుని ఒక పెన్ను, పేపర్ తీసుకుని ఏమేం సామాను కావాలో లిస్టు రాసుకుంది. పని పూర్తిచేసుకుని వెళ్లిపోతోన్న గౌరితో అంది "గౌరీ ఇంకా ఎన్ని ఇళ్లున్నాయి నీకు?"

"ఇంకా రెండిళ్లలో ఉందమ్మా పని"

"కొంచెం త్వరగా రాగలవా? బజారుకి వెళ్లొద్దాం" అంది ప్రియ.

"ఏం కావాలో నాకు చెప్పండి, తెస్తా"

"నువ్వు తెచ్చేవి కావులే. నేనే వెళ్లాలి. స్టీలు సామాను దొరికే షాపుకి వెళ్లాలి"

"అట్టాగేలెండి, ఓ గంటలో వచ్చేస్తాను" అంటూ వెళ్లిపోయింది.

ప్రియ రెడీ అయి, పెద్దవాళ్లిద్దరికీ వినిపించేలా చెప్పింది "నేను బైటికి వెళ్తున్నాను. వెళ్లి వచ్చాక వంట చేస్తాను"

"ఎక్కడికి?" అనుమానంగా అడిగింది

కామేశ్వరమ్మ.

"పనుందండి" ముక్తసరిగా చెప్పింది ప్రియ.

"ఇదిగో అమ్మాయ్! నీకు ముందే చెప్పాను.. ఆడపిల్లలు పనీపాటా లేకుండా బైట తిరగడం మాకిష్టంలేదని, గుర్తుందా? " కరకుగా అడిగిందావిడ.

ఒళ్లు మండిపోయింది ప్రియకి.

"పనుండి వెళ్తున్నానని చెప్పాకదండి" అంది కోపం అణచుకుంటూ.

"ఏం పని? ఆఫీసు లేదు కదా"

"వచ్చాక చెప్తాను" అంటూ, గౌరి రావడం చూసి, హ్యాండ్‌బ్యాగ్ తీసుకుని బైటికి వచ్చేసింది.

తనతో నడుస్తున్న గౌరితో కచ్చితంగా చెప్పింది "రేపు ఆదివారం ఎట్టి పరిస్థితుల్లో కూడా ఆ ముందువైపు గేటు ఓపెన్ చేయాల్సిందే"

"ఎందుకమ్మాయిగారూ మీకు? ఆల్ల సంగతి మీకు తెలవదు. చాలా దుర్మార్గులు. నాలుగు రోజులుండిపోయే మనుషులు మీరు. ఆల్లతో గొడవెందుకండి? "

ప్రియ కొంచెంసేపు మౌనంగా ఉండి, ఖాళీగా వస్తున్న ఆటో ఆపింది.

తను వెళ్లాల్సిన చోటు చెప్పి ఆటోలో కూర్చుంటూ, గౌరివైపు చూసింది కూర్చోమన్నట్టుగా.

గౌరి ఆమె పక్కన కూర్చుంది.

ఆటో కదిలింది.

ప్రియ నెమ్మదిగా అంది "దుర్మార్గులంటే ఏం చేస్తారు? ఆ గేటు తీస్తే నన్ను చంపేస్తారా? "

"మిమ్మల్నెందుకు చంపుతారండి? కానీ, పెద్ద గొడవలైపోతాయి"

"చూద్దాం ఏం జరుగుతుందో, ఏం జరిగినా నేనే ఎదుర్కొంటాను. నీకేం ప్రమాదం రాదు, సరేనా? "

గౌరికి ప్రియ మాటలు, ఆమె ముఖకవళికలు చిత్రంగా, అనుమానంగా తోచాయి.

సందేహిస్తూనే అడిగింది "అమ్మాయిగారూ.. ఒక మాట అడగనా? "

"అడుగు"

"మీకు నిజంగా వాళ్లతో ఇంతకుముందు పరిచయం లేదా? "

"లేదు. ఏం ఎందుకడుగుతున్నావు? "

"అబ్బే, ఏం లేదు. మిమ్మల్ని చూస్తుంటే, మీ మాటలు వింటుంటే వాళ్లు మీకు బంధువులేమో అనిపిస్తుంది"

నవ్వింది ప్రియ.

"ఏదన్నా బంధుత్వం ఉందేమో.. లేకపోతే ఆ భగవంతుడు నన్ను ఇక్కడికెందుకు పంపిస్తాడు? "

గంభీరంగా పలికిన ఆ స్వరం 'ఏం మాట్లాడకు' అని హెచ్చరించినట్లు వినిపించింది గౌరికి. మౌనంగా రోడ్డుమీద తిరుగుతున్న వాహనాలను చూస్తూ కూర్చుంది.

రెండు కుక్కర్లు, కొన్ని మంచినీళ్ల గ్లాసులు, కొన్ని కాఫీ గ్లాసులు, ప్లేట్లు, కంచాలు, కొన్ని గిన్నెలు, గరిటెలు, చెంచాలు కొన్నది ప్రియ.

అవన్నీ కొంటుంటే 'ఈ అమ్మాయికి పిచ్చేమో' అనిపించింది గౌరికి. లేకపోతే నాలుగు రోజులుండి పోయేదానికి ఈ ఖర్చెందుకు? పోయేటప్పుడు ఇవన్నీ తీసు

కెళ్లిపోతుందా?

ఆమె భావాలు గమనించినదానిలా అంది ప్రియ "ఆ ఇంట్లోని పాతవస్తువులు ముట్టుకోవాలంటే నాకు చాలా అసహ్యంగా ఉంది. ఎన్నేళ్లనాటివో అవి. చాలా రోతగా ఉన్నాయి. రేపు పాత సామానంతా బైట పారెయ్. ఇవి వాడుకుందాం. కుక్కర్ లేకుండా వంట చేయాలంటే చాలా టైం పడుతోంది. నాకంత టైం లేదు. ఇవన్నీ నాకోసమే కాదు. నీ వీలుకోసం కూడా కొన్నాను"

గౌరి ప్రియవైపు చూసి నవ్వింది. అలా చూసి నవ్వడంలో 'ఎంత మంచిదానివి' అనే భావన కనిపించింది.

ఇంటికెళ్లాక చప్పుడు చేయకుండా అన్నీ సర్దేసి, పాత సామానంతా ఒక పెద్ద సంచిలో వేసి, గౌరికిచ్చేసింది. వాళ్లొచ్చి వంటింట్లో సామాన్లేం పరీక్షించే సీను లేదు కదా. వాళ్లకేం చెప్పొద్దనుకుంది. 'ఎక్కడికి వెళ్లొచ్చావు? ' అని అనుమానంగా అడిగిన వాళ్లకి 'పుస్తకాలు కొనుక్కోడానికి వెళ్లానండి' అంటూ గదిలోకి వెళ్లిపోయింది.

వాళ్లేదో సణగడం వినిపించినా తనని కాదన్నట్టు ఉండిపోయింది.

★ ★ ★

మర్నాడు మంచి నిద్రలోంచి అప్పుడే మెలకువ వచ్చింది ప్రియంవదకి.

పక్కమీంచి లేచి అరచేతులు రుద్దుకుని కళ్లకద్దుకుంది. ఒక్కసారి కళ్లు తెరిచి పరిసరాలు పరికించింది.

తనకి బాగా పరిచితమైన తన ఇల్లు కాదు. ఎన్నడూ చూడని చిత్రమైన ఇల్లు. ఆ ఇంట్లో ఉన్న వృద్ధ దంపతులు బిక్కు, బిక్కుమంటూ ఓ తోడు కోసం ఎదురుతెన్నులు చూస్తూ ఉంటారని, తనని సంతోషంగా ఆహ్వానిస్తారని అనుకుంది.

మంచివాళ్లో, చెడ్డవాళ్లో వృద్ధాప్యంలో తమని కనిపెట్టుకుని ఉండేవాళ్లకోసం తపన పడతారు. కానీ వాళ్లు అనుక్షణం తనని డేగకళ్లతో చూశారు. వచ్చిన దగ్గర్నించీ వాళ్లముందు తిరగడానికి వాళ్ల ఎదురుగా కూర్చుని అన్నం తినడానికి ఎంతో ఇబ్బందిగా అనిపిస్తోంది. అక్కడికీ గోపాల్ అంకుల్ అంటూనే ఉన్నాడు 'నీకక్కడ రెడ్‌కార్పెట్ పరచి, హారతి పడతారని ఆశించకు. నీకేవన్నా అటువంటి ఆశలుంటే అవి జరక్కపోయినా బాధపడకు. నీ పని అయిందాకా లౌక్యంగా గడిపిరా. మనకి కావాల్సింది సాధించడమే ప్రస్తుత కర్తవ్యం. నువ్వు ఈ వయసుకి ఎప్పుడొస్తావా అని ఎదురు చూసాను. నా ధ్యేయం నెరవేరాలి, అంతే'

దీర్ఘంగా నిట్టూరుస్తూ నెమ్మదిగా మంచం దిగి, కిటికీ తెరిచింది.

ఆశ్చర్యం!

వాకిలి శుభ్రంగా ఊడ్చి, ముగ్గులేసి ఉంది. తుప్పు పట్టిన నల్లటి ఇనపగేటు ఓ పక్క తెరిచి ఉంది. గేటు బైట చేతిలో ముగ్గు డబ్బా పట్టుకుని పక్కింటివాళ్లతో కాబోలు మాట్లాడుతోంది గౌరి. బహుశా గేటు తీసిన కారణం, విశేషాలు తెలుసుకుంటున్నట్టుంది ఆవిడ. 'గౌరికి నెట్‌వర్క్ బాగా ఉంటుంది జాగ్రత్తగా ఉండాలి' అనుకుంది ప్రియ.

గదిలోంచి హాల్లోకి వచ్చింది. పెరట్లోకి వెళ్లబోతూ ఆగి హాల్లో చెరో మంచం మీదా గాఢనిద్రలో ఉన్న సుందరయ్య, కామేశ్వరమ్మలను చూసింది. లేచాక ఏం జరుగుతుందో చూడాలి.

నవ్వుకుని పెరట్లోకి వెళ్లి బ్రష్ చేసుకుంది. తరవాత టవల్‌తో మొహం తుడుచుకుంటూ పెరట్లోంచి వీధి వాకిట్లోకి వెళ్లడానికి ఎడమ పక్కన ఉన్న చిన్న సందులోకి నడిచి, అక్కడి నుంచి గేటు దగ్గరకు వెళ్లింది.

నిన్న చూసినప్పటికీ, ఈ రోజుకీ ఇంటి




ని చూస్తే ఓ చక్కటి ఆకారం కనిపిస్తోంది. ఇపుడు కొంత కళగా ఉంది. 'హమ్మయ్య! ఇప్పుడు భూత్‌బంగళాలా లేదు' అనుకుని గేటు దగ్గర నిలబడింది. ఆమెని చూడగానే గౌరితో మాట్లాడుతున్న పక్కింటావిడ అక్కడ్నించి వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోవడంతో వెనక్కి తిరిగి చూసిన గౌరి ప్రియను చూసి నవ్వుతూ దగ్గరకొచ్చి "మీ దయవలన ఇంటికి లక్ష్మీ కళ వచ్చిందమ్మాయిగారూ" అంది.

ప్రియ నవ్వింది. "అప్పుడేనా? " అంది.

గౌరి వేసిన ముగ్గులు చూస్తూ

"ముగ్గులు బాగా వేశావు. చాలా వచ్చినట్టున్నాయే" అంది.

"బోల్డొచ్చు. సంకురాతిరికేస్తాను చూడండి. ఈ వీధి వీధంతా నా ముగ్గులే ఉంటాయి" గర్వంగా చెప్పింది గౌరి.

"గుడ్" అంటూ అక్కడి నుంచి వెనక్కి తిరిగి గుమ్మం దగ్గరకు వచ్చి గ్రిల్ తలుపుకున్న తాళం చూసి గౌరివైపు ఆశ్చర్యంగా చూసి "ఈ తాళం తీయలేదేం? " అంది.

గౌరి భయంగా అంది "అమ్మో.. ఆళ్లిద్దరూ బైటకి రాలేరు. కాబట్టి ఈ గేటు, ముగ్గులు చూడరు. అందుకే ధైర్యంగా మీరు చెప్పింది చేశాను. ఈ తాళం తీశానంటే ఆళ్లకి తెలిసిపోద్ది. నా పీక తెగుద్ది"

ప్రియ ఈసారి నవ్వలేదు. కొంచెం సీరియస్‌గా అంది "నేను చెబుతున్నాను.. వెంటనే ఈ తాళం తీయి"

"అమ్మాయిగారూ.. మీరు నాల్రోజులు ఉండిపోడానికొచ్చారమ్మా.. మీకెందుకిదంతా? "

ప్రియ కచ్చితంగా, ఆదేశిస్తున్నట్టుగా అంది "అవన్నీ నీకనవసరం. ముందు తాళం చేతులు పట్రా. తెలుసా, ఎక్కడున్నాయో? "

ఆమె స్వరంలో వినిపిస్తున్న ఆజ్ఞకి చిత్రంగా చూస్తూ అంది గౌరి "తెలుసు"

"వెళ్ళు. పట్రా"

"కానీ, అమ్మాయిగారూ!"

"వెళ్లి పట్రా"

గౌరి మరేం మాట్లాడకుండా సందులోంచి వెనక్కి వెళ్లింది. విస్తారంగా పెరిగిన కొమ్మలతో బలంగా ఉన్న మావిడిచెట్లని చూస్తూ ప్రియ అనుకుంది 'ఎన్ని కాయలు కాస్తాయో ఈ చెట్టుకి. అవన్నీ ఏం చేసి ఉంటారీ ముసలాళ్లు? '

వరండాలో కూడా సీలింగ్ అంతా బూజులు, ఎక్కడ చూసినా బూజులు వేళ్లాడుతున్నాయి.

ప్రధాన ద్వారం దట్టంగా దుమ్ము పేరుకుని ఉంది.

'ఎన్నేళ్లయిందో ఈ ఇంటికి రంగులు వేయించి.. ఎన్నేళ్లయిందో ఈ ఇంటి ముందు దీపం వెలిగించి.. ఎన్నేళ్లయిందో ఈ ఇంటికి సూట్‌కేసుతో ఓ చుట్టం వచ్చి? వీళ్లని బంధువులు వెలేశారో, వీళ్లే బంధువులని వెలేశారో? ఏదెలా ఉన్నా వీళ్ల ధైర్యాన్ని మెచ్చుకోవాలి' అనుకుంది.

ప్రియ అసహనంగా కదిలింది. గౌరి ఇంకా తాళం చేతులు తేలేదు. పది నిముషాలైంది లోపలికి వెళ్లి.

ప్రియ అక్కడి నుంచి కదిలి వెనక్కి రాబోతుంటే వచ్చింది గౌరి. ఆమె మొహంలో భయం, నుదుట చిరుచెమట, ఎంత టెన్షన్ పడిందో తెలియచేస్తోంది.

"ఇవిగోండి" తాళం చేతుల గుత్తి ఇచ్చింది. తాళాల చప్పుడికి వాళ్లెక్కడ లేస్తారో అని గుండె దడదడలాడింది గౌరికి.

"వీటిలో ఏది? " అడిగింది ప్రియ.

"తెలియదమ్మా.. చూడాలి" అంది గౌరి.

"సరే"

ప్రియ ఓపిగ్గా ఒక్కొక్క తాళం చెవి తీసుకుని తాళం తీయడానికి ప్రయత్నించసాగింది. చివరికి ఏడో తాళం చెవితో అతి ప్రయత్నం మీద తాళం ఊడి వచ్చింది. గ్రిల్ డోర్ త్వరగానే తెరుచుకుంది. మొహం మీద పడుతున్న బూజులు చేత్తో తోస్తూ, వరండాలోకి వచ్చి చుట్టూ చూసింది. విరిగిన చక్రాల కుర్చీ. చిన్న పిల్లల సైకిలు, తెగిపోయిన మగవాళ్లవి, చిన్న పిల్లలవి చెప్పులు, దుమ్ము.. అడుగు వేస్తే దుమ్ము.

అలాగే నాలుగడుగులు వేసి, ప్రధాన ద్వారానికి ఉన్న తాళం తీయడానికి ఆమె ప్రయత్నిస్తోంటే గౌరి బిత్తరపోయి

చూస్తోంది. 'ఈ అమ్మాయి ఎవరు? ఎంత ధైర్యంగా ఈ తాళాలు తీస్తోంది!' అనుకుంది గౌరి.

ప్రియని చూస్తుంటే గౌరికేవో అనుమానాలు. తాళాలు తీశాక జరగబోయే రభస, తననేమన్నా అంటారేమోనన్న భయం.. ఉప్పెనగా ముసిరి ఆమెని శిలని చేసినట్టు, ప్రియ తాళాలు తీయడానికి ప్రయత్నిస్తుంటే అలాగే చూస్తూ నిలబడిపోయింది గౌరి.

అతి కష్టం మీద ఆ తాళం కూడా వచ్చేసింది. గొళ్లెం తుప్పు పట్టిందేమో చాలా లాగాల్సి వచ్చింది. ఆ శబ్దం విని లేస్తారేమో, ఏం గొడవ అవుతుందో అని గౌరి గుండెలు చిక్కబట్టుకుని నిలబడింది.

మొత్తానికి గొళ్లెం తీసి తలుపు ఒక్కసారిగా తోసింది ప్రియ. కానీ తలుపు పూర్తిగా తెరుచుకోలేదు. కొంచెమే తెరుచుకుంది. తలుపుకి రెండుపక్కలా ఉన్న మంచాలు అడ్డం వచ్చి కొట్టుకుంటూ ఆగిపోయాయి రెక్కలు.

అంతే.. ఆ శబ్దానికి గభాల్న లేచారిద్దరూ.

"ఎవరూ.. ఎవరది? గౌరీ.. గౌరీ!" పెద్దగా అరవసాగింది కామేశ్వరమ్మ.

'ఏమైందీ.. ఏవిటే కేకలు? పీడకలలేమన్నా వచ్చాయా? " కంగారుగా అడుగుతూ మంచం మీద లేచి కూర్చున్నాడు సుందరయ్య.

"తలుపు ఊడిందండి" గట్టిగా అరిచింది కామేశ్వరమ్మ.

గౌరి భయంతో అక్కడి నుంచి పారిపోయింది.

"తలుపు ఊడటం ఏంటే? నీకేమన్నా మతి పోయిందా? " ఆయన కళ్లు నులుముకుంటూ తలుపు వైపు చూశాడు. సగం తెరుచుకున్న రెక్కలు.. లోపలికి పొగలా వస్తోన్న దుమ్ము.

"అమ్మో.. అమ్మో.. గౌరీ! గౌరీ! ఓ అమ్మాయ్. ఏంటండీ నిన్న వచ్చిన ఆ అమ్మాయి పేరు... పిలవండి. ఇద్దరూ ఎక్కడున్నారో!"

ప్రియంవద ఇంక అక్కడ నిలబడలేదు. నెమ్మదిగా వెనక్కి తిరిగి సందులోంచి పెరట్లోకి, పెరట్లోంచి వంటగదిలోకి వచ్చింది. గౌరి బిక్కచచ్చి వంటగదిలో నిలబడిపోయింది భయంతో.

ప్రియంవద ఒక్క నిముషం ఆమెని చూసి, తను హాల్లోకి వెళ్ళింది.

"ఏమైంది నాన్నమ్మా? " అడిగింది అమాయకంగా.

"ఎక్కడున్నావు? గౌరి రాలేదా? చూడు, ఎవడో దొంగవెధవ వచ్చినట్టున్నాడు. ఈ తలుపు తీశాడు. ఆ కర్ర ఇలా ఇవ్వు" ఆవిడ రొప్పుతోంది.

ప్రియ కొన్ని క్షణాలు మౌనంగా ఉండి శాంతంగా జవాబిచ్చింది "దొంగలు కాదు.. ఆ తలుపులు నేనే తీశాను"

"నువ్వా? " ఆవిడ నిర్ఘాంతపోతూ అడిగింది.

"అవునండి.. ఇల్లంతా వాసనొస్తోందని నేనే తీశాను. చూడండి సూర్యకిరణాలు గదిలోకి వచ్చాయి"

"నోర్ముయ్..!" అది అరుపు కాదు, గర్జన! ఇద్దరూ ఒకేసారి అరిచారు.

ప్రియంవద స్థాణువైపోయింది.

తల వంచుకుని ఉండిపోయింది ప్రియ.

"ఎంత ధైర్యం నీకు.. ఎవత్తివే నువ్వు? తాళం వేసిన తలుపులు తీశావంటే, రేపు నా బీరువా తాళాలు కూడా తీస్తావు. అమ్మో, అమ్మో.. నీకసలు తాళం చేతు లెలా వచ్చాయి? ఎవరిచ్చారు? " గుండెలు బాదుకుంటూ అదే స్వరంతో అరిచిందా విడ.

"నిన్న ఆ రూమ్ సర్దుకుంటుంటే ఈ తాళాల గుత్తి కనిపించింది. బహుశా మీరు ఇవి కనిపించక ఇంతకాలం ఈ తాళం తీయలేదేమో అని నేనే తీశాను. సారీ.. ఈ తలుపు మీ మంచానికి ఇంత దగ్గరగా ఉందనుకోలేదు"

ఆయన మంచం మీంచి లేచాడు. చేతి కర్ర తీసుకుని, టక్‌టక్‌మని చప్పుడు చేస్తూ ప్రియ దగ్గరగా వచ్చాడు.

ఆయన చేతిలో కర్ర కొద్దిగా పైకి లేచింది.

ప్రియ భయంగా వెనక్కి జరిగింది.

"వెళ్లు.. ముందు బైటికి వెళ్లు" కర్రతో పెరటి వైపు చూపిస్తూ అరిచాడాయన.

"తాతగారూ!"

"ఎవరే నీకు తాత? దిక్కులేక వచ్చిందా నివి, దిక్కులేని దానిలా పడుండాలి. నీ ఇష్టం వచ్చినట్టు మా ఇంట్లో పెత్తనాలు చేస్తావా? ఫో.. ముందు"

"తాతగారూ.. నేను చెప్పేది వినండి.. ప్లీజ్.."

"ఏంటి వినేది? ఇంకోసారి నన్ను తాత అన్నావంటే నాలిక తెగ్గోస్తాను. ఫో ముందు"

ప్రియ స్థిరంగా అంది "వెళ్లను"

"వెళ్లవూ.. వెళ్లవూ..? "

ఆయనతోపాటు ఆవిడ కూడా సివం గిలా అరిచింది.

"వెళ్లనండి. పెద్దవాళ్లు, లేవలేనివాళ్లు మీ ఇద్దర్నీ వదిలి వెళ్లను. నేను శాస్త్రిగారికి మాట ఇచ్చాను. మిమ్మల్నిద్దరినీ నా సొంత తాత, నానమ్మలని చూసుకున్నట్లు చూసుకుంటానని.. మీకు తెలియదు శాస్త్రిగారు మీ గురించి ఎంత బాధపడ తారో.. నేనిలా సడన్‌గా వెడితే ఆయన నన్ను తప్పు పడతారు.

అయినా నేనేం చేశాను చెప్పండి? ఈ తలుపులు తీస్తే గాలీ, వెలుతురూ వచ్చి ఇంట్లో ఉన్న కాలుష్యం బైటికి పోతుందని, మీ ఆరోగ్యాలు బాగుంటాయని తెరిచాను. ఇప్పుడు చూడండి. ఎంత వెలుతురు వచ్చిందో హాల్లోకి? ఎంత గాలి.. ఎంత వెలుతురు..? ఇలా గాలీ వెలుతురూ ఉన్నచోట ఉంటే మీ ఆరోగ్యం కూడా చాలా బాగుంటుంది కదా"

"నోర్ముయ్..! ఎవతివే నువ్వు? మా ఆరోగ్యం బాగుంటే నీకేం, మేం చస్తే నీకేం? నా ఇంటి తాళం తీయడానికి నీకెంత ధైర్యం? పేనుకి పెత్తనమిస్తే తలంతా చెడ కొరికిందట. దారినపోయే తద్దినం అని కూడా చూడకుండా పెద్ద వాడు చెప్పాడని నిన్ను ఇంట్లోకి రానిస్తే నాలుగురోజులు కూడా కాలేదు. బోడి పెత్తనాలు చేస్తావా? నా ఇంటి తాళాలు ఎందుకు తీసుకున్నావు? నా అనుమతి లేకుండా, నన్నడక్కుండా ఈ తలుపు ఎందుకు తీశావు? వెళ్లు ముందు బైటికి వెళ్లు.. గౌరీ.. గౌరీ.. ఎక్కడ చచ్చావు? " పిడుగులు పడుతున్నట్లే పలుకుతోంది ఆవిడ స్వరం.

ప్రియంవదకి కొంచెం భయం వేసింది. అయినా ఆ భయం పైకి కనిపించనీ యకుండా ప్రశాంతమైన స్వరంతో అంది "నానమ్మగారూ! ఇల్లంతా మురుగువాసన వస్తోంది. దోమలు విపరీతంగా ఉంటే మీ ఆరోగ్యాలు దెబ్బతింటాయి. ఇంతకాలం మీకు చేసేవాళ్లు లేక మీరెలాగోలా బతి కారు. ఇప్పుడు నేనున్నాకదా మీ కోసం,

కేవలం మీ ఇద్దరి ఆరోగ్యం కోసమే ఈ తలుపు తీశాను. ఈ సూర్యకిరణాలు పడు తుంటే చూడండి ఎంత.."

"నోరు మూసుకుని బైటికి నడువు" భీకరంగా అరిచిందావిడ.

ప్రియంవదకి ఆవిడ రౌద్రరూపం చూస్తుంటే కొంచెం భయం వేసింది. తను కొంచెం తొందరపడి ప్లాన్ మొత్తం పాడు చేసుకుంటోందా అనిపించింది. ఇప్పుడు వాదించేకన్నా కొంచెంసేపు అక్కడి నుంచి తను తప్పుకోడం మంచిదనిపించింది. మాట్లాడకుండా మౌనంగా వాళను దాటుకుని తన గదిలోకి వెళ్లిపోయింది.

ఆవిడ ఆయాసంతో రొప్పుతూ "దరి ద్రపు పిల్ల.. ఎక్కడి నుంచి వచ్చిందో? దీని వ్యవహారం చూస్తుంటే ఏదో దొంగల ముఠాకి సంబంధించింది అనిపిస్తోందండీ. శాస్త్రిగారు పంపించలేదు.. పాడూ లేదు. అయ్యో.. అయ్యో..! నాలుగు రోజులు కూడా కాకుండానే ఇంట్లో పెత్తనాలు మొదలుపెట్టిందంటే ఇది మామూలు ఆడది కాదు. ఈ గౌరి దీన్ని వదిలి ఎక్క డికి చచ్చిందో? " అంటూ మంచం దిగడా నికి ప్రయత్నించసాగింది.

నెమ్మదిగా తేరుకున్న సుందరయ్య "ఆగాగు.. నేనొస్తాను" అంటూ ఆమెని హెచ్చరించి, మంచం పక్కనే ఉన్న చేతి కర్ర అందుకుని నెమ్మదిగా మంచం దిగాడు. అక్కడి నుంచి అడుగులో అడుగు వేస్తూ ఆవిడ మంచం దగ్గరగా వచ్చి కుడిచేత్తో కర్ర పట్టుకుని ఎడం చేత్తో ఆమెకి ఆసరా ఇవ్వడానికి ప్రయత్నించసా గాడు. ఆయన చేతి మీద తన బరువంతా మోపి బలవంతంగా లేవబోతూండగా హఠాత్తుగా ఇద్దరూ బోర్లా పడిపోయారు.

"వామ్మో.. చచ్చానురా నాయనో!"

అంటూ ఆవిడ అరిచిన అరుపు ఒక్కసారి ఇల్లంతా ప్రతిధ్వనించింది.

ఇంటి బైట గౌరి, లోపల ప్రియంవద ఉలిక్కిపడ్డారు. ఒక్క అంగలో వచ్చింది ప్రియంవద.

గబుక్కున వెళ్లి ఒకళ్ల మీద ఒకళ్లు బోర్లా పడిపోయిన ఆ వృద్ధుల్ని లేపడానికి తన ఒక్కదానివల్లా కాదని "గౌరీ" అంటూ గట్టిగా అరిచింది.

గౌరి పరిగెత్తుకుని వచ్చింది.

"రా.. ఇటు త్వరగా" అంటూ సుందరయ్యగారి కుడిచేయి తన భుజం మీద వేసుకుని నెమ్మదిగా లేపుతూ దగ్గరకు వచ్చిన గౌరితో అంది "జాగ్రత్తగా అమ్మగారిని లేపు" అంటూ ఆయనని నెమ్మదిగా నడిపిస్తూ తీసికెళ్లి మంచం మీద కూర్చోబెట్టింది.

గౌరి కామేశ్వరమ్మని బలవంతంగా లేవదీసి నడిపిస్తూ మంచం దగ్గరకు తీసుకొచ్చి మంచం మీద పడుకోబెట్టింది.

"అయ్యో! అయ్యో! భగవంతుడా ఏం కర్మ కాలింది మాకిలా? పొద్దున్నే మాకీ ప్రారబ్ధం ఏంటి ఇవాళ? గుట్టు చప్పుడు కాకుండా బతుకుతున్న మా బతుకులు బజారుకీడ్చడానికి వచ్చినట్టుంది ఈ పాపిష్టిది. ఒసేయ్ గౌరీ! ముందా పిల్లను బైటికెళ్లమనవే" అంటూ గట్టిగా మూలుగుతూ అరవసాగిందావిడ.

"ఊరుకోండమ్మగారూ.. ఇన్నేల్లకి మిమ్మల్నాదుకోడానికి ఒకళ్లు వచ్చినారు. ఈ వయసులో అందర్నీ వదులుకుని ఎట్టా బతుకుదామని అనుకుంటున్నారు? అమ్మాయిగారు చాలా మంచిది. మిమ్మల్ని సొంతోల్లలా చూసుకుంటోంది. పడుకోండి ఇట్టా. నడుంకి దెబ్బ తగిలినట్టుంది" కసురుతూ ఆవిడని సరిగా పడుకోబెట్టింది.

ప్రియంవద సుందరయ్య నుదుటి మీద దెబ్బ తగలడం చూసి పాతబట్ట తీసుకొచ్చి తుడుస్తూ ఆప్యాయంగా అంది "ఏంటి తాతగారూ! ఎందుకంత ఆవేశపడతారు? నేను ఏ దొంగలముఠాకీ సంబంధించినదాన్ని కాదండి. నన్ను నమ్మండి.. నేనేం చేసినా మీ కోసమే, మీ మంచి కోసమే" అంటూ కామేశ్వరమ్మ వైపు తిరిగి అంది "కావాలంటే గౌరిని అడగండి. నిన్న నేనూ, తనూ బజారుకెళ్లి వంటింట్లోకి కావలసిన కుక్కర్, కొత్త పళ్లేలు, గ్లాసులు అన్నీ కొనుక్కొచ్చాం. మీ ఇల్లు కదా.. నాకేం సంబంధం అనుకున్నానా చెప్పండి? "

అప్పటికే నడుం పట్టేసి ఆవిడ, నుదుటి మీద దెబ్బతో ఆయన విలవిల్లాడుతూ ఆ బాధలో ప్రియంవద మాటలకి వెంటనే ఏమనలేకపోయారు.

ప్రియంవద మళ్లీ అంది "మీరు వెళ్లమంటే వెళ్లిపోతాను. కానీ ఒక్కటి చెప్పండి.. ఏదో టైంకింత వండుకోడమేనా నేను చేయాల్సింది? పెద్దవాళ్లు, ఏ అండా లేనివాళ్లు, మీ క్షేమం, మీ ఆరోగ్యం చూసుకోవడం బాధ్యత కాదంటారా? మీరు నాకు తిండి పెట్టి, ఆశ్రయం ఇచ్చినందుకు నేను ఈ మాత్రం మీ యోగక్షేమాలు చూసుకోకూడదా? "

ఆమె స్వరంలో వినిపిస్తున్న బాధ, వినయం వాళ్లిద్దరినీ ఆశ్చర్యంలోనే కాక, ఆలోచనలో కూడా పడేసింది. దానికితోడు తగిలిన దెబ్బల తాలూకు నొప్పితో మాట రావడంలేదు.

అదే అదునుగా ప్రియంవద మరింత రెచ్చిపోతూ మాట్లాడసాగింది "మిమ్మల్ని బాధ పెట్టాలని కాదు. మీకు సాయం చేయాలనే నేను కొంచెం సాహసం చేశాను. నాకు తెలిసినంత వరకూ వీధి వాకిలి ఎప్పుడూ మూసుకుంటే లక్ష్మీదేవి వెనక్కి వెళ్లిపోతుందట కదా. మా అమ్మ వాకిట్లో ప్రతిరోజూ ముగ్గు లేకపోతే ఊరుకోదు. జ్వరం వచ్చినా, బైట హోరున

వర్షం కురుస్తున్నా వాకిలూడ్చి ముగ్గేయాల్సిందే, ఉదయాన్నే ఉషాకిరణాలు ఇంట్లో పడాల్సిందే అంటుంది. అది అలవాటై నేను ఈ పని చేశాను. మీ ఇంటి కోసమేగా, ఇది నా ఇల్లు కాదుగా.. చెప్పండి నేను చేసింది తప్పా?

నా సేవలు మీకు చాలా అవసరం. నాకెలాగూ తాత, అమ్మమ్మ, నానమ్మ లేరు. మీకన్నా సేవలు చేసుకుంటే నాకు కొంచెమన్నా పుణ్యం వస్తుంది కదండీ" అంటూ ముక్కు ఒకసారి ఎగబీల్చి "చూడండి.. చూడండి.. ఇప్పుడు ఇంట్లో వాసనంతా పోయింది" అంది ప్రియ.

నిజంగానే వెచ్చటి సూర్యకిరణాలతో పాటు ఏదో చిత్రమైన పరిమళం ఇంట్లోకి వ్యాపించినట్టయింది. ఆమె మాటలు నిజమే అని ఒప్పుకోడానికి అహం అడ్డొచ్చినా మౌనంగా ఉండిపోయారు. చాలా కాలం తరువాత వెచ్చటి సూర్యకిరణాల స్పర్శ హాయిగా అనిపిస్తోంది. గాలి కూడా వీస్తోంది. రోజూ ఏంటో ఫ్యాను తిరుగుతున్నా ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్టుండేది.

ఇంతకాలం నుంచి ఇంటి గుట్టు రచ్చకొస్తుందని, ఎవరికీ ఏ విషయాలూ తెలియకూడదని, ఇంట్లోంచి బైటికి కదలకుండా, ఇంట్లోకి ఎవరినీ రానివ్వకుండా తలుపులు మూసిపెట్టాం. ఇప్పుడు మరీ రభస చేస్తే ఈ మొండి పిల్ల 'ఎందుకు? ఏంటి?' అని ప్రశ్నలు వేయచ్చు. పదిమందికీ ఈ మూసి ఉన్న తలుపుల గురించి చిలువలుపలువలు కల్పించి ఏమన్నా చెప్పచ్చు. అంతేకాక రోజులు బాగాలేవని, వృద్ధులున్న ఇళ్లు చూసుకుని దొంగలు చొరబడి, హత్యలుచేసి కూడా దోచుకుపోతున్నారనే వార్తలు చదివి భయపడి మూయడం కూడా ఒక కారణం. ఇప్పుడు ఫర్వాలేదు. ఈ అమ్మాయి కూడా ఉంది కదా.. భయమేం ఉంది అనిపించింది ఇద్దరికీ ఒకేసారి.

వాళ్ల మౌనంతో ప్రియ కొంచెం ఊపిరి పీల్చుకుని గౌరితో అంది "గౌరీ! కొంచెం అమృతాంజనం, వేడినీళ్లు పట్రా"

గౌరి ఆమె తెలివితేటలకి, లౌక్యానికి నివ్వెరపోతూ కామేశ్వరమ్మ మంచం దగ్గర ఉన్న స్టూలు మీంచి అమృతాంజనం తీసిచ్చింది.

"వేణ్ణీళ్లు తెస్తానుండండి" అంటూ వంటగదిలోకి వెళ్లిపోయింది.

"ఇలా పడుకోండి" అంటూ ప్రియంవద కామేశ్వరమ్మని కుడిపక్కకి ఒత్తిగిల్ల చేసి, ఆవిడ నడుముకి మృదువుగా అమృతాంజనం రాయసాగింది. జీవితంలో ఏనాడూ ఎరగని మృదువైన ఆ స్పర్శ ఆవిడకి హాయిగా అనిపించింది. అనుకోకుండానే నిప్పులు కురిపిస్తూ అరిచిన ఆ స్వరం మూగపోయినట్టు అయింది.

పదినిముషాల పాటు ఆవిడ నడుముకి దెబ్బ తగిలినచోటే కాకుండా మొత్తం అమృతాంజనం రాస్తుంటే తనకి అంత నడుం నొప్పి ఉన్నట్టు మొదటిసారిగా తెలిసిందావిడకి.

ఆ తరవాత ప్రియంవద సుందరయ్యగారి నుదుటిక్కూడా అమృతాంజనం పట్టిస్తూ నెమ్మదిగా అంది "తాతగారూ! ఈ తలుపు తీసేముందే నేను వరండా దులిపించి ఉండాల్సింది, పొరపాటైంది.

నేనిప్పుడే మీ మంచాలు దుమ్ము పడకుండా కొంచెం జరుపుతానుండండి" అంటూ వేడినీళ్ల గిన్నెతో వచ్చిన గౌరితో అంది "గౌరీ ఇలా రా! ఈ తలుపు మూసి, వీళ్లిద్దరి మంచాలు కొంచెం అలా పక్కకి జరుపుదాం.. సాయం పట్టు"

గౌరి ఏం మాట్లాడకుండా ఆమె చెప్పింది చేయడానికి సిద్ధంగా నిలబడింది.

ఆశ్చర్యంగా పెద్దవాళ్లిద్దరూ ఎక్కువగా గొడవ చేయకుండా మౌనంగా సహకరించారు. వాళ్ళనలా పడుకోనిచ్చే ఇద్దరూ కలిసి వాళ్ల మంచాలు తలుపులకి కొంచెం దూరంగా జరిపారు.

"గౌరీ! నువ్వెళ్లి వరండా శుభ్రం చేయి. నేను వీళ్లిద్దరికీ మొహాలు కడిగించి, స్నానాలు చేయిస్తాను" అంది ప్రియంవద.

"మీరా.. ఎందుకులేమ్మా? వరండా శుభ్రం చేశాక నేనే చేయిస్తాలెండి" అంది.

"ఏం ఫర్లేదు గౌరీ, నా తాతగారికి, నానమ్మకి చేయనా? ఇదీ అలాగే" మృదువుగా అంది ప్రియంవద.

గౌరి మాట్లాడకుండా చీపురు తీసుకుని మొదటిసారిగా హాల్లోంచి వీధి వరండాలోకి బయల్దేరింది.

"నానమ్మా" అంటూ తీయగా పిలుస్తూ "రండి.. మీకు స్నానం చేయిస్తాను" అంటూ కామేశ్వరమ్మ భుజం పట్టి లేవదీసింది ప్రియ.

ఆవిడ నెమ్మదిగా లేచింది.

సుందరయ్య జరుగుతున్నదంతా కళ్లప్పగించి నిశ్చేష్టుడిలా చూస్తుండిపోయాడు.

ఆ రాత్రి ప్రియ తల్లికి 'అమ్మా ఆపరేషన్ వన్ విజయవంతం అయింది. ఇప్పుడు ఆపరేషన్ టూ మొదలైంది. ఇది కూడా కచ్చితంగా విజయవంతం అవుతుంది' అని మెయిల్ చేసింది.

మెయిల్ ఇచ్చాక మంచం మీద వాలిపోయి గోపాల్ అంకుల్ ఇచ్చిన డైరీ తీసుకుంది.

ఆమె కళ్లు అక్షరాల వెంట పరుగుపెట్టాయి.

★ ★ ★

అది శ్రావణ మాసం. సుమతి వంట పని, మిగతా పని పూర్తి చేసుకుని వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుంది.

బైట ముసురుగా ఉంది. ఆ రోజు పెరిగిన పెట్రోలు ధరలకు నిరసనగా ఆంధ్రప్రదేశ్ బంద్‌కు పిలుపునిచ్చాయి ప్రతిపక్ష పార్టీలు. కాలేజీలు, స్కూళ్లు మూసేశారు.

గోపీ కాలేజీకి వెళ్లలేదు. ఇంటర్ ఫస్టియర్ చదువుతున్నాడతడు. సుమతి, విశ్వనాథం దంపతులకు ఇద్దరూ కొడుకులే. పెద్దవాడు ప్రసాద్.. వైజాగ్ గీతం కాలేజీలో ఇంజనీరింగ్ సెకండ్ ఇయర్ చదువుతున్నాడు. విశ్వనాథం ఏజీ ఆఫీసులో ఆడిటర్‌గా పనిచేస్తున్నాడు.

వర్షం వలన బైటికి వెళ్లలేక, బంద్‌వలన కాలేజీకి వెళ్లలేక బోర్ అంటూ లోపల్నించి బైటకీ, బైటనుంచి లోపలికి తిరుగుతూ కాస్సేపు వర్షాన్ని తిట్టుకుంటూ చిరాగ్గా ఉన్నాడు గోపి.

చాలామంది కొత్తగా పెళ్లయిన అమ్మాయిలు మంగళవారం నోములు నోచుకుని సుమతికి తాంబులం ఇవ్వడానికి వస్తున్నారు, వెళ్తున్నారు.

వాళ్లు వచ్చినపుడల్లా 'అబ్బాయివి.. నువ్వు లోపలికి వెళ్లు' అంటూ తల్లి పదే పదే అనడంతో విసుగొచ్చి, తనగదిలోకి వచ్చేశాడు గోపి. బైట మబ్బు పట్టి ఉండడంతో గది చీకటిగా ఉంది. కిటికీ తలుపులు తెరిచాడు. అప్పుడు సమయం మధ్యాహ్నం రెండున్నర, మూడు మధ్య. ఎదురింటి గేటు ముందు ఒక ఆటో ఆగింది. గోపి ఆసక్తిగా చూశాడు. ఆ ఇంటి ముందు ఆటో ఆగడం, ఎవరన్నా రావడం చాలా చిత్రమైన విషయం. ఎవ

రొచ్చారబ్బా?

ఆటోలోంచి ముందు సుందరయ్యా దిగాడు. ఆయనతో పాటు ఆయన చేయి పట్టుకుని శీను దిగాడు.

సుందరయ్య, శీను కూడా సిల్కు లాల్చీలు వేసుకున్నారు.

సుందరయ్యా జేబులోంచి డబ్బులు తీసి ఆటోవాలాకు ఇచ్చి గేటుకున్న తాళం తీశాడు.

ఇంతలో మరో ఆటో వచ్చి ఆగింది. అందులోంచి కామేశ్వరమ్మ, ఆవిడ వెన కాల ఒక అమ్మాయి దిగడం చూసి, మరింత కుతూహలంగా కిటికీ దగ్గరగా నిలబడ్డాడు గోపీ వాళ్లనే చూస్తూ.

సుందరయ్య, కామేశ్వరమ్మ, శీను తప్ప మరోవ్యక్తి ఆ ఇంట్లోకి రావడం ఎన్నడూ అక్కడివారు చూడలేదు. ఎవరీ కొత్త మ్మాయి? పైగా ఎన్నడూ ఇల్లు కదలని ఆ దంపతులు రెండురోజులుగా గేటుకి తాళంవేసి ఎక్కడికో వెళ్లి రావడం, వస్తూ వస్తూ ఒక కొత్తమ్మాయిని వెంటపెట్టుకు రావడం.. అంతా మిస్టరీ మూవీ చూస్తున్నట్లుగా ఉంది గోపీకి.

ఆగిన మరో ఆటో డ్రైవర్‌కి కూడా సుందరయ్యే డబ్బులిచ్చాడు. తరువాత శీను చేయి పట్టుకుని లోపలికి వెళ్లిపోయాడు. వాళ్ల వెనకాలే కామేశ్వరమ్మ కూడా కొత్తమ్మాయిని చేయి పట్టుకుని ఒక విధంగా లాక్కెళ్తున్నట్టే లోనికి తీసికెళ్లింది.

గోపికి ఆ అమ్మాయి ఎవరో ఏంటో తెలుసుకుని, ఓ సారి ఆమె మొహం చూడాలనిపించింది. ఆమె పసుపుపచ్చ సిల్కుచీర కట్టుకుంది. ఆ చీర చెంగు భుజాల చుట్టూ కప్పుకుని తలవంచుకుని ఆవిడ వెనకాలే వెళ్లింది. వెళ్లేటప్పుడు చీరచెంగు చాటునుంచి అటూఇటూ ఊగుతూ కనిపించిన పెద్ద జడ మాత్రం గోపి దృష్టిలో పడింది.

ఎవరై ఉంటారు? గోపిలో ఆసక్తి అంతకంతకూ పెరగసాగింది.

ఆ ఇంట్లో సుందరయ్యా, కామేశ్వరమ్మ, వాళ్ల ఒక్కగానొక్క కొడుకు పిచ్చి శీను తప్ప నాలుగో వ్యక్తిని చూడడం ఇదే మొదటిసారి. కుతూహలం ఆపుకోలేని శీను వరండాలోకి తొంగి చూశాడు.

సుమతికి తాంబూలం ఇవ్వడానికి వచ్చిన ఒక అమ్మాయి బుట్టలో అన్నీ సర్దుకుని "వస్తానండీ" అంటూ సుమతికి చెప్పి గ్రిల్స్‌డోర్ తెరచుకుని బైటికి వెళ్లిపోయింది.

గోపి వడివడిగా తల్లి దగ్గరకు వెళ్లి "అమ్మా" అంటూ పిలిచాడు.

"ఏరా? ఏం కావాలి? ఇదిగో అరటి పండు" అంటూ తాంబూలంలోంచి అరటి పండు తీసి గోపికి ఇచ్చింది.

"అరటిపండు సరేగానీ, ఎదురింట్లోకి ఎవరో ఒక కొత్తమ్మాయి వచ్చిందే" అన్నాడు గోపి.

ఆవిడ నవ్వింది.

"రానీ, మనకేం? " అంది.

"అదికాదు. వాళ్లింటికి వేరేవాళ్లు రావడం ఏంటి? ఆశ్చర్యంగా లేదూ? "

"ఆశ్చర్యం ఏముందిరా.. బంధువుల మ్మాయేమో? "

"వాళ్లకి బంధువులేంటమ్మా? నువ్వు మరీ విడ్డూరంగా చెప్తావు" విసుగ్గా

అన్నాడు గోపి.

అతనికి తెలుసు. వాళ్లింటికి మర్యాద స్తులు, మంచివాళ్లు ఎవరూ వెళ్లరని. కామే శ్వరమ్మ నోటిదురుసు అందరికీ తెలుసు. ఆ ఇంట్లోకి వెళ్లడం అంటే పులి గుహలోకి దూరడంలాంటిదే.

"సర్లేరా. అయినా నీకెందుకు? నీ చదు వేదో నువ్వు చదువుకో" కసిరింది సుమతి.

గోపి బిక్కమొహం వేసుకుని గదిలోకి వచ్చాడేగానీ, ఆ అమ్మాయెవరో తెలుసుకో వాలన్న కోరిక క్షణక్షణానికి పెరుగుతూనే ఉంది. ఆ సాయంత్రం గోపి కోరిక తీరింది. వాళ్లింట్లో పనిచేసే లక్ష్మమ్మే ఎదురింట్లో కూడా పనిచేస్తుంది. సాయంత్రం పనికి వచ్చిన లక్ష్మమ్మ బుగ్గలు నొక్కుకుంటూ, కళ్లు పెద్దవి చేస్తూ సుమతికి చెబ్తోంటే జాగ్రత్తగా విన్నాడు గోపి.

"అదేంటమ్మా.. పిచ్చోడికి పెండ్లా? పాపం! ఆంధ్రకి పోయి..పాపం.. అబం సుబం తెలియని పోరికిచ్చి గప్‌చుప్‌గా పెండ్లి చేసుకుని వచ్చిను. ఎవరికీ చెప్పలే. పిల్ల ఎంత ముద్దుగుంది, ఎరికనా? అమ్మో తాచుపాములెక్క పెద్దజడ, పచ్చని రంగు. ఏం కర్మకాలిందో వీడిని చేసు కుంది"



"నిజమేనా లక్ష్మమ్మా నువ్వు చెప్పేది? " సుమతి జాలిగా అడుగుతోంది.

"అబద్ధం ఎందుకు చెప్తనమ్మా? నన్ను కూడా పన్లోనుండి తీసేసింది. గాపిల్లనే ఆల్లకింక పనిమనిషి, వంటమనిషి అన్నీ" సణుక్కుంటూ పనిలోపడింది లక్ష్మమ్మ.

"నేను చెప్పానా? ఏదో జరిగిందమ్మా, కొత్తమ్మాయి వచ్చిందని" అంటూ తల్లి దగ్గ రగా వచ్చాడు గోపి.

"అవునురా, అన్నావు కానీ, నాకీ అను మానమే రాలేదు. వాళ్లు ఎంత చెడ్డవాళ్లైనా చూస్తూచూస్తూ ఓ ఆడపిల్ల గొంతు కో స్తారా? ఎంత అన్యాయం!" తల్లి స్వరంలో వినిపిస్తున్న వేదన గోపి మనసుక్కూడా తాకింది.

'అవును, ఎంత అన్యాయం? ' అనుకు న్నాడు గోపి.

ఆ ఇంట్లో ఉన్న ఏకైక సుపుత్రుడు పిచ్చి వాడు. వాడికి చదువుసంధ్యా ఏమీలేదు. ఇప్పటికీ తల్లే వాడికి అన్నం తినిపిస్తుంది, తండ్రే స్నానం చేయిస్తాడు. అలాంటి వాడికి పెళ్లా?

వాడిని చిన్నప్పుడు చుట్టుపక్కల ఉన్న కుర్రవాళ్లంతా 'పిచ్చోడా, పిచ్చోడా' అని ఏడి పిస్తుంటే కామేశ్వరమ్మ పోలీస్ రిపోర్ట్ ఇవ్వడం గోపికి గుర్తు.

శీనుకి దాదాపు పాతికేళ్లుంటాయి. దాటి ఉండచ్చు కూడా. వాడికి బర్త్‌డేలు వగైరాలు చేయరు. వాళ్లింట్లో ఏనాడూ ఓ శుభకార్యం జరిగిన జాడల్లేవు. పండగలు పబ్బాలు కూడా పెద్దగా చేసుకున్న దాఖలాలు లేవు. ఆఖరికి ఏనాడూ సాయం కాలం వాకిట్లో లైటు కూడా వెలగదు. ఎప్పుడన్నా ఒకసారి సుందరయ్య ఒక్కడే బైటకి వెళ్లి వస్తుంటాడు. అంతే తప్ప, ఆవిడగానీ శీనుగానీ ఏనాడూ ఇల్లు కదలడం కూడా చూడలేదు.

అలాంటిది వాళ్లింట్లో పెళ్లి. అది కూడా పిచ్చి శీనుకి, అందమైన అమ్మాయితో.

ఇది నిజమేనా? ఇది న్యాయమేనా?

ఆ రాత్రి సుమతి, విశ్వనాథంతో చెప్పింది. "ఇది విన్నారా? శీనుకి పెళ్లి చేసారట"

"ఎవరు? " విశ్వనాథం సందేహంగా అడిగాడు.

"అదేనండి.. ఎదురింటి సుందరయ్య, కామేశ్వరమ్మగార్ల కొడుకు శీనుకి పెళ్లి చేసారట"

"ఏంటి? ఆ వెర్రివెధవకి పెళ్లా? " ఆయన స్వరంలో అంతులేని ఆశ్చర్యం.

"బంగారు బొమ్మలాంటి పిల్లటండి. మన లక్ష్మమ్మ చెప్పింది. ఏదో ఊళ్లో గుట్టుచప్పుడు కాకుండా చేసుకొచ్చారు"

"అసలువాళ్లు ఊరెప్పుడు వెళ్లారు? "

"ఏమో మరి, చూశారా.. ఎంత దాపరికమో? ఎప్పుడు పెళ్లిచూపులయ్యాయి? అసలు ఎవరు చెప్పారు సంబంధం? నాకేం అర్థంకాడం లేదు. పాపం ఎవరి పిల్లో ఏంటో? "

"ఏమోలే ఆ పిల్ల కూడా వాడిలాంటిదేనేమో? " అన్నాడు విశ్వనాథం, 'అలా కాకపోవచ్చు' అని అనుకుంటూనే.

"లేదండి.. అమాయకంగా ఉందిటపైగా" సుమతి స్వరం తగ్గించి అంది "పిల్ల ఏడుస్తూనే ఉందిట. గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ తిరిగిందిట పొద్దున. లక్ష్మమ్మ గమనిస్తూనే ఉందిట"

"అయ్యోపాపం!" విశ్వనాథం గుండెల్లో జాలి పొంగింది.

"కొంతమందికి పెళ్లయితే పిచ్చి కుదురుతుందిట. సైకాలజిస్టులు కూడా చెప్తున్నారు. బహుశా ఆ ఆశతో చేసి ఉంటారంటావా? " అన్నాడు మళ్లీ.

"వాడికి పుట్టుకతో వచ్చింది కదండి! ఎలా పోతుంది? " అంది సుమతి.

"గొప్ప తెలివైన మనుషులే"

"మనుషులైతే ఇన్ని దారుణాలు చేస్తారంటరా? చిన్న పిల్లాణ్ణి అమానుషంగా చంపినపుడే వాళ్లు మనుషులు కారని తెలిసిపోయింది. ఇంకా మనం వాళ్లని మనుషులుగా భావిస్తే మనం కూడా రాక్షసుల మేనేమో అనిపిస్తుంది" అంది సుమతి.

ఆవిడ స్వరంలో వినిపిస్తున్న ఆవేదనకి చకితుడవుతూ "పోనీ సుమతీ! మనమేం చేయగలం చెప్పు? ఈ సమాజంలో ఎన్నో దారుణాలు జరుగుతున్నాయి. అన్ని వార్తల్లో వింటాం, పేపర్లో చదువుతాం, బాధపడతాం. ఏం చేయగలుగుతున్నాం? అంతే ఇదికూడా, ఊరుకో. మనసు పాడు చేసుకోకు, పడుకో. కట్నం కూడా తీసుకున్నారా ఏంటి దరిద్రులు? "

"వాళ్లబొంద. వాడి మొహానికి కట్నం కూడానా? నేను అనుకుంటా పిల్లకి కనీసం పిల్లాడిని కూడా చూపించి ఉండరేమో అని. చూపించి ఉంటే ఆ పిల్ల ఒప్పుకునేదా? " కసిగా అంది సుమతి.

"పిల్ల సంగతి సరే, కనీసం ఆ తల్లిదండ్రులైనా చూసి ఉంటారంటావా? "

"ఏమో? ఏం చచ్చారో, ఇక్కడెక్కడా దొరకలేదేమో, అంతదూరం నుంచి తెచ్చుకున్నారు" అంది సుమతి.

"అక్కడి పిల్ల అయితే వీళ్ల బతుకులు తెలియవని అక్కడిదాకా వెళ్లారు. అదే ఇక్కడి పిల్ల అయి ఉంటే ఆ పాటికి చుట్టుపక్కలవాళ్లు వాళ్ల చెవిన వీళ్ల ఇంటి భాగోతం అంతా చెప్పేవాళ్లు కాదూ. ఎవరు చెప్పకపోయినా నేనైనా చెప్పేవాణ్ని" కసిగా అన్నాడు విశ్వనాథం.

"ఇంకా నయంలెండి. ఎవరికీ లేంది మనకెందుకు? లేనిపోని విషయాల్లో తల దూర్చడం ఎందుకు? "

"నువ్వనట్టు మనలాంటివాళ్లు ఇలా అనుకోబట్టే ఇలాంటి రాక్షసుల కోరల్లో అమాయకులైన ఆడపిల్లలు బలి అయిపోతున్నారు. ఏదన్నా చేయాలి. ఏమాత్రం సివి

క్ సెన్స్ ఉన్నా మన చుట్టుపక్కల జరిగే అన్యాయాలని ఎదుర్కోవాలి. కానీ అలా చేయం. నాలాంటివాడు చేయాలన్నా ఎవరూ సహకరించరు" విశ్వనాథం స్వరంలో నిస్సహాయత.

"ఎవరికైనా తనదాకా వస్తేకానీ తెలియదు"

వాళ్ల మాటలు వింటున్న గోపిక్కూడా ఆ అపరిచితురాలైన పెళ్లికూతురి మీద విపరీతమైన జాలేసింది.

ఎంత దారుణం? పిచ్చివాడికి పెళ్లా!?

వాళ్లెంత మోసగాళ్లు, ఎంత దుర్మార్గులు! అందరికీ తెలుసు, కానీ వాళ్ల జోలికి ఎవరూ వెళ్లరు అనిపించింది గోపికి. వాళ్ల గురించి ఎందరి నోటినుంచో చాలా విషయాలు విన్నాడు గోపి. విన్నప్పుడల్లా ఇలాంటివాళ్లని ఎవరూ ఏం చేయరా? అని ఆవేశపడిపోవడం కూడా మామూలే. కానీ గోపి వయసుకి ఏదన్నా చేయాలని అనిపించినా, ఏం చేయాలో మాత్రం తట్ట లేదు.

★ ★ ★

పెళ్లినాటికి సుందరయ్య రెవెన్యూ డిపార్ట్ మెంట్ లో రికార్డు అసిస్టెంట్ గా ఉద్యోగం చేస్తున్నాడు. వాళ్లకి ఇద్దరు మగ పిల్లలు. పుట్టిన పిల్లలు ఇద్దరికిద్దరూ అసాధారణమైన రూపాలతో పుట్టడమే కాక, మానసికంగా ఎదగలేదు. ఆ ఇద్దరిలో పెద్దవాడు శీను. వాడికి శారీరకంగా లోపం లేకపోయినా మానసికంగా ఎదగ లేదు. రెండోవాడికి మెల్లకన్ను, పోలియోతో ఒకకాలు కుంటి. పైగా ఎప్పుడూ చొంగకారుతూ అతి జుగుప్సాకరంగా ఉండేవాడు. వాడికి పన్నెండేళ్లు వచ్చిందాకా ఎందరో డాక్టర్లకి చూపించి, ఇంక తగ్గదని తీర్మానించుకుని తల్లిదండ్రులే అమానుషంగా వాడికి విషం పెట్టి చంపారని జనం అంటుంటారు. నిజానిజాలు పరమాత్ముడికెరుక!

సుందరయ్య స్వగ్రామం తాడేపల్లి గూడెం. ఆయన తండ్రి కరణీకం చేసి బాగానే సంపాదించాడు. వాళ్లు ముగ్గురు అన్నదమ్ములు. వాళ్లల్లో సుందరయ్యగారికే గవర్నమెంటు ఉద్యోగం వచ్చింది. మిగతా వాళ్లిద్దరూ వ్యవసాయమే చేసుకునేవాళ్లు. కామేశ్వరమ్మ మేనత్త కూతురు. పచ్చగా, పెద్దకళ్లతో అందంగా ఉండే కామేశ్వరినే పెళ్లిచేసుకుంటానని మొండిపట్టుపట్టి చేసుకున్నాడు సుందరయ్య.

ఆయన తరవాతివాళ్లిద్దరూ బైట సంబంధాలే చేసుకున్నారు.

దురదృష్టవశాత్తూ కామేశ్వరమ్మకి పుట్టిన మగపిల్లలిద్దరూ అవకరంతోటే పుట్టారు. ఆవిడ ముందు ఏడ్చింది. తరవాత మొగుణ్ణి తిట్టింది. ఆ తర్వాత మొత్తం కుటుంబాన్నే శాపనార్థాలు పెట్టింది. దానికి తోడు కామేశ్వరమ్మ తోడికోడళ్లిద్దరిలో ఒకావిడకి నలుగురు ఆడపిల్లలు. మరొకావిడకి ఇద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల. అందరూ కూడా చిదిమి దీపాలు పెట్టచ్చునేట్టు ఉండేవాళ్లు.

కామేశ్వరమ్మ లోలోపల తోడికోడళ్ల మీద ఈర్ష్యతో రగిలిపోతూ వాళ్లని అయినదానికీ, కానిదానికీ ఆడిపోసుకుంటూ ప్రతిరోజూ ఇంట్లో రభస చేస్తుండేది. ఆవిడ రభసతో ఇంట్లో శాంతిభద్రతలకి భంగం వాటిల్లడం మొదలైంది. ఆవిడ బాధ పడలేక తోడికోడళ్లు ఇద్దరూ ఒకటై ఆవిడని నానామాటలనేవాళ్లు. ఆ గొడవలు అన్నదమ్ములదాకా వ్యాపించి పగగా మారిపోడంతో పెద్దవాళ్లు కలుగ చేసుకుని ఆస్తులు పంచి అందర్నీ ఎవరిదారిన వాళ్లు బతకండని పంపించేశారు. సరిగ్గా అదే సమయంలో సుందరయ్యకి బదిలీ కావడంతో భార్యనీ, పిల్లల్నీ తీసుకుని హైదరాబాద్ వచ్చేశాడు. తండ్రి ఇచ్చిన భాగంలో

తన భాగం ఎకరం పొలం అమ్మి హైదరాబాద్‌లోని నల్లకుంటలో ఇల్లు కొని, స్థిరపడ్డాడు.

పుట్టిన ఇద్దరు మగపిల్లలు ఎందుకూ పనికిరానివాళ్లు కావడంతో వాళ్లు మరో సంతానానికి జన్మనివ్వడానికి భయపడ్డారు. సుందరయ్య కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్నాడు. అయినా ఆ భార్యాభర్తలిద్దరి మనసుల్లో ఒక బాధ పేరుకుపోయింది. ఆ బాధ పంచుకోడానిక్కూడా వాళ్లకి బంధువులు, మిత్రులనేవాళ్లు మిగలలేదు. కామేశ్వరమ్మ గయ్యాళితనం తెలిసిన బంధువులెవరూ వాళ్లని చేరదీయలేదు సరికదా, వాళ్లని వెలేశారు.

ఆ వెలినుంచి వాళ్లలోని బాధ కసిగా మారింది. నెమ్మదిగా వాళ్లల్లో ఒక విధమైన పర్వర్షన్! దాని ద్వారా శాడిజం చోటుచేసుకుంది.

నల్లకుంటలో వాళ్ల తరువాత వచ్చి ఇళ్లు కట్టుకుని స్థిరపడినవాళ్లంతా కూడా ఆ పిల్లల్ని చూసి జాలిపడుతుంటే ఆవిడ భరించలేక నోటికొచ్చినట్లు తిడుతుండేది. ఆ తిట్లకి భయపడి ఎవరూ వాళ్లింటికి వెళ్లడానికి సాహసించలేదు. ఆ విధంగా వాళ్లు ఒంటరివాళ్లయ్యారు. దానికి తోడు తమ కళ్ల ముందు పుట్టిన పిల్లలెందరో చక్కగా ఎదిగి ఉన్నత చదువులు చదువుతుండడం, వాళ్ల పిల్లలు అప్రయోజకులు కావడం సుందరయ్యలో కూడా కసికి కారణం అయింది.

పిల్లలు మామూలు మనుషులవుతారేమో అనే ఆశతో కొంతకాలం డాక్టర్ల చుట్టూ తిరిగి చాలా డబ్బు ఖర్చుపెట్టాడు. సరిగ్గా అప్పుడే సుందరయ్య జీతం చాలక లంచాలు తీసుకోవడం మొదలుపెట్టాడు. ఆయన ఖర్చు పెట్టిన డబ్బుకి కేవలం పదోవంతు ఫలితం మాత్రమే ఆయనకి దక్కింది. ఇద్దరు పిల్లలకీ చొంగకారడం తగ్గింది. అంతకు మించి మార్పులేదు. పైగా రెండోవాడు రోజురోజుకీ క్రూరంగా మారుతూ తల్లిదండ్రులను, అన్నగారిని హింసిస్తూ ఉండేవాడు. ఆ బాధ పడలేక వాడిని చేతులారా చంపేశారని చుట్టుపక్కలవాళ్లు అనుకుంటారు.

నిత్యం తమని ఎవరో గమనిస్తున్నారని, ఏనాటికైనా ఎటు నుంచి అయినా తమకు ముప్పు రావచ్చని మానసికంగా కుమిలిపోతూ ఏం జరుగుతుందో అనుకుంటూ భయపడి వాళ్లు పూర్తిగా బైటకు రావడం మానేశారు. దానికి తోడు సుందరయ్య లంచం తీసుకుంటూ పట్టుబడి సస్పెండ్ అయ్యాడు. ఆ అవమానం కూడా బైట ప్రపంచంతో వాళ్లకి సంబంధాలు పూర్తిగా తెంపేసింది.

కొంతకాలానికి ఆయన వాలంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నాడు.

ఆ తరువాత నాలుగు గోడలమధ్య, టి.వి. చూస్తూ, భార్యాభర్తలు ఆ కొడుకుతో అలా జీవితం గడిపేస్తున్నారు.

ఈ లోపల శీనుకి వయసు పెరుగుతోంది. వాడిలో చిత్రమైన మార్పులు గమనించారు.

అన్నం తినడం, స్నానం చేయడం కూడా చేతగాని కొడుకు హఠాత్తుగా వాకిట్లోకి వెళ్లిపోయి ఆడవాళ్లని అదేపనిగా చూడడం, అటుగా వెళ్తున్న ఆడవాళ్లమీద రాళ్లు వేయడం, టి.వి.లో కనిపించే కొన్ని దృశ్యాలు చూస్తూ కేరింతలు కొట్టడం, చొంగకార్చడం.. వింతగానూ, భయం గొలిపే విధంగానూ ఉండడంతో కామేశ్వరమ్మ భర్తతో అంది "వీడి వాలకం చూస్తుంటే వీడికి పెళ్లి చేస్తే బాగుంటుందేమో అనిపిస్తోందండి"

"వీడికి పెళ్లా? ఎవరు చేసుకుంటారు?" అన్నాడు సుందరయ్య.

ఆయన 'ఎలా చేస్తాం?' అని ఉంటే

ఆవిడ ఆ సంభాషణ ముందుకు తీసికెళ్లేది కాదేమో. కానీ ఆయన 'ఎవరు చేసుకుం టారు? ' అనగానే, 'చేసుకునే వాళ్లుంటే చేయవచ్చన్నమాట' అని ఆశపడిందామె.

అందుకే అంది "వెయ్యి అబద్ధాలాడి ఒక పెళ్లి చేయమన్నారు పెద్దలు. పది అబద్ధా లతో వీడి పెళ్లి చేయలేమంటారా? ఆలో చించి చూడండి. మీ రామశాస్త్రిగారికి ఓ కార్డుముక్క రాయండి. అలాగే రేపోసారి వీడికి ముస్తాబు చేసి అలా తీసికెళ్లి ఒక ఫొటో తీయించండి. ఆ తరువాత కథ నేను నడిపిస్తాను"

"మరోసారి ఆలోచించు" అన్నాడాయన.

"ఆలోచించడానికేం ఉంది? మనం శాశ్వతమా? వీడు బతికున్నంతకాలం కని పెట్టి ఉండడానికి ఎవరన్నా ఉండాలిగా? దేవుడు తప్పకుండా ఎవరినో రాసే ఉంటాడు. ప్రయత్నం చేయండి. ప్రయత్నం చేయడానికి ఖర్చేం లేదుగా? "

ఆయన తల పంకించాడు.

సుందరయ్యకి అటు ఆఫీసులో, ఇటు ఇంటి దగ్గరా ఎవరూ పెద్దగా స్నేహితులు లేరు. ఒక రామశాస్త్రి మాత్రం ఆయనకి కొంచెం సన్నిహితం అయ్యాడు. కొంత కాలం సుందరయ్య, రామశాస్త్రి కలిసి పని చేశారు. రామశాస్త్రి కూడా సుందరయ్య లాగే లంచాలు మరిగినవాడే. కాకపోతే సుందరయ్య కన్నా ఐదారేళ్లు పెద్దవాడు కావడంతో కొంచెం త్వరగా రిటైర్ అయి తన స్వంత ఊరు గుంటూరు వెళ్లిపో యాడు. ఇద్దరూ ఎంత సన్నిహితులైనా ఆయన ఏనాడూ సుందరయ్య ఇంటికి రాకపోవడంవల్ల ఆయన కొడుకుల గురించి తెలియదు.

కాబట్టి ఆవిడ అన్నట్టుగానే 'ఫొటోతో కథ నడిపించవచ్చు' అనుకున్నాడు.

అనుకున్న తడవే కొడుకుని ముస్తాబు చేసి, బైటకి తీసికెళ్లి ఫొటో స్టూడియోలో ఫొటో తీయించాడు.

అక్కడ శీను చేసిన గొడవ, అతని వెకి లి చేష్టలు చూసి, స్టూడియో వదిలి పారి పోవాలనిపించింది ఫొటోగ్రాఫర్‌కి. కానీ సుందరయ్య అతని కాళ్లావేళ్లా పడి బతి మాలడంతో తప్పనిసరి అయి రెండు పోజులు తీశాననిపించాడు.

రెండు రోజుల్లో ఆ ఫొటోతో సహా రామశాస్త్రికి సంబంధం చూడమని, కుర్ర వాడు గ్రాడ్యుయేషన్ పూర్తిచేశాడని అబ ద్ధాలు చెబుతూ కార్డు రాశాడు. చివర్లో

బీద ఇంటి పిల్ల ఎవరన్నా అయితే ఆదర్శ వివాహం చేశానన్న తృప్తి తండ్రిగా తనకు ఉంటుందని ఒక ఆత్మవంచనతో కూడిన వాక్యం రాశాడు.

దానికి తిరుగు టపాలో జవాబు వచ్చింది.

పొన్నూరులో రామశాస్త్రి దూరపు బంధువు చలపతిరావుకి నలుగురాడపిల్లలు. చివరిపిల్లను కని అతని భార్య చనిపోయింది. చలపతిరావు పక్కా తాగుబోతు, ఉద్యోగంలేదు. రాజకీయాల్లో తిరుగుతూ, బాధ్యతారహితంగా ఉంటూ భార్య చావుక్కూడా అతనే కారణం అయ్యాడని అంటారు. పెద్ద కూతురు అరుంధతి.

తల్లి చనిపోయేనాటికి అరుంధతికి ఎనిమిదేళ్లు. అల్లుడు బాధ్యతారహితంగా తిరగడం, కూతురు పోవడంతో పిల్లల్ని నలుగురినీ అమ్మమ్మా, తాతయ్యలే పెంచారు. స్కూలు ఫైనల్‌దాకా చదువులు చెప్పించి, చిన్నచిన్న ఉద్యోగాలు చూపించాడు తాతగారు. అయితే పెద్దమ్మాయి అరుంధతికి ముందు పెళ్లి చేసేస్తే సరిపోతుందని బంధువులకీ చెప్పి పెట్టాడు, ఏదన్నా సంబంధం ఉంటే చెప్పమని. సరిగ్గా అప్పుడే సుందరయ్య ఉత్తరం రావడం, ఆ ఉత్తరం పెద్దాయనకి రామశాస్త్రి చూపించడం జరిగింది.

పిల్లాడు ఫొటోలో బాగానే ఉన్నాడని, గ్రాడ్యుయేషన్ అంటే ఫర్వాలేదు.. మంచి చదువే అని, ఇంతకన్నా మంచి సంబంధం తీసుకురాలేమనీ మనవరాలిని ఒప్పించి, తృప్తిపడి ముహూర్తం నిశ్చయించాడు.

ముహూర్తం రోజుకి చుట్టుపక్కలవాళ్లకెవరికీ తెలియకుండా గప్‌చుప్‌గా కొడుకుని తీసుకుని పొన్నూరు వెళ్లిపోయారు సుందరయ్య కామేశ్వరమ్మ.

పెళ్లిపీటలమీదకు వెళ్లేదాకా పిల్లాడిని ఎవరికీ చూపించకుండా గడిపి ఆ మూడు ముళ్లు వేయించేశారు భార్యాభర్తలు. పెళ్లివాళ్లు పెళ్లికొడుకును చూసి అనుమానాలు, సందేహాలు వ్యక్తపరుస్తుంటే ఆరోగ్యం బాగాలేదని అతడికి రెస్టుకావాలని సర్ది చెప్పి ఒకటీ, అతనికింక లీవులేదని వెంటనే వెళ్లిపోవాలని ఒకటీరెండు అబద్ధాలు చెప్పి, పెళ్లి అయిపోయిన వెంటనే తిరుగు ప్రయాణం కట్టించారు. పిల్లతోపాటు వస్తున్న ఆ పిల్ల మేనత్తని కూడా రావద్దని వారించి పిల్లను మాత్రమే తీసుకుని వెళ్లిపోయారు.

అయితే కొందరు పెళ్లికొడుకు వాలకం పట్ల, బంధుమిత్రులెవరూ లేకుండా ముగ్గురే వచ్చి పెళ్లి చేసుకుని వెంటనే పిల్లని తీసుకుని వెళ్లిపోడం పట్లా అనుమానాలు వ్యక్తం చేసినా ముసలాయన పెద్దగా పట్టించుకోలేదు.

కట్నం లేకుండా, తల్లీ తండ్రీ లేని పిల్లకి పెళ్లి చేసానన్న ఆనందం ముందు మిగతావేవీ ఆయన దృష్టికి రాలేదు.

పెళ్లి ముహూర్తం అర్ధరాత్రి అవడంతో తంతు పూర్తి కావడానికి దాదాపు తెల్లవారుజాము అయింది. రెండు గంటల్లో అంతా సర్దేసుకుని, ఆరు గంటలకల్లా ప్రయాణమై బస్సెక్కారు. బస్సులో అరుంధతి అత్తగారి పక్కన కూర్చుంది. బస్సెక్కగానే కళ్లు మూసుకుపోతుంటే గాఢంగా నిద్రపోయింది.

హైదరాబాద్ ఇమ్లీబన్ బస్‌స్టేషన్‌లో బస్సు ఆగాక కానీ లేవలేదు. అక్కడ్నించి ఆటోలో ఇంటికి వెళ్లిపోయారు. ఆటోలో కూడా నిద్రమత్తుతో జోగుతున్న అరుంధతికి భర్తని గమనించే అవకాశం కలగలేదు.

కాకపోతే వచ్చిన వెంటనే అత్తగారు స్నానం చేసి రమ్మని బాత్‌రూమ్‌కి పంపించింది. కాసేపట్లో స్నానం చేసి బైటకి వచ్చిన అరుంధతికి శీను విశ్వరూపం,

అతని అఘాయిత్యం కనిపించి నిర్ఘాంతపోయింది. అత్తగారిని జుట్టు పట్టుకుని లాగుతూ ఏదో అంటూ గొడవ చేస్తున్నాడు. ఆవిడ జుట్టు విడిపించుకోడానికి ప్రయత్నిస్తుంటే అతను పగలబడి నవ్వడం కాస్సేపు ఆమెకి ఏమీ అర్థం కాలేదు.

గుడ్లప్పగించి చూస్తున్న కోడల్ని చూసి అవమానంతోటో, అహంకారంతోటో గట్టిగా గర్జించింది కామేశ్వరమ్మ. ఆ క్షణంలో ఆవిడకి ఆ పిల్ల కొత్త పెళ్లికూతురని, ఆ ఇంటికి అప్పుడే మొదటిసారి వచ్చిందని, తన విశ్వరూపం చూపిస్తే భయపడి బెదిరిపోతుందనే ధ్యాస కలగలేదు.

"ఏంటే చూస్తున్నావు? కళ్లు కనిపించడంలేదా? ఇటొచ్చి విడిపించు" అంటూ తల పూర్తిగా కొడుకు వైపు తిప్పి కోడల్ని కళ్ల చివర్ల నుంచి చూస్తూ అరిచింది.

అరుంధతి నిల్చున్న చోటునుంచి కదలలేదు. ఆవిడ జుట్టు చేత్తో పట్టుకుని పిచ్చి గంతులు వేస్తూ అరుస్తున్నాడు శీను.

"నాకు కోటు కావాలి... నాకు కోటు కావాలి" అంటూ గంతులేస్తుంటే, ఆవిడ బాధతో అరుస్తోంటే, సుందరయ్య బైట నుంచి పాలపాకెట్టు తీసుకుని వస్తూ పరుగు పరుగున వచ్చి, అతని చేతిలోంచి జుట్టు విడిపించి, లాగి శీను చెంపమీద ఒక్కటిచ్చాడు.

ఒక్కసారిగా వాడి ఏడుపుతో ఇల్లు మార్మోగింది.

అరుంధతి గుండెల్లో కొన్ని వందల డైనమెట్లు పేలుతున్నట్టు, తలమీద వరసగా పిడుగులు పడుతున్నట్టు కళ్లు బైర్లు కమ్మసాగాయి.

చూస్తుండగానే ఆమె కళ్లల్లో కన్నీళ్లు ఉబికి దుఃఖం తన్నుకొచ్చింది. ఒక్కసారిగా గట్టిగా ఏడవడం ప్రారంభించింది.

"ఏయ్.. ఒసేయ్.. ఎందుకే ఏడుస్తున్నావు? ఎందుకు? ఏడుపు ఆపుతావా? లేదా? " ఉరుముల్లా వినిపిస్తున్నాయి అత్తగారి మాటలు.

అరుంధతి కుప్పకూలిపోయి వెక్కి వెక్కి ఏడుస్తూ అనసాగింది "తాతయ్యా.. తాతయ్యా.. నా జీవితం నాశనం చేశారు.. నా జీవితం నాశనం చేశారు"

"నోర్ముయ్.." కామేశ్వరి సివంగిలా

మీద పడి అరుంధతి జడపట్టుకుని లేపి, ఆ చెంపా, ఈ చెంపా వాయించింది.

"చంపేస్తాను ఏడిచావంటే. ఈ విషయం ఎక్కడైనా పొక్కిందా నీ ప్రాణాలు మిగలవు. విను, వాడు నీ మొగుడు. వెర్రివాడు. వాడిని చేతనైతే బాగుచేసుకో.. లేదంటే నోరుమూసుకుని పడి ఉండు. ఏం ఫర్వాలేదు. వాడు పిచ్చి వాడైనా మగవాడే. దర్జాగా సంసారం చేస్తాడు. ఇల్లు, మొగుడు, తిండి, గుడ్డా ఇంతకన్నా నీకేం కావాలి? "

అరుంధతి మండిపడుతూ అరిచింది "అవసరం లేదు. నాకవసరం లేదండి. నేను వెళ్లిపోతాను. నా పుట్టింటికి వెళ్లిపోతాను. నన్ను పంపించేయండి"

"ఎక్కడికి వెళతావు? ఇంట్లోంచి కదిలావంటే మక్కెలిరుగుతాయి" గుమ్మంవైపు వెళ్లబోతున్న అరుంధతిని జబ్బ పట్టుకుని లాగింది.

"నేను వెళ్తాను.. నన్ను వెళ్లనివ్వండి.. ప్లీజ్... మీకు దండం పెడతాను... నన్ను వెళ్లనివ్వండి"

"ఈ ఇంటికి వచ్చాక వెళ్లడం అనేది కల్ల. నోరుమూసుకుని పడి ఉండు. ఇక్కడుంటే కనీసం తిండీ, నీళ్లన్నా దక్కుతాయి" అంటూ పెనుగులాడుతున్న అరుంధతిని భార్యాభర్తలిద్దరూ కలిసి గదిలోకి తోసి బైట తలుపు గొళ్లెం పెట్టారు.

కిటికీ దగ్గరగా వచ్చి ఏడుస్తున్న అరుంధతిని చూస్తూ ఒగరుస్తూ అంది కామేశ్వరి "నువ్వు నోరు మూసుకుని పడి ఉండేదాకా ఆ గదిలోనే చావు"

సుందరయ్య భార్యని సమర్థిస్తూ "అంతే.. అదే శిక్ష నీకు" అంటూ క్రూరంగా చూశాడు.

అరుంధతి గుండెలవిశేలా ఏడవసాగింది. అక్కడినుంచి ఆమెకి కష్టాలు ప్రారంభం అయ్యాయి. ఆ క్షణం నుంచీ ఆ ఇంటి చెరసాలలో ఆమె బందీ అయింది. పుట్టింటివారితో ఎలాంటి సంపర్కంగానీ, ఉత్తరప్రత్యుత్తరాలూగానీ లేవు. తన కష్టం చెప్పుకోవడానికి ఆత్మీయులు లేరు. ఆ నరకం నుంచి తప్పించే వాళ్లు ఎవరూ లేరు. వెర్రిబాగులవాడైన మొగుడు, కంటిచూపులతోటే కత్తులు విసిరే అత్తగారు, డేగకళ్లతో కాపలా కాసే మావగారు!

అరుంధతి నడిచే శవం అయింది. నెమ్మదిగా అరుంధతి ఉనికి చాపకింద నీరులా చుట్టుపక్కల వ్యాపించింది.

రాత్రిపూట గదిలోంచి వినిపించే ఆమె హాహాకారాలు వద్దనుకున్నా ఆ పరిసరాల్లో మార్మోగుతుండేవి.

మొగుడనబడే ఆ పిచ్చోడి రాక్షస రతి భరించలేక గొంతు తెగేలా అరుస్తూ, ఏడుస్తూ ఉండేది. ఎంతగా తలుపులు అన్నీ మూసేసినా అర్ధరాత్రి వేళ నిశ్శబ్దం ఆవరించిన పరిసరాల్లో ఆమె ఆక్రోశం చుట్టుపక్కలా అస్పష్టంగా ప్రతిధ్వనిస్తుండేది.

చుట్టుపక్కలవాళ్లంతా ముందు కొన్ని రోజులు ఆ కేకలు, ఆర్తనాదాలు ఎక్కడి నుంచో ఏంటో అర్థంగాక పట్టించుకోలేదు. తెలిసాక ఆ కుటుంబ విషయాల్లో కలగచేసుకుని ఇబ్బందులు కొనితెచ్చుకోవడం

ఇష్టం లేనివారంతా మౌనంగా ఆ పిల్లను తలచుకుని బాధపడడం తప్ప ఏం చేయ లేకపోయారు.

అయితే ఆ కుటుంబం పట్ల అస హ్యంతో, ఏదన్నా చేయాలన్న తపనతో ఉన్న కుటుంబం ఒకటి ఉంది. అదే విశ్వ నాథం కుటుంబం.

విశ్వనాథం స్వతహాగా చాలా మంచి వ్యక్తి. అతనికి తగినట్టే భార్య సుమతి కూడా అన్ని విధాలా భర్తకు అనుకూ లంగా ఉంటూ సహధర్మచారిణి అనే పేరుని సార్థకం చేసుకుంది. పిల్లలిద్దరూ కూడా తల్లిదండ్రుల సంస్కారం పుణికిపు చ్చుకుని, చిన్నప్పటినుంచీ కూడా తోటివా ళ్లకు సహాయపడుతూ, అందరితో మంచిగా, ఎవరినీ నొప్పించక, తానొవ్వక అన్నట్లు మసలుకుంటూ మంచి పేరు తెచ్చుకున్నారు. ఆ దంపతులకు ఆడపిల్ల లంటే చాలా ఇష్టం. వాళ్లకి ఆడపిల్లలు లేకపోవడం ఒక లోటుగా అనిపిస్తుం టుంది. ఆడపిల్లంటే ఇంటికి మహాలక్ష్మిలాం టిదని, ఆడపిల్ల మనసుని నొప్పిస్తే మంచి జరగదని నమ్మే వ్యక్తులు వాళ్లు. ఎక్కడ ఏ ఆడపిల్లకి అన్యాయం జరిగిందని తెలిసినా చలించిపోతుంటారు.

అలాంటిది ఇప్పుడు తమ కళ్ల ఎదు రుగా ఒక అమాయకురాలు పడుతున్న నరకయాతన వాళ్లకి భరించలేనిదిగా అని పిస్తోంది. వెర్రిబాగులవాడికి భార్యగా, శాడి స్టులైన వ్యక్తులకు కోడలిగా చిత్రహింసలు భరిస్తుంటే ఏదో చేయాలని అనిపిస్తుం టుంది. కానీ ఏం చేయాలో, ఎలా చేయాలో అర్థం కావడం లేదు. ఒకరి వ్యక్తిగత విషయాలు పట్టించుకోవడం సభ్యత కాదన్న భావనతో కొంచెం దూరంగా ఉన్నా, ఆ పిల్ల గురించి ఆలో చించకుండా ఉండలేకపోయారు.

ఓరోజు విశ్వనాథం భార్యతో అన్నాడు "ఏదైతే అయింది. వాళ్లింటికి వెళ్లి కాస్సేపు ఆవిడతో మాట్లాడి, వీలు చూసుకుని ఆ పిల్లతో కూడా మాట్లాడి ఏదన్నా సాయం కావాలంటే అడగమని చెప్పిరా సుమతీ. నాకెందుకో ఆ పిల్ల ఆ ఇంట్లో ఎక్కువ రోజులు బతికి ఉండదేమో అనిపిస్తోంది"

"చాల్లెండి.. అవేం మాటలు" మృదు వుగా మందలించినా ఆవిడక్కూడా లోలో పల అదే ఆలోచన ఉంది.

అప్పుడే అటు వచ్చిన గోపి కూడా అదే అన్నాడు "అవునమ్మా.. రోజూ రాత్రిపూట ఆ అమ్మాయి ఆర్తనాదాలు నా గదిలోకి వినిపిస్తుంటాయి. నాకు చదువుమీద ఏకా గ్రత ఉండడం లేదు. ఏదన్నా హెల్ప్ కావాలేమో అడిగిరా.. వీలైతే వాళ్ల పేరెం ట్స్‌ని పిలిపిద్దాం"

భార్యాభర్తలిద్దరూ మొహామొహాలు చూసుకున్నారు.

సుమతి ఆప్యాయంగా కొడుకు తల నిమిరి "రేపట్నించీ నువ్వు అన్నయ్య గదిలో పడుకో. డిస్టర్బెన్స్ లేకుండా ఉంటుంది" అంది.

"అయినా పాపం ఒకసారి నాన్న చెప్పి నట్లు వెళ్లిరామ్మా.. ఆవిడ నువ్వు కనిపిస్తే బానే మాట్లాడుతుందిగా"

"అవును సుమతీ.. వెళ్లిరా. మనం ఆలో చిస్తూ కూర్చుంటే రేపేదన్నా జరిగితే మనల్ని మనం క్షమించుకోలేం" అన్నాడు విశ్వనాథం.

సుమతీ దీర్ఘంగా నిట్టూర్చి "సర్లెండి.. చూస్తాను.. వెళ్లొస్తాను" అంది.

అలా అన్నదే కానీ, చూస్తూచూస్తూ వాళ్లింటికి వెళ్లి ఆవిడతో మాటలు పడాల్సి వస్తుందేమోనని సందేహిస్తూ రెండురో జులు గడిపింది.

ఆ రోజు గురువారం. సుమతి కూరగా యల మార్కెట్‌కి వెళ్లివస్తుంటే కామేశ్వ రమ్మ పెరట్లో బట్టలారేస్తూ కనిపించింది

ఆ అమ్మాయి.

వాళ్ల పెరటివైపు నుంచి, ఎడం పక్క రోడ్డులో వెళితే కూరగాయల మార్కెట్ దగ్గర. ప్రతి గురువారం ఉదయం పదిగంటలకు తోటలనుంచి లారీలో తీసుకొచ్చి అమ్ముతారు తాజా కూరగాయలు. విశ్వనాథం ఆఫీసుకి వెళ్లగానే సుమతి ప్రతి గురువారం అలా వెళ్లి కావాల్సిన కూరగాయలు తనే తెచ్చుకుంటుంది.

ఆ అమ్మాయిని చూస్తూ వాళ్ల కాంపౌండ్‌వాల్ దగ్గరకు నడిచింది. పచ్చటి రంగు, విశాలమైన కళ్లు, వత్తైన జుట్టు, ఐదడుగులు ఉండచ్చు. పల్చగా దంతపు బొమ్మలా ఉంది. కొంచెం దగ్గరగా నడిచి తలెత్తి చూసింది సుమతి. ఎడమ చెంప మీద గాట్లు, ఎర్రగా కమిలిపోయి ఉంది చెంప. కళ్ల నిండా విషాదం. చీరలు దులిపి దండెం మీద వేస్తోంది.

సుమతికి జాలేసింది. మొరటు వెధవ, ఎన్ని చిత్రహింసలు పెడుతున్నాడో ఈ పిల్లని అనుకుంది.

సుమతి ఆలోచించలేదింక. వడివడిగా నడిచి ఎడమ పక్కనుంచి ఆ ఇంటి మెయిన్‌గేటు దగ్గరకు వచ్చింది. గేటు మూసే ఉంది. చాలా అత్యవసరం అయితే తప్ప తీయరు.

సమతి గేటుమీద గట్టిగా కొట్టింది.

నాలుగుసార్లు కొట్టాక "ఎవరూ?" అంటూ సన్నటి స్వరం వినిపించింది.

"ఎవరూ అంటూ ఇక్కడ నిల్చుంటే తెలుస్తుందా? వెళ్లి గడియతీయి" అరిచింది కామేశ్వరమ్మ.

నిమిషం తరువాత అడుగుల శబ్దం, ఆ తరవాత గడియ తీసిన శబ్దం వినిపించింది.

గేటు తోసి లోపలికి అడుగుపెట్టింది సుమతి. ఆ అమ్మాయి కళ్లెత్తి చూసింది. అప్పుడే సుమతి కూడా ఆమెవైపు చూసింది. ఇద్దరి చూపులు కలుసుకున్నాయి. ఆమె కళ్లల్లో ఆరని తడి, బెదురు. సుమతి కళ్లల్లో సానుభూతి, వాత్సల్యం.

గేటులోంచి ముందుకు వెళితే ఎడమవైపు చిన్న వరండా, దానికి గ్రిల్స్ డోర్, వరండాలోంచి ప్రధానద్వారం. దానిగుండా లోపలికి వెళితే హాలు, హాల్లోంచి పెరటివైపు గుమ్మం, పెరటివైపు వెళుతుంటే కుడి పక్క వంటగది, ఎడమపక్క దేవుడి గూడు, ఆవకాయ జాడీలు, సరుకులు పెట్టుకోడానికి రెండు షెల్ఫులు, వాటికి తలుపుల్లేవు.

హాల్లో ఎడమవైపు ఒక గది, కుడివైపు ఒక గది.

అప్పుడే వరండాలోకి వచ్చిన కామేశ్వరి "ఎవరు?" అంటూ అడిగింది, మొహంపై పడుతున్న సూర్యకిరణాలకి ఎదుటివాళ్లు కనిపించక ఎడమచేయి నుదుటిమీద పెట్టుకుని కళ్లు చికిలిస్తూ.

ఆ అమ్మాయి ఉలిక్కిపడి, తలవంచుకుని లోపలికెళ్ళిపోయింది.

సుమతి కామేశ్వరమ్మ వైపు నడుస్తూ "నేనే వదినగారూ.. సుమతిని, ఎదురింట్లో సుమతిని"

కామేశ్వరమ్మ నుదురు మీంచి చేయి తీసి కుడిచేయి గుమ్మం ఆసరాగా పట్టుకుని ఒక అడుగు వేసి "మీరా?" అంది. ఆ అనడంలో 'నువ్వెందుకొచ్చావు?' అనే అనుమానం వ్యక్తం అవుతున్నట్లు అనిపించింది సుమతికి.

"కులాసాగా ఉన్నారా?" ఆవిడ దగ్గరగా వచ్చి, చేయందుకుంది సుమతి.

"నాకేం తల్లీ నిక్షేపంలా ఉన్నాను. ఏంటి ఇలా వచ్చావు? దా లోపలికి" అంటూ లోపలికి నడిచింది.

ఆవిడ్ని అనుసరిస్తూ "బాగానే ఉన్నాను. చాలా రోజులైంది మిమ్మల్ని చూసి. అలా కూరగాయలకోసం వెళ్తూ ఇటొచ్చాను.

బంధువులొచ్చారా? ” ఏమీ తెలియనట్లు అడిగింది సుమతి.

“అలా కూర్చో” అంటూ హాల్లో ఉన్న సోఫా చూపించి, తాను మంచం మీద కూర్చుంటూ “ఆ.. మా మేనకోడలు. తాడే పల్లిగూడెం నుంచి వచ్చింది” అంది.

“అలాగా..? అదే కొత్తమ్మాయి కనిపిస్తేనూ.. చెప్పండి ఎలా ఉన్నారు? అన్నయ్యగారి ఆరోగ్యం బాగుందా? శీనెలా ఉన్నాడు? ” అంటూ అటూఇటూ చూపులు తిప్పుతూ శీనుకోసం చూసింది సుమతి.

శీను ఎడమవైపు ఉన్న గదిలో నేలమీద కూర్చుని ఉన్నాడు. వాడి ఎదురుగా ఒక పెద్ద బొమ్మల పుస్తకం ఉంది. వాడు కుడి చేయి చూపుడువేలితో మధ్యమధ్య వేలు నాలిక్కి రాసుకుంటూ పేజీలు తిప్పుతూ ఏదో లోకంలో ఉన్నాడు. కుడివైపు ఉన్న గది మూసి ఉంది. ఆ ద్వారానికి అడ్డంగా కామేశ్వరమ్మ మంచం ఉంది. ప్రధానద్వారానికి ఒక పక్క మరో మంచం. బహుశా అది సుందరయ్యది అయిఉంటుందనుకుంది.

వంటగదిలోంచి గిన్నెల శబ్దం వినిపిస్తోంది. ఆ అమ్మాయి వంట చేస్తున్నట్టుంది అనుకుంది సుమతి.

“అందరం బానే ఉన్నాం. ఏం కూరలు కొన్నావేంటి? ” అడిగింది బుట్టవైపు చూస్తూ.

“చాలా లేతగా ఉంటేనూ బెండకాయలు, దొండకాయలు, ఆకుకూరలు, మామిడికాయలు.. ఇంకా ఏవేవో వారానికి సరిపడా కొన్నాను.. మీకేవన్నా కావాలా? ”

“అబ్బే, ఏం వద్దు. మీ అన్నయ్యగారు బైటికెళ్లారుగా.. వచ్చేటప్పుడు తెస్తారు. వంట అయిపోయిందేంటి? ” అంది.

“ఆ.. ఆయనకి, పిల్లాడికి క్యారేజీ ఇచ్చి పంపించాను. అమ్మాయి పేరేంటి? ” అడిగింది తలతిప్పి వంటగది వైపు చూస్తూ.

“అరుంధతి”

“చదువుకుంటోందా?

“స్కూలు ఫైనలు అయింది. ఊరికే ఉందని, మాకు తోడుగా ఉంటుందని పంపించాడు మా తమ్ముడు”

“ఓ! ఇంకా ఏంటి విశేషాలు? ”

“ఏముంటాయమ్మా, ఇంట్లో కూర్చునే వాళ్లం మేం. మాకేం ఉంటాయి విశేషాలు? ”

“మీ మోకాళ్లనొప్పులు తగ్గాయా? ”

“ఈ వయసులో వచ్చిన జబ్బులు తగ్గుతాయా? ”

నవ్వేసి ఊరుకుంది సుమతి. ఆవిడ చాలా పుల్లవిరుపుగా మాట్లాడుతోంది. ఎక్కడో ఏ మూలో సభ్యత ఉంది కాబట్టి గుమ్మం ముందుకు వచ్చిన అతిథిని అమర్యాద చేయడం లేదు. కానీ, అవకాశం ఉంటే మెడపట్టి గెంటేసేలా ఉంది. ఆ అమ్మాయితో ఏదన్నా మాట్లాడాలి అనిపించింది సుమతికి. కానీ, ఆమె బైటకి రాకుండా వంటగదిలోనే ఏదో చేస్తోంది. గిన్నెల శబ్దం అవుతోందికానీ, వంటచేస్తున్న వాసనలు లేవు. బహుశా గిన్నెలు కడిగి సర్దుతోందేమో.

సుమతి కాస్సేపలా దిక్కులు చూస్తూ కూర్చుంది. ఇద్దరి మధ్యా మరి మాటలు సాగలేదు. కామేశ్వరమ్మ సుమతి ఎప్పుడు వెళ్లిపోతుందా అని చూస్తోంది. కొద్ది నిమి

షాలు గడిచాక సుమతి లేచింది. లేస్తూ లేస్తూ చేతిలో ఉన్న పర్సు కిందకి వదిలేసింది. కూరగాయల బుట్ట చేతికి తీసుకొని "వస్తానండి..." అంది.

"మంచిదమ్మా" అంటూ కామేశ్వరమ్మ కూడా లేచింది..

"పర్లేదు మీరు కూర్చోండి.. మోకాళ్ల నొప్పులతో ఎక్కడికొస్తారు? " అంటూ గుమ్మం దాటింది సుమతి.

'అప్పుడప్పుడు వస్తుండు' అంటుందేమో అనుకుంది. కానీ తనలో తనే ఎంత ఆశ అనుకుంది.

"మంచిది.. ఉంటా" అంది కామేశ్వరమ్మ గేటు దగ్గరకు వెళ్లిన సుమతితో.

"ఆ.. ఆ.. అలాగే" అంటూ గేటు తీసుకొని బైటకి వెళ్లిన సుమతి ఒక్కసారి వెనక్కి తిరిగి చూసింది. కామేశ్వరమ్మ లోపలికి వెళ్లిపోయింది. సుమతి కొన్ని క్షణాలు అక్కడే ఆగి, తిరిగి గేటులోపలికి వెళ్లి కొంచెం ముందుకు నడిచి కొంచెం గట్టిగా "అమ్మాయ్" అంటూ పిలిచింది.

ఎవరూ సమాధానం చెప్పలేదు.

సుమతి మళ్లీ పిలిచింది "వదినగారూ.." అంటూ.

ఈసారి అడుగుల శబ్దం వినిపించింది. అరుంధతి గుమ్మం దగ్గరకు వచ్చింది. "అత్తయ్యగారు బాత్‌రూమ్‌లో ఉన్నారు" అంది.

"నేను లోపల పర్సు మర్చిపోయాను, ఇలా ఇస్తావా? " కొంచెం రిక్వెస్టింగ్‌గా అడిగింది సుమతి.

ఆ అమ్మాయి లోపలికెళ్లి పర్సుతో వచ్చింది.

ఆమె దగ్గరగా వచ్చి పర్సు చేతికిచ్చింది.

సుమతి స్వరం తగ్గించి "నాకంతా తెలుసు.. ఎదురిల్లే మాది. నీకేదన్నా సాయం కావాలంటే ఎప్పుడైనా వచ్చెయ్" అంది.

ఇంతలో కామేశ్వరమ్మ "ఎవరూ, ఎవరొచ్చారే? " అంటూ బైటకి రావడంతో మాట మారుస్తూ "నీకు ముగ్గులొచ్చా? సంక్రాంతి వస్తోంది.. ఎంచక్కా మంచి ముగ్గులు పెట్టు. పాపం మీ అత్తయ్య పెద్దావిడ అవడంతో పెట్టలేకపోతున్నారు" అంది.

అరుంధతి ఏం మాట్లాడలేదు.

కామేశ్వరమ్మను చూస్తూ అంది సుమతి "పర్సు మర్చిపోయాను. మళ్లీ లోపలికి రావడం దేనికని పిలిచాను. అమ్మాయికి ముగ్గులొస్తే ధనుర్మాసం వస్తోంది కదా.. పెట్టమంటున్నాను"

"నా మొహం వచ్చు. దానికి పెద్దగా పనీపాటా నేర్పలేదు వాళ్లమ్మ గారాబంతో. అందుకే నేనే దగ్గరుండి వంటావార్పూ నేర్పిస్తున్నాను" అంది కామేశ్వరమ్మ.

"అలాగా..? అవున్లెండి. రేపు పెళ్లయితే చేసుకోవాలిగా. మంచిదమ్మా, వస్తాను. వస్తాను వదినగారూ.. మీరుండండి" అంటూ సుమతి వెనక్కి తిరిగింది.

అరుంధతి తలవంచుకుని లోపలికి వెళ్లి పోతుంటే కరుకుగా అడిగింది కామేశ్వరి "ఏం మాట్లాడింది? "

అరుంధతి ఆగిపోయింది. క్షణం నిశ్శబ్దం తరవాత అంది "ముగ్గ లొచ్చా? వాకిట్లో ముగ్గులేయి, లక్ష్మీదేవి వస్తుంది అన్నారు" అంటూ లోపలికి వెళ్లి పోయింది.

"ఎందుకొచ్చినట్టు? వెధవ ఆరాలు, ఆరా లకోసమే వచ్చింది. పాడు బుద్ధి" అంటూ మండిపడుతూ లోపలికెళ్లిపోయింది ఆవిడ.

సుమతి తాళం తీసి ఇంట్లో అడుగుపెట్టి "హమ్మయ్య" అంటూ ఊపిరి పీల్చుకుంది.

ఆవిడకి చాలా సేపటినించీ ఊపిరాడన ట్టుగా ఉంది.

'ఏవిటో.. ఆ ఇల్లేంటో.. ఆ వాకి లేంటో.. ఆ నిశ్శబ్దం ఏంటో.. పిశాచాలు నాట్యం చేస్తున్నట్టుంది. కానీ మను షులుంటున్నట్టు లేదు. ఎందుకీ బతుకు? నలుగురితో మంచిగా ఉంటే జనం సాను భూతి అన్నా లభిస్తుంది. ఎవరితో మాట్లా డితే ఏం జరుగుతుందో అన్నట్లు అలా ఒక్కతీ బిగదీసుక్కూర్చోడం ఏంటి? పాపం! ఆ అమాయకురాలు ఆ ఇంట్లోంచి బైటపడేదెలా? కనీసం అప్పుడప్పుడు కని పిస్తూంటే ఏదో ఒకటి మాట్లాడచ్చు. అందుకే చిన్న బాణం వేసొచ్చాను. వాకిట్లో ముగ్గులేయమని చెప్పాను. చూద్దాం, రేపట్నించీ ఏం జరుగుతుందో' అనుకుంది. తెచ్చుకున్న కూరగాయలన్నీ కడిగి ఆరబోసి, టీవీ చూస్తూ పడుకుంది సుమతి.

ఆ తరువాత వారం రోజులు ఆ ఇంటి గురించి ఆలోచించలేదు.

★ ★ ★

ఆ రోజే ధనుర్మాసం ప్రారంభం. తెల్ల వారుతూనే ఆరింటికల్లా వచ్చి లక్ష్మమ్మ వేళ్ల సందులోంచి ముగ్గు పోస్తూ గీతల ముగ్గులు రకరకాలు వేస్తుంది. ఆ రోజు కూడా వాకిట్లో నీళ్లు చల్లి ముగ్గేయబో తుంటే సుమతి స్నానం చేసి వచ్చింది.

"ఈ నెలంతా ముగ్గులు నువ్వు వేయకు, నేను వేస్తాను" అంది లక్ష్మమ్మ చేతిలో ముగ్గుబుట్ట అందుకుంటూ.

"ఏం? నా ముగ్గులు మీకిష్టం కదా? "

"ఇష్టమేలే. అలా అని ఎప్పుడూ అవే ముగ్గులా? చుక్కల ముగ్గులేస్తాను నేను"

"మంచిదమ్మా.. మీ ఇష్టం" చీర చెంగుతో చేతులు తుడుచుకుని అంట్లు తోమడానికి పెరటివైపు నడిచింది లక్ష్మమ్మ.

"అలాగే ఎక్కడన్నా దొరికితే ఆవుపేడ పట్రా.. గొబ్బెమ్మలు పెడదాం" అంది సుమతి కొంచెం గట్టిగా.

"గట్లనే" అంటూ లక్ష్మమ్మ పెరట్లోకి వెళ్లిపోయింది..

సుమతి తనకు వచ్చిన ముగ్గులు గుర్తు చేసుకుంటూ పదమూడు చుక్కలతో చక్కటి ముగ్గు వేసింది.

ముగ్గు పూర్తి చేసి ఒకసారి నిలబడి తృప్తిగా చూసి లోపలికి నడిచింది. లోప లికి వస్తూవస్తూ తల వెనక్కి తిప్పి ఓరగా కామేశ్వరి ఇంటి గేటువైపు చూసింది.

వాకిలి ఊడ్చినట్లు కూడా లేదింకా. ధను ర్మాసం అని మర్చిపోయిందేమో కామేశ్వ రమ్మ.

ఆవిడ కూడా ప్రతి ధనుర్మాసం పనిమ నిషి చేత గీతల ముగ్గులు వేయిస్తుం టుంది. ఏడాదంతా వేయకపోయినా ధను ర్మాసంలో మాత్రం వేయిస్తుంది. ఈసారి కోడలికి తను ప్రత్యేకంగా చెప్పింది కాబట్టి ఏంచేస్తుందో చూడాలి.

సుమతి లోపలికి వెళ్లిపోయింది. అరుం ధతిని బైటకి తీసుకురావడానికి తను చేసిన చిన్న మాజిక్ పనిచేస్తే

బాగుండునని ఎదురుచూస్తోంది సుమతి.

ఆవిడ ఆశించినట్టుగా ఆ రోజు సాయంత్రం కొంచెం చీకటి పడ్డాక వరం డాలో లైటు వేసి కామేశ్వరమ్మ గ్రిల్ డోర్ దగ్గర కాపలా ఉంటే, ఆ లైటు వెలుగులో అరుంధతి వాకిట్లో ముగ్గు పెడుతోంది. పెద్దజడ బరువుగా ముందుకు పడి వేళ్లాడుతోంటే అందంగా వంగి, బాపు బొమ్మలా ముగ్గుపెడుతున్న ఆ భంగిమ సుమతి మనసులో ముద్రించుకుపో యింది. వెళ్లి, ఆ అమ్మాయితో మాట కలు పుదామంటే ఆవిడ అక్కడే ఉంది. ఎవరూ పలకరించకుండా కాపలా అన్నమాట. 'చూద్దాం.. ఎప్పుడో అప్పుడు దొరకదా?' అనుకుంది సుమతి.

ఎంత చక్కటిపిల్ల. ఏం ఖర్మ కాలింది పాపం!

తలిదండ్రులెవరో, ఎంతమంది అక్కచె ల్లెళ్లు, ఎంతమంది అన్నదమ్ములున్నారో. బీదవాళ్లేమో, కట్నాలిచ్చి పెళ్లి చేయలేక ఈ వెధవకిచ్చి చేశారేమో.. అలా అయినా మరో పేదింటివాడిని చూసుకుంటారేగానీ, పిచ్చివాడికిచ్చి చేసి కూతురు గొంతుకో స్తారా? వీళ్లే మోసం చేసి ఉంటారు. ఎంత మోసం చేసినా పెళ్లిపీటలమీద యినా వాడిని చూసినవాళ్లు ఎలా ఊరుకు న్నారు? ఏదో జరిగింది, ఏం జరిగి ఉంటుంది?

సుమతి అలా కిటికీలోంచి అరుంధతిని చూస్తూ ఆలోచిస్తూ ఉండిపోయింది.

పావుగంట తరవాత అరుంధతి గేటు మూసేసి లోపలికి వెళ్లిపోయింది. ఆమె లోపలికి వెళ్లాక కామేశ్వరమ్మ వరండాలో లైటార్పి గ్రిల్ డోర్ మూసుకుని వెళ్లిపో యింది.

ఆ మర్నాటి నుంచీ సుమతి కూడా సాయంకాలం పూటే ముగ్గు పెట్టడం మొదలుపెట్టింది.

అలాగే పదిరోజులు గడిచాయి.

ఓ రోజు సుమతి కొంచెం పెద్ద ముగ్గు వేసింది. సాయంత్రం ఆరున్నర దాటు తోంది. అప్పుడే చీకటి పడుతోంది. వీధి లైటు ఉండడం వలన ఆ వెలుగులో ముగ్గు స్పష్టంగా కనిపిస్తోంది.

అప్పుడే అరుంధతి ముగ్గుబుట్టతో బైటకి వచ్చింది. అప్పటికే ఊడ్చి నీళ్లు చల్లిన ట్టుంది.

ఆమె రాగానే సుమతి వెనక్కి తిరిగి చూసి పల కరింపుగా నవ్వింది.

అరుంధతి నవ్వీ నవ్వనట్టు నవ్వి వెనక్కి తిరిగి



చూసింది.

సుమతి కళ్లు కూడా గ్రిల్ డోర్ వైపు వెళ్లాయి. ఇంకా కామేశ్వరమ్మ అక్కడికి రాలేదు.

"బాగున్నావా? " అని అడిగింది సుమతి.

'బాగున్నా' అన్నట్టు తల ఊపింది.

సుమతి అలా వంగి కొంచెం ఆమె దగ్గరగా నడిచి "నీకేమన్నా ఇబ్బందిగా ఉందా ఆ ఇంట్లో? " అని అడిగింది.

అరుంధతి కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. తల వంచుకుంది.

"చూడు, మళ్లీ ఆవిడ బైటకి వస్తుందేమో.. చిన్నమాట చెప్తాను. నీకెప్పుడు ఏం కావాలన్నా మా ఇంటికి రా. నీకే సాయం కావాలన్నా చేస్తాం. సరేనా? " అంది సుమతి.

అరుంధతి కళ్లనుంచి బొటబొటా నీళ్లు కారాయి.

"నాకు తెలుసమ్మా.. నాకంతా తెలుసు. బాధపడకు. అదిగో ఆవిడ వస్తోంది. నేను వెళ్తున్నాను. నీకేం కావాలన్నా వచ్చెయ్"

సుమతి అలా వంగునే తన గుమ్మం దగ్గరకు వచ్చి ముగ్గు పూర్తి చేసి లేచింది.

అరుంధతి వంగి చుక్కలు పెడుతోంది.

సుమతి లోపలికి వచ్చేసింది.

గ్రిల్ డోర్ దగ్గరకు వచ్చిన కామేశ్వరమ్మ చూపులు సుమతి ఇంటి కిటికీ వైపు మళ్లాయి. ఆ కిటికీలోంచి గోపి అరుంధతినే చూస్తున్నాడు.

నిజానికి అతను చాలా కాకతాళీయంగానే కిటికీలోంచి బైటికి చూస్తుంటే సుమతి అరుంధతితో మాట్లాడటం కనిపించింది. 'అమ్మ ఏం మాట్లాడుతోందో, ఆ అమ్మాయి ఏం చెబుతోందో' అన్నట్టు కొంచెం ఆసక్తిగా అలా చూస్తూ నిలబడ్డాడు. సుమతి లోపలికి వస్తున్నా గోపి మాత్రం వంగి ముగ్గేస్తున్న అరుంధతి పెద్దజడ నేలమీద ఆనుతోంటే ఎంత పెద్ద జడ అని విస్తుబోయి చూస్తున్నాడు. ఆ



దృశ్యం కామేశ్వరమ్మ దృష్టిలో పడింది. ఆవిడ మండిపడుతూ విసవిసా గ్రిల్ డోర్ విసురుగా తోసి, గేటు బైటకి వస్తోంది.

అది గమనించని గోపి మాత్రం తల్లి లోపలికి వచ్చి తలుపేస్తుంటే వెనక్కి తిరిగి చూశాడు. కిటికీ దగ్గర్నించి కదిలి, గబగబా ఆవిడ దగ్గరకు వెళ్లి "ఏం మాట్లా డావమ్మా? " అని అడిగాడు.

అయితే తను బైటకి రావడంతో గోపి భయపడి లోపలికి వెళ్లాడని భావించిన కామేశ్వరమ్మ చుక్కలు పెట్టడం పూర్తి చేసి, మెలికలతో చుక్కల్ని కలుపుతున్న కోడల్ని కసిరింది "ఎంతసేపా ముగ్గే యడం? త్వరగా లోపలికి చావు"

ఆవిడలా హఠాత్తుగా ఎందుకు విరుచు కుపడిందో అర్థంకాని అరుంధతి గబగబా అడ్డదిడ్డంగా చుక్కలు కలిపేసి లోపలికి పరిగెత్తింది

ఆ మర్నాటినుంచీ వాళ్ల వాకిట్లో ముగ్గు కనిపించలేదు సుమతికి. తను మాట్లాడ్డం చూసినట్టుందావిడ అనుకుంది.

మళ్లీ ఆ అమ్మాయిని ఎలా కలవాలో అర్థం కాలేదావిడకి. ఉన్న ఒకే ఒక్క అవ కాశం చేయిజారింది.

ధనుర్మాసం అయిపోయింది. సంక్రాంతి పండగ వెళ్ళిపోయింది.

ఆ తరువాత శివరాత్రి కూడా వెళ్లిపో యింది.

అరుంధతి మళ్లీ ఎవరి కంటా పడలేదు.

★ ★ ★

వేసంకాలం మొదలైంది.

సుమతి అత్తగారికి మావిడితోటలు ఉన్నాయి. ప్రతి ఏడాదీ ఊరగాయలక్కా వాల్సిన మావిడికాయలు, పళ్లు కూడా అక్కడి నుంచి వస్తాయి.

అత్తగారు పంపించిన మావిడికాయలతో ఆవకాయ, మాగాయ, బెల్లపావకాయ పెట్టింది సుమతి.

అవి జాడీల్లో వేస్తుంటే చటుక్కున వచ్చిందొక ఆలోచన.

వెంటనే రెండు ప్లాస్టిక్ డబ్బాలు శుభ్రంగా కడిగి, తడి లేకుండా తుడిచి, వాటిల్లో ఆవకాయ, బెల్లపావకాయ పెట్టింది.

ఆ సాయంత్రం ఆ రెండు డబ్బాలు తీసుకుని కామేశ్వరమ్మ ఇంటికి బయల్దే రింది.

అప్పటికే మొగుడూపెళ్లాం వరండాలో కుర్చీలు వేసుకుని కూర్చున్నారు.

గేటు గడియ వేసిలేదు.

తను గేటు లోపలికి వెళ్లగానే ఇద్దరూ మొహాలు మాడ్చుకోడం, వెంటనే తెచ్చిపె ట్టుకున్న నవ్వుతో పలకరించడం గమనిం చింది సుమతి.

"బాగున్నారా! కొత్తావకాయ రుచి చూస్తారని తెచ్చాను" అంటూ తనే చను వుగా లోపలికి వెళ్లి "అమ్మాయ్" అంటూ పిలిచింది.

కామేశ్వరమ్మ కూర్చున్న చోటునుంచి లేచి "ఇలా ఇవ్వండి. నేను పెడతాను లోపల" అంటూ సుమతి చేతుల్లోంచి డబ్బాలందుకుంది.

"అయ్యో మీరెందుకు లేచారండి? చిన్న పిల్ల, మీ మేనకోడలుంది కదా" అంటూ చుట్టూ చూసింది సుమతి.

వంటగదిలో చీరచెంగు నెత్తిన కప్పుకున్న ఒక స్త్రీ వీపు కనిపించింది.

"అమ్మాయ్ లేదులెండి. రండి ఇలా కూర్చుందాం" అంటూ ఆవిడ వరండాలోకి దారి తీస్తుంటే సుమతికి్కూడా తప్పలేదు.

"అప్పుడే ఆవకాయలు పెట్టేశారా? " అడిగాడు సుందరయ్య.

ఎన్నడూ ఇలా ఇవ్వని సుమతి కొత్తగా ఆవకాయ తీసుకురావడంతో ఆంతర్యం ఆలోచిస్తోంది కామేశ్వరమ్మ.

"అవునండి.. మా అత్తగారు బోలెడు మావిడికాయలు పంపించారు. మాకు తోటలున్నాయి కదా" అంది సుమతి.

"ఓహో.." అని ఊరుకున్నాడు.

ఇద్దరూ సరిగా మాట్లాడకపోవడంతో సుమతికి చాలా ఇబ్బందిగా అనిపించింది. కాస్సేపు మౌనంగా కూర్చుని తలతిప్పి లోపలికి చూసింది.

వంటగది తలుపు అవతల ఎవరో నుంచుని తననే చూస్తున్నట్టు అనిపించింది.

పరీక్షగా చూద్దామంటే కామేశ్వరమ్మ తననే గమనించడం ఇబ్బందిగా ఉంది.

తలవంచుకుని వేళ్లు చూసుకుంటూ కొద్దిగా కనురెప్పలెత్తింది.

రెండుచేతులూ జోడించి కన్నీళ్లతో అస్పష్టంగా కనిపించింది. ఇంతకుముందు నెత్తిన కొంగు కప్పుకున్న స్త్రీ పొట్ట ఎత్తుగా ఉన్నా, చిక్కి శల్యం అయినట్టు కనిపిస్తోంది.

సుమతి అదిరిపడింది. ఆమె అరుంధతి. అందమైన తలకట్టు స్థానంలో బోడి గుండు, జీవంలేని చూపులు, పొట్ట.. అంటే, అంటే ఈ పిల్ల గర్భవతా? హే భగవాన్!

భూకంపం వచ్చి కాళ్లకింద భూమి కదిలిపోతున్నట్టు అనిపించసాగింది సుమతికి.

"అయ్యో.. అరుంధతీ!" ఆవిడ పెదాలు వణికిపోతున్నాయి. ఒక్క క్షణం కూడా అక్కడ కూర్చోలేకపోయింది.

"వెళ్తానండీ" అంటూ వాళ్ల సమాధానం కోసం చూడకుండా వడివడిగా లేచి వచ్చేసింది.

వస్తూనే కుర్చీలో వాలిపోయి తలపట్టుకున్న తల్లివైపు చూస్తూ "ఏమైందమ్మా.. అట్లా ఉన్నావేంటి? " అడిగాడు గోపి.

అప్పుడే ఆఫీసు నుంచి వచ్చిన విశ్వనాథం కూడా జీవంలేని కళ్ళతో అచేతనంగా కూర్చున్న భార్యని చూస్తూ "ఏమైంది సుమతీ? " అన్నాడు కంగారుగా.

సుమతికి దుఃఖం ఆగలేదు. వెక్కివెక్కి ఏడవసాగింది.

"అరెరే.. ఏమైంది? " భార్యని దగ్గరకు తీసుకుని, కొడుకువైపు చూస్తూ అడిగాడు "ఏం జరిగిందిరా? "

"తెలియదు నాన్నా.. ఎదురింటికి వెళ్లొచ్చింది అమ్మ. రాగానే ఇలా.." అన్నాడు గోపి.

సుమతి వెక్కివెక్కి ఏడుస్తూ అంది "పాపం! ఆ పిల్లకి గుండు చేయించారండి దుర్మార్గులు"

"ఎవరికి? " నిర్ఘాంతపోతూ అడిగాడు విశ్వనాథం.

"అరుంధతికి.. తాచుపాములాంటి జడ.. ఎంత అందమైన జడ! వాళ్ళు నాశనం గానూ. ఆ పిల్లని ఏం చేస్తారో ఏంటో? కొడుకు బతికుండగానే దాన్ని బోడిదాన్ని చేశారు. పైగా, ఆ పిల్ల గర్భవతి"

"రామచంద్రా! ఎంతపని జరిగింది.. ఎందుకు? ఎందుకు బోడిగుండు చేసింది? "

"ఏమో.. అనుమానంతోటో, అసూయతోటో? ఎందుకు చేసి చచ్చిందో ఆ కామేశ్వరమ్మ.. దాని మొహం తగలెయ్య" శాపనార్థాలు పెట్టసాగింది సుమతి.

“ఎంత అన్యాయం నాన్నా! మనం పోలీస్ రిపోర్ట్ ఇద్దాం నాన్నా” ఆవేశంగా అన్నాడు గోపి.

“తొందరపడకురా.. అయినా నీకెందుకీ విషయాలు? వెళ్లి చదువుకో” విశ్వనాథం మందలించాడు కొడుకుని.

“అదేంటి నాన్నా.. ఎందుకేంటి? మన కళ్లముందు ఇలాంటి దారుణాలు జరుగుతుంటే ఎలా సహించి ఊరుకుంటాం? ఆ అమ్మాయిని కాపాడుదాం నాన్నా” బాధగా అన్నాడు గోపి.

“ఏం చేస్తాంరా.. ఏం చేయగలం? ” నిస్సహాయంగా అన్నాడు విశ్వనాథం.

“నేనింక ఆ కొంపకి వెళ్లనండి. మీరు అన్నారని ఆవిడ మొహం మాడ్చినా ఫర్లేదని వెళ్లాను కానీ, నేను వెళ్లినందుకే ఆవిడ ఆ పిల్లనలా ఇంకాఇంకా చిత్రహింసలు పెడుతోందనిపిస్తోంది. వద్దండి.. మనమేం చేయద్దు. ఎవరి కర్మ ఎలా ఉంటే అలా జరుగుతుంది” వెక్కుతూనే అంది సుమతి.

“సరేలే, వెళ్లు.. మొహం కడుక్కుని రిలాక్స్ అవు” అంటూ భార్యని బలవంతంగా వాష్‌బేసిన్ దగ్గరకు పంపించి తను ఫ్రెషప్ అవడానికి వెళ్లిపోయాడు విశ్వనాథం.

కానీ గోపి మాత్రం నుంచున్న చోటే ఉండిపోయాడు. అతని రక్తం మరిగిపోతోంది.

‘గుండు చేయించారా? పాపం! ఎంత రాక్షసులు వాళ్ళు? చేసిన ద్రోహం చాలక ఆమెని కురూపిని చేస్తున్నారా? చూసేవాళ్లకి ఆమె అందంగా కనిపించకూడదనా? ఇలా సాగనివ్వకూడదు. ఆ అమ్మాయిని ఎలాగైనా కాపాడాలి.. ఎలా? ఎలా? ’ గోపికి ఆ రాత్రి చదువుమీద ఏకాగ్రత కుదరలేదు. కంటికి కునుకు రాలేదు. ఆ నిశ్శ

బ్దంలో మళ్లీ అతనికి అవే ఆర్తనాదాలు.. గుండెలవిసిపోయేలా, నరాలు తెగిపోయేలా.

ఆ సంఘటన జరిగిన ఐదు నెలలకి ఆ ఇంట్లోంచి ఓ పాపాయి ఏడుపును విన్నాడు గోపి.

"అమ్మా.. వాళ్లింట్లో పాపాయి పుట్టింది" అన్నాడు.

సుమతి నిర్లిప్తంగా అంది "అవును.. పుట్టింది"

"అదేంటమ్మా? కనీసం పాపకి బారసాల అనీ ఏవో చేస్తారుగా? దానికన్నా ఎవర్నీ ఇంటికి పిలవరా వాళ్లు? పాపని చూపించరా? "

"వాళ్లు సంఘజీవులు కాదురా.. వాళ్లకి సంఘంతో పనిలేదు. వాళ్లు బతుకుతున్నారు అంతే, ఎందుకు బతుకుతున్నారో వాళ్లకే తెలియదు" కసిగా అంది.

"కనీసం ఆ పాపనైనా సరిగా చూసుకుంటారంటావా అమ్మా? "

"చూసుకోకపోతే చంపుకోనీరా.. నీకెందుకు? నీ చదువు సంగతి చూసుకో. అన్నయ్య వస్తాడు. వాడితో కలిసి వైజాగ్ వెళ్ళు.. నీక్కూడా వాడి కాలేజీలోనే సీటిప్పిస్తానన్నాడు"

"అన్నయ్య చెబితే ఇస్తారామ్మా? నాకు ఎంసెట్‌లో వచ్చే ర్యాంకునిబట్టి ఇస్తారు కానీ.. అయినా నాకు తప్పకుండా వస్తుందిలే. డోంట్ వర్రీ. నీ కొడుకులిద్దరూ ఇంజనీర్లే"

ఆవిడ కొడుకుతల మీద చేయిపెట్టి దీవిస్తూ "చల్లగా బతకండి నాయనా.. ఆ భగవంతుడు తెలివితేటలతోపాటు మంచి మనసు కూడా ఇచ్చాడు మీకు. మీ భార్యల్ని మాత్రం మనుషులుగా గుర్తించి గౌరవించండి" అంది.

మరో నెలరోజులు గడిచాయి. సుమతి ఇంక అరుంధతి సంగతి మర్చిపోయింది. ఎప్పుడన్నా గుర్తొస్తే మనసు ఆర్ద్రమైపోతోంది.

గోపీకి గీతమ్ కాలేజీలో సీటొచ్చింది. ఈ మధ్యలో పెద్దవాడు ప్రసాద్ వచ్చాడు. వాడి ఎదురుగా అరుంధతి విషయం ఎవరూ మాట్లాడలేదు. ఏ మాత్రం తెలిసినా ఆవేశపడి పోలీస్ రిపోర్టు కూడా ఇస్తాడు. గోపీకన్నా ఎక్కువ ఆవేశం, ఆదర్శాలు ఉన్నవాడు ప్రసాద్. చదువుకుంటున్న పిల్లాడిని అనవసర విషయాల్లో ఇన్‌వాల్వ్ చేయడం విశ్వనాథానికి, సుమతిక్కూడా ఇష్టం లేదు.

అందుకే అతను ఉన్న నాలుగురోజులూ సినిమాలకనీ, హోటల్స్‌కనీ తీసికెళ్లి సరదాగా గడిపేశారు.

"నువ్వు కావాల్సినవన్నీ కొనుక్కుని రారా" అన్నాడు గోపితో ప్రసాద్ తను బయల్దేరి వెళుతూ.

"ఏం.. వైజాగ్‌లో ఏమీ దొరకవా? " అడిగాడు గోపి.

"దొరికితే.. రాగానే షాపింగ్‌లని తిరుగుతావా? " సీరియస్‌గా అన్నాడు ప్రసాద్.

"అలా అని కాదు. కానీ అడుగుతున్నాను" సణిగాడు గోపి.

"అన్నీ ఉంటాయి. కానీ, టైం ఉండదు. సరేనా? కాలేజీ, చదువు.. ఇంతే అక్కడ. అర్థమైందా? " అని నవ్వి "వస్తానమ్మా.. బై నాన్నగారూ.. బైరా గోపి" అంటూ బయల్దేరి వెళ్లాడు ప్రసాద్.

ప్రసాద్ వెళ్లాక గోపి తన గదిలోకి వెళ్లిపోయాడు.

సుమతి వంటగది సర్దుకోడానికి వెళ్లింది.

విశ్వనాథం హాల్లో టీవీ ఆన్‌చేసి, చూస్తూ కూర్చున్నాడు.

సుమతి కూడా వంటగదిలో పని పూర్తి చేసుకుని "గోపీ త్వరగా పడుకో" అంటూ హెచ్చరించి భర్త పక్కన కూర్చుని టీవీ

చూడసాగింది.
అప్పుడు సమయం రాత్రి పదిన్నర.
"టక్ టక్.." తలుపు చప్పుడైంది.
"ఏవండీ.. టీవీ సౌండ్ తగ్గించండి.. తలుపు చప్పుడవుతోంది" అంది సుమతి అనుమానంగా తలుపువైపు చూస్తూ.
విశ్వనాథం రిమోట్ తీసుకుని వాల్యూమ్ తగ్గించాడు.
"టక్ టక్.." మళ్లీ తలుపు చప్పుడు.
సుమతి లేచి వెళ్లి తలుపు తీసింది.
రయ్యిన ఆవిడ్ని తోసుకుంటూ వచ్చిందో యువతి.
"ఎవరూ? " సుమతి ఆశ్చర్యంగా చూస్తుంటే "ప్లీజ్ డోర్ వేసేయండి" అందా యువతి.
సుమతి డోరు వేసేసి ఆమె దగ్గరగా నడిచింది.
ఆమె సుమతిని గట్టిగా వాటేసుకుని బావురుమంది.
"ఎవరూ? " సుమతి ఆమె భుజం పట్టుకుని జరుపుతూ మొహంవైపు చూసి స్థాణువైంది. "నువ్వా? " అంది.
"ఆంటీ.. ప్లీజ్.. నన్ను కాపాడండి" ఏడుస్తూ సుమతి కాళ్లమీద పడిపోయింది అరుంధతి.
"లేమ్మా.. రా లోపలికి" ఆ అమ్మాయి జబ్బ పట్టుకుని లోపలికి లాక్కెళుతూ భర్తతో అంది "ఏవండీ.. టీవీ ఆఫ్ చేసి రండి"
విశ్వనాథం గబుక్కున టీవీ ఆఫ్ చేసి వచ్చాడు.
"ఇలా కూర్చో" అంటూ అరుంధతిని బలవంతంగా మంచం మీద కూర్చోబెట్టి, ఆమె పక్కన కూర్చుని చీరచెంగుతో కన్నీళ్లు తుడుస్తూ అడిగింది "చెప్పు. ఏమైంది? ఎలా వచ్చావు ఇప్పుడు? "
అరుంధతి వెక్కుతూ చెప్పింది.
ఆ రోజు గోపి కిటికీలోంచి ముగ్గు వేస్తున్న అరుంధతిని చూడడం గమనించిన కామేశ్వరమ్మ ముగ్గు పూర్తి చేసి లోపలికి వెళ్లిన అరుంధతిని వెనక నుంచి జడ పట్టుకుని కత్తెర తీసుకుని జడ కత్తిరించేసింది.
అనుకోని ఆ సంఘటనకి బిత్తరపోయిన అరుంధతి కెవ్వుమని అరిచింది. "జడ.. నా జడ ఎందుకు కట్ చేశారు? "
"నీకు ఇంత జడ అవసరమా? తగుదునమ్మా అని ఆ జడ చూపించుకుంటూ వీధివాకిట్లో ముగ్గుపేరుతో పరాయిమగాడిని ఆకర్షిస్తున్నావా? చంపేస్తాను. జడ కాదు కదా. జుట్టు కూడా ఉండనివ్వను" అంటూ కత్తెరతో మీదికొస్తున్న ఆవిడని తప్పించుకుని వంటగదిలోకి పారిపోయింది అరుంధతి. ఆవిడ అరుంధతిని వెంటపడి, తరిమితరిమి దొరకబుచ్చుకుని రెండుచేతుల్తో బంధిస్తే, వెనక నుంచి సుందరయ్య కత్తి తీసుకుని జుట్టు తీసేశాడు.
హృదయవిదారకంగా ఏడుస్తున్న అరుంధతిని గదిలో పెట్టి బైట గొళ్లెం పెట్టారు. వాళ్లెందుకంత పైశాచికంగా ప్రవర్తిస్తున్నారో అర్థంకాని అరుంధతి ఆక్రోశించింది. "నేనేం తప్పు చేశాను? నాకెందుకీ శిక్ష? చెప్పండి.. నేనేం తప్పు చేశాను? " అని అరుస్తున్న అరుంధతి నోట్లో గుడ్డలు కుక్కి గది తాళం వేశారు. ఇరవైనాలుగు గంటలపాటు ఆ గదిలో కుళ్లికుళ్లి ఏడుస్తూ శోషొచ్చి పడిపోయిన అరుంధతిని బైటకి ఈడ్చుకొచ్చి ఇంకోసారి గేటు బైటకి వెళ్లనని చెప్పించి వదిలేశారు.
ఆ తరువాత ఆమెకి బతుకు మరింత నరకం అయింది. అప్పటికే ఆమె గర్భం దాల్చడంతో సరైన తిండిలేక నీరసం, వాంతులు. డాక్టర్ దగ్గరకు తీసికెళ్లేవాళ్లు లేక దాదాపు జీవచ్ఛవం అయింది. కానీ, అలాగే ఇంటెడు చాకిరీ చేస్తూ వాళ్లు తిన్నాక మిగిలిన తిండి తింటూ, మొగుడి రాక్షస క్రీడకి బలి అవుతూ గడుపుతూనే

ఆడపిల్లకి జన్మనిచ్చింది.

ఆ పిల్ల పుట్టిన దగ్గర్నించీ ఆమెకి హింస మరీ ఎక్కువైంది. కారణం పిల్ల బంగారు బొమ్మలా పుట్టడం.

"నా కొడుకు వెర్రివాడు. ఈ పిల్ల వాడికి పుట్టింది కాదు. నువ్వెవరితో కులికావు? మా కళ్లు కప్పి ఎవడితో తిరిగావు?" అంటూ కొట్టడాలు, వాతలు పెట్టడాలు.. ఆఖరికి ఇవాళ మొహం మీద కత్తితో గాట్లు పెట్టి కురూపిని చేయడానికి వాళ్లు పథకం వేయడం విన్న అరుంధతి పెరటి గోడ దూకి పారిపోయి వచ్చింది.

ఆమె ఒంటిమీద కనిపిస్తున్న గాయాలు, పెదవి చిట్లి కారుతున్న రక్తం ఆమె చెప్పేదేదీ అబద్ధం కాదని తెలియచేస్తుంటే సుమతి, విశ్వనాథంతో పాటు అక్కడికి వచ్చి ఆమె మాటలన్నీ విన్న గోపి కూడా నిశ్చేష్టుడైపోయాడు.

ఎంత దారుణం.. ఎంత పైశాచికత్వం.. వాళ్లు అన్నమేనా తింటున్నారు?

"పాపేదీ?" ఉలిక్కిపడుతూ అడిగింది సుమతి.

"పాపని నాకివ్వరు.. వాళ్లదగ్గరే పడుకోబెట్టుకుంటారు"

"అంటే పడుకుందా పాప?"

"అవును.. కానీ ఆంటీ.. నేనింక అక్కడికి వెళ్లను. మీ కాళ్లు పట్టుకుంటాను, నన్ను ఎలాగైనా కాపాడండి. మాది పొన్నూరు. నన్ను మా ఊరికి పంపించండి, మీ మేలు మర్చిపోను. అంకుల్.. నావల్ల కాదు. నేనింక ఈ నరకంలో ఉండలేను. నేనెప్పుడూ ఏ తప్పూ చేయలేదు. నాకెందుకీ శిక్ష వేశారో నాకు తెలియడం లేదు. అసలు వాళ్లెవరో, ఇంత దూరం నుంచి వచ్చి నన్నెందుకు వాళ్ల కొడుక్కి పెళ్లిచేసుకుని బలి తీసుకుంటున్నారో అర్థం కావడం లేదు. అసలు వాళ్లు ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో కూడా నాకు కారణం తెలియడం లేదు"

వెక్కివెక్కి ఏడుస్తూ అంటోన్న అరుంధతిని దగ్గరకు తీసుకుని గాద్గదికమైన స్వరంతో ఓదారుస్తూ అంది సుమతి "ఏడవకమ్మా.. తప్పకుండా నిన్ను కాపాడతాం. ఈ అవకాశం కోసమే చూస్తున్నాం. వాళ్లు శాడిస్టులు.. సైకోలు.. ఇంక నీ కష్టాలు గట్టెక్కాయనుకో.. లే.. మొహం కడుక్కో. కొంచెం అన్నం పెరుగేసుకుని తిని పడుకో. రేపు ఉదయం ఆలోచిద్దాం ఏం చేయాలో"

"ఉదయమా? అమ్మో! వాళ్లకి ముందు మీ మీదే వస్తుంది అనుమానం. మీరంటేనే ఆవిడకి కోపం. తప్పకుండా నా కోసం వెతుకుతూ ఇక్కడికే వస్తారు"

"నిజమే.. ఏం చేద్దాం?" భర్తవైపు చూసింది సుమతి.

"అమ్మా.. నాతో వైజాగ్ తీసికెళ్లిపోతాను" చటుక్కున అన్నాడు గోపి.

"నీతోటా? వైజాగా?" ఆశ్చర్యంగా చూసింది సుమతి.

"అవునమ్మా.. అక్కడి నుంచి ఆవిడని వాళ్ల ఊరికి పంపిస్తాం అన్నయ్యా, నేనూ కలిసి. ముందు ఆవిడ ఇక్కడి నుంచి వెళ్లిపోవాలి. లేకపోతే వాళ్లు మళ్లీ ఇంటికి తీసికెళ్లిపోతారు"

విశ్వనాథానికి గోపి మాటలు బాగానే అనిపించాయి. ఏమాత్రం ఆలస్యం అయినా వాళ్లు వచ్చి ఇక్కడ రభస చేయడం మాత్రం నిజం. మళ్లీ శరణు కోరి వచ్చిన అమ్మాయిని అక్కడికి పంపడం న్యాయంకాదు. అలా అని ఎక్కడ దాచాలి? అయితే, రేపు సాయంత్రం గోపి ట్రెయిన్. అందాకా ఎక్కడుంటుంది? ఆలోచిస్తూన్న విశ్వనాథంతో ఆయన ఆలోచనలు గమనించినవాడిలా అన్నాడు గోపి "నాన్నా.. ఇప్పుడు ఆవిడని నా ఫ్రెండ్ ఆర్తి వాళ్లింటికి తీసి

కెళ్లి అక్కడ ఉంచుదాం. రేపు తను కూడా వస్తోందికదా నాతో. ఇద్దరూ కలిసి స్టేషన్‌కి వస్తారు"

"గుడ్ ఐడియా.. పద" విశ్వనాథం చటుక్కున లేచాడు. "సుమతి నువ్వు కూడా రా. ఆ అమ్మాయిని తీసుకుని మీ ఇద్దరూ వెనక నుంచి రైల్వేట్రాక్ దగ్గరకు రండి. నేనూ, గోపి అక్కడ ఆటో మాట్లాడి వెయిట్ చేస్తూంటాం" అన్నాడు.

"అంకుల్.. పాప? నా పాప కావాలి నాకు" ఏడుస్తూనే అంది అరుంధతి.

"అవునండి.. పాపం ఆ పసిదాన్ని వదిలి ఎక్కడికి వెళుతుంది? " అంది సుమతి.

"సుమతీ! పాప సంగతి తరవాత చూద్దాం. ముందు ఈ అమ్మాయిని పంపిద్దాం. ఏమ్మా.. నీకు పాప కోసం మళ్లీ అక్కడికి వెళ్లే ధైర్యం ఉందా? " అడిగాడు విశ్వనాథం.

"లేదు. అక్కడికి వెళ్లలేను. కానీ, అంకుల్.. నాకు పాప కావాలి" అంది అరుంధతి.

సుమతి నచ్చచెబుతున్నట్లుగా అంది "భయపడకు అరుంధతీ! పాపని వాళ్లేం చేయరు. ముందు నువ్వు వెళ్లు, తరవాత నీ పాప నీ దగ్గరకు వస్తుంది. నా మాట విను"

అరుంధతి కన్నీళ్లు తుడుచుకుంటూ మౌనంగా తలూపింది.

ఆ రాత్రి చీకట్లో అరుంధతిని తీసుకుని రైలు పట్టాల దగ్గర ఆటో మాట్లాడి గోపి స్నేహితురాలైన ఆర్తి దగ్గర దింపి వచ్చాక కామేశ్వరమ్మ ఇంట్లో లైట్లు వెలుగుతుండడం, ఆవిడా, ఆయనా వాకిట్లోకి, ఇంట్లోకి తిరగడం గమనించింది సుమతి.

కోడలు ఇంట్లోంచి వెళ్లిపోయింది. ఈ మాట ఎవరితో చెప్పగలరు? ఎలా చెప్పగలరు? అసలా ఇంట్లో అరుంధతి అనే ఒక అభాగ్యురాలు ఉందన్న విషయం ఎవరికైనా చెబితే కదా. అందుకే కుక్కిన పేనుల్లా వాళ్లల్లో వాళ్లే పీక్కుంటున్నారు.

"చావనీ.." కసిగా నవ్వుకుంది సుమతి.

★ ★ ★

చేతిలో నోటు పుస్తకం జారిపోయింది.

ప్రియంవద కళ్లు వర్షిస్తున్నాయి. ఆమె కన్నీళ్లతో తలగడ తడిసిపోయింది.

'అమ్మా.. అమ్మా..' బాధగా అనుకుంది.

'ఎన్ని కష్టాలు పడ్డావమ్మా? ఇలాంటి రాక్షసుల నుంచి ఇప్పుడు మనం ఏం ఆశించగలం? కోల్పోయిన ప్రేమానురాగాలనా? కోల్పోయిన నీ నూరేళ్ల జీవితాన్నా? ఎందుకమ్మా నేనిక్కడ? వీళ్ల ఇంట్లో, వీళ్ల నీడన ఉండేకన్నా అడవిలో క్రూరమృగాల మధ్య బతకలేనంటావా? '

ప్రియంవదకి అక్కడి నుంచి వెంటనే పారిపోవాలనిపించింది.

వాళ్లని చూడాలన్నా, ఆ ఇంట్లో ఉండాలన్నా ఇప్పుడు భయం వేస్తోంది. తనని వాళ్లేదో చేస్తారనే భయంకన్నా అలాంటి మనుషుల పంచన ఉండాలంటేనే ఆమెకు అసహ్యం కలుగసాగింది.

నెమ్మదిగా మంచం మీంచి లేచి కూర్చుంది.

కిటికీ తెరిచి బైటకి చూసింది.

మొదటిసారిగా ఆ ఇంటి బైట లైటు వెలుగుతోంది. కాంపౌండ్‌వాల్ మీంచి ఎదురిల్లు కనిపిస్తోంది. అందరూ పడుకున్నట్టున్నారు. అదేనా సుమతి ఇల్లు? ఆ ఇంట్లో దేవతలు తిరుగుతున్నట్టు ఎంత ప్రశాంతంగా ఉంది. ఈ ఇంట్లో పిశాచాలు నాట్యం చేస్తున్నట్టు భయంభయంగా అశాంతిగా ఉంది.

ఇంతకీ పాపని అరుంధతికి ఎవరు అప్పగించారు? ఎలా అప్పగించారు?

ప్రియంవద డైరీ తిరగేసింది..

అక్కడితో ఆగిపోయిందా కథ. అంకుల్ ఎందుకు పూర్తిచేయలేదు?

వెంటనే ల్యాప్‌టాప్ ఓపెన్ చేసి, గోపాల్‌కి మెయిల్ చేసింది.

"అంకుల్.. అరుంధతి కథ చదివాను. ఆవిడని కష్టాల సముద్రంలో వదిలేశారు. పాప ఆవిడని ఎలా చేరిందో తెలుసుకోవాలని ఉంది. ప్లీజ్.. ఆ తర్వాతేం జరిగిందో కంటిన్యూ చేయండి. ముగింపు నేను చేస్తాను. కానీ, ఇది చదివాక ఆ దుర్మార్గులతో కలిసి ఇక్కడ ఉండడం నరకప్రాయంగా అనిపిస్తోంది. నటనే కానీ, వాళ్లని ప్రేమించే నటన నేను చేయలేకపోతున్నాను. తప్పదంటారా? "

మెయిల్ పంపించి మంచం మీద వాలి నిద్రపోడానికి ప్రయత్నిస్తూ కళ్లు మూసుకుంది.

మర్నాడు ఆ ఇద్దర్నీ చూస్తుంటే మానవ రూపంలో తిరుగుతున్న రాక్షసుల్లా అనిపించారు ప్రియంవదకి. వాళ్లతో మాట్లాడాలన్నా, వాళ్లకి వండిపెట్టాలన్నా అసహ్యం కలగసాగింది. ఒక మనిషిని టార్చర్ పెట్టడం అంటే ఏంటో వీళ్లకి ప్రాక్టికల్‌గా తెలిసేదెలా? ఆలోచిస్తూనే ఆరోజు అన్యమనస్కంగా ఆఫీసుకెళ్లింది.

మెయిల్‌బాక్స్‌లో గోపాల్ రిప్లై.

"ప్రియా! ముఖ్యంగా చెప్తున్నాను.. వాళ్లని ద్వేషించకు. ద్వేషిస్తే నా ఆశయం నెరవేరదు. ఇకపోతే పాపని ఎలా అప్పగించారు? ఎవరు అప్పగించారు? అదంతా మరో మెయిల్‌లో చెప్తాను. ఈ పాటికి గోపి ఎవరో, అరుంధతి ఎవరో నీకు అర్థమై ఉంటుంది. కాబట్టి నువ్వు ప్రస్తుతం ఉన్న ఇల్లు నీది. నీ ఇంటిని కొన్ని దుష్టశక్తులు కాపలా కాస్తున్నాయి. వాటిని తరిమికొడతావో, నీ వశం చేసుకుని, నీ ఇంటిని నువ్వు సాధించుకుంటావో ఆలోచించుకో. మీ అమ్మని వాళ్లు పెట్టిన చిత్రహింసలు, ఆ పవిత్రమూర్తి గురించి కూసిన పాడుకూతలు నిజం కాదని వాళ్లకి తెలియాలి. వాళ్లు చేసిన దారుణాలకి పశ్చాత్తాపపడాలి. అర్థమైందనుకుంటా"

నీళ్లు నిండిన కళ్లకి అక్షరాలు మసగ్గా కనిపించాయి.

'తప్పకుండా అంకుల్.. మీకోసం, మా అమ్మ కోసమైనా నేను సాధిస్తాను' అనుకుంది దృఢ నిశ్చయంతో.

★ ★ ★

కొంతకాలం గడిచింది.

ఈ మధ్యలో ప్రియంవద ఒక శనివారం రెంటల్ కారు తెప్పించి వాళ్లిద్దరినీ బలవంతంగా మెడికల్ చెకప్‌కి హాస్పిటల్‌కి తీసికెళ్లింది. ఏదో తింటూ, టీవీ చూస్తూ, నిద్రపోవడం తప్ప దాదాపు ఇరవైఏళ్ల నుంచి ఒక డాక్టర్ దగ్గరకు వెళ్లిన గుర్తులేదు కామేశ్వరమ్మకి. జలుబు



అమ్మాయి.. తమ మీద ఇంత శ్రద్ధ చూపించడం, ఇంత అభిమానం చూపించడం.. ఆవిడకి వింతగానూ, ఆశ్చర్యంగాను, మరో పక్క ఏదో అనుమానంగానూ ఉంది.

ఎవరీ అమ్మాయి? ఎందుకు ఇంత అభిమానం చూపిస్తోంది? తమ ఇంటి చుట్టుపక్కలకు రావడానికి కూడా భయపడతారు జనం. అలాంటిది ఎందుకొచ్చింది? ఈమె చూపిస్తున్న ప్రేమాభిమానాలు నిజమైనవేనా? ఈ ఇంట్లో ఆస్తిపాస్తులేమైనా ఉన్నాయా అంటే తనకి పెళ్లిలో అత్తగారు పెట్టిన కొద్దిపాటి నగలు, ఈ ఇల్లు తప్ప మరేం లేదే. నగలకోసం నాటకం ఆడే మనిషిలా అనిపించడం లేదు. వాటి మీద

చేస్తే శొంఠి కషాయం తాగడం, తలనొప్పి వస్తే అమృతాంజనం రాసుకోడం, అజీర్తి చేసినా, కొద్దిగా జ్వరంగా అనిపించినా లంఖణాలు చేయడం తప్ప ఒక మాత్ర వేసుకున్న గుర్తు కూడా లేదావిడకి. పక్షవాతం వచ్చినా ఆచారిని పిలిపించి ఆయుర్వేద మందులు వేసుకుంటూ మసాజ్‌లు చేయించుకుంటూనే గడిపింది. అలాంటిది ఇప్పుడు ఈ అమ్మాయి, ఎలాంటి బంధుత్వం లేని ఒక అమ్మాయి, నాలుగు రోజులు ఆశ్రయం కోసం వచ్చిన

వ్యామోహం ఉన్న దానిలా కూడా అనిపించడం లేదు. డాక్టర్ ఫీజులు, మందులు, ఇంట్లో కొత్త సామాను అన్నిటికీ తన డబ్బులే ఖర్చు పెడుతోంది. ఎందుకలా అంటే 'నేను మీ దగ్గర ఉంటున్నందుకు, ఈ మాత్రం ఖర్చు పెట్టవచ్చుకదండీ. మీకేం డబ్బులివ్వడం లేదుకదా నేను?' అంది. ఏది ఏమైనా ఈ పిల్ల విషయంలో జాగ్రత్తగా ఉండాలి.




వీలైనంత తొందరగా ఈ పిల్లని పంపించేయాలి.

కామేశ్వరమ్మ ఆలోచిస్తూనే బ్లడ్ టెస్టు, యూరిన్ టెస్టు, ఎక్స్‌రేలు వగైరా చేయించుకుంది.

"పదండి, రిపోర్టు సోమవారం వస్తుంది. నేను ఆఫీసునుంచి వస్తూ తీసుకొస్తాను" అంటూ ఇద్దర్నీ తీసుకుని ఇంటికి వచ్చింది.

వాళ్ళ ఆహారంలో కూడా మరికొన్ని మార్పులొచ్చాయి. వేపుళ్లు, కారాలు, ఉప్పు బాగా తగ్గించి ఉడకబెట్టిన కూరగాయలు, ఆకుకూరలు, పప్పు, పండ్లు అదనంగా వారి ఆహారంలో చేర్చింది ప్రియ. రోజూ సాయంత్రం గౌరిని తీసుకుని కాస్సేపు నడవమంది. కానీ వాళ్లు ఆసక్తి చూపించలేదు. 'మా వల్లకాదు' అంటూ దాటేశారు. బైటకి వెళ్లడానికి వాళ్లు ఏమాత్రం ఇష్టపడకపోవడం గమనించింది.

'చూద్దాం.. మెల్లగా వాళ్లు వాకింగ్‌కి కూడా వెళ్లేలా చేయగలిగితే చాలు. యాభై శాతం తనకి విజయం లభించినట్టే' అనుకుంది ప్రియంవద.

వాళ్ళ మెడికల్ రిపోర్ట్సులో ఇద్దరికీ బి.పి., షుగరు ఉన్నట్టు తేలింది. సుంద రయ్యగారికి గుండెలో కొంచెం ప్రాబ్లెమ్ కూడా ఉంది. మందులు తీసుకొచ్చి ఏ స మయంలో వేసుకోవాలో ఒక తెల్ల కాగితం మీద రాసి, ఆ కాగితాన్ని ఒక కార్డ్‌బోర్డ్ మీద అతికించి, వాళ్లకి కనిపించేలా బల్ల మీద పెట్టింది ప్రియ.

"మీరు వాకింగ్ చేసి తీరాలి తాత గారూ.. తప్పదు, అలవాటు చేసుకోండి" అంది ఆ రాత్రి మందులిస్తూ.

"మందులేసుకుంటున్నాగా.. చాల్లే" అన్నాడు నిర్లక్ష్యంగా.

"మందులు ఒక్కటే చాలదు. బాడీకి ఎక్సర్‌సైజ్ కావాలి. మీరు కూడా నానమ్మా. మీకు వచ్చిన పక్షవాతం బాగానే తగ్గింది. మీరు లేచి కాస్సేపు తిర గాలి. లేకపోతే ఎప్పటికీ నడవలేరు. అంతే కాదు, వాకింగ్‌కి వెళితే మోకాళ్ల నొప్పులు కూడా తగ్గుతాయి" అంది.

"మావల్ల కాదులే అమ్మాయ్.. మమ్మ ల్నిలా వదిలెయ్" అందావిడ.

'ఈ విషయంలో వీళ్లని ఒప్పించాలంటే వీళ్లకి కౌన్సిలింగ్ కావాలి' అని నిట్టూ ర్చింది.

కాకపోతే ప్రియ కోరుకున్న అతి ముఖ్య మైన మార్పు ఒకటి ఇంట్లో వచ్చింది.

ఇప్పుడు ప్రియ ఇంట్లో ఉన్నంతసేపూ ఆ ఇంటి ప్రధానద్వారం తీసే ఉంటుంది. ఆవరణమంతా పరిశుభ్రంగా ఉంటోంది. వాకిట్లో గేటు బైట రోజూ ఉదయాన్నే ముగ్గు ఉంటోంది. దేవుడి గూడు శుభ్రంగా ఉంది. అందులో రోజూ ఉద యాన్నే దీపం వెలుగుతోంది. అగరువ త్తుల పరిమళం పరిసరాలను ఆహ్లాదపరు స్తోంది. వంటగది పరిశుభ్రంగా ఉంది. గిన్నెలు తళతళలాడుతున్నాయి. హాలు, ప్రియకి ఇచ్చిన గది, వంటగది, వసారా, పెరడు అన్నీ బాగుపడ్డాయి. కానీ మిగి లింది ఒక్కటే.. అదే తాళం వేసి ఉంచిన గది. ఆ గది ద్వారానికి అడ్డంగా ఆవిడ మంచం. ఆ గది తలుపులు తీయించడా నికి చాలా కష్టపడాలి. సమయం కోసం ఎదురుచూస్తోంది ప్రియ.

మరి కొంతకాలం గడిచింది.

ఇప్పుడు సుందరయ్య, కామేశ్వరమ్మల ఆరోగ్యంలో చాలా మార్పు వచ్చింది. ఇంతకు ముందుకన్నా ఉత్సాహంగా, కొత్త ఓపిక వచ్చినట్టు అనిపిస్తోంది. ప్రియ ఎ దురుగా అనకపోయినా ఆమెని మనసులో పొగడకుండా ఉండలేకపోయారిద్దరూ.

"ఈ పిల్ల ఏ క్షణాన వచ్చిందో.. మనల్ని కొన్ని విషయాల్లో ఇబ్బంది పెట్టినా మిగతా విషయాల్లో చాలా హాయిగా ఉంటోంది" అంది కామేశ్వరమ్మ భర్తతో.

"అవును.. పిల్ల మంచిదానిలాగే ఉంది. అయినా ఎన్నాళ్లుంటుంది? ఎప్పుడైనా వెళ్లి పోవచ్చు. ఆ తరువాత మళ్లీ మన జీవితం మనదే" అన్నాడాయన.

"కలకాలం ఉండిపోవడానికి మనపిల్ల కాదుగా" అందావిడ.

"మనకి ఒక ఆడపిల్లనైనా ఇచ్చాడు కాదా దేవుడు" అంది మళ్లీ.

"ఆ.. ఇచ్చినవాళ్లని సలక్షణంగా ఇచ్చా డా? ఇహ ఆడపిల్ల ఒకతా? ఆ పిల్లల వల్లనే మన బతుకులు ఇట్లా అయ్యాయి. బొత్తిగా ప్రపంచంతో సంబంధం లేకుండా బతుకుతున్నాం" అన్నాడు సుందరయ్య.

"మన ప్రారబ్ధం. ఇంక జరిగిన విష యాలు గుర్తు చేయకండి" అందావిడ.

ఆయన మౌనంగా ఉండిపోయాడు.

ఆ తరవాత కొన్ని రోజులకు ప్రియకు గోపాల్ నుంచి మళ్లీ ఒక మెయిల్ వచ్చింది. అది చాలా పెద్ద మెయిల్.

అరుంధతి కూడా ఫోన్‌లో మెసేజ్ ఇచ్చింది. 'వాళ్లెలాంటి వాళ్ళయినా పెద్ద

వాళ్లు.. కాబట్టి ఎదిరించి మాట్లాడకు. ప్రేమతోటే ఏదైనా సాధించవచ్చు. ద్వేషించి, అసహ్యించుకుని ఏమీ చేయలేము. ప్రేమగా విషం పెట్టవచ్చు కానీ, ద్వేషంతో అమృతం తాగించలేము. గుర్తుంచుకో. వీలు చూసుకుని పాస్‌పోర్టుకి అప్లై చేయి. పాణి ఎంఎస్ అయిపోయిందిట. త్వరలో ఇండియా వస్తాట్ట. వాళ్ళమ్మగారు చెప్పారు. అతను రాగానే మీ పెళ్లి విషయం మాట్లాడదాం అన్నారు అమ్మమ్మగారు. నీకు మరీ కష్టంగా ఉంటే మాత్రం వచ్చెయ్. ఈ లోపల ఒకసారి అమ్మమ్మగారిని కలుసుకుని పాణి ఈ మెయిల్ తీసుకొని అతనికి మెయిల్ ఇవ్వు. నీకు సిగ్గనిపిస్తే నీ మెయిల్ అమ్మమ్మ గారికిస్తే ఆవిడ పాణికిస్తారు. అతను ఒకసారి నీతో మాట్లాడాలంటున్నాట్ట'

'పాణి వస్తున్నాడా?' ప్రియ చెంపల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చినట్టు అయింది.

'ఏం మాట్లాడతాడు? ఇన్నేళ్లు కలిసున్నపుడు మాట్లాడలేకపోయిన కబుర్లన్నీ ఇప్పుడు చెప్తాడా? ఎన్నోసార్లు అతని నోటినుంచి ఏదైనా తీయటి మాట వినాలని ఎదురుచూసాను. చదువు విషయాలు, సినిమాలు, క్రికెట్ లాంటివి తప్ప ఏనాడూ మరో విషయం మాట్లాడలేదు. ఇప్పుడేం మాట్లాడాలనుకుంటున్నాడో!' ఆమె పెదాలమీద సన్నటి మందహాసం మెరిసింది.

పాణి ప్రియకన్నా రెండున్నరేళ్లు పెద్ద. ఇంజనీరింగ్‌లో ప్రియకి సీనియర్. బి.టెక్ పూర్తిచేసి ఎంఎస్ చేయడానికి స్టేట్స్‌కి వెళ్లాడు. చిన్నప్పటి నుంచీ వాళ్లింట్లోనే ఎక్కువగా గడుపుతుండడం వల్ల అతనితో మంచి స్నేహం ఉంది.

తమ దగ్గర పనిచేసే ఆవిడ కూతురని పరిమళవాళ్లు ఎప్పుడూ తేడా చూపించలేదు. ఎదుగుతున్నకొద్దీ ప్రియ తెలివితేటలు, వినయం, రూపం నచ్చి, పాణికి ప్రియలాంటి పిల్ల భార్యయితే బాగుంటుదన్న అభిప్రాయం వెలిబుచ్చడం అరుంధతిదాకా వచ్చింది. ఆ విషయం గోపాల్‌తో చర్చించింది అరుంధతి. గోపాల్ తన తల్లికి చెప్పాడు. పాణి చదువైపోయి, ఉద్యోగం రాగానే అతని తల్లిదండ్రులతో మాట్లాడతానని చెప్పిందావిడ.

'ఓసారి అమ్మమ్మ గారిని కలవాలి' నిశ్చయించుకుంది ప్రియ.

ప్రియ గోపాల్ మెయిల్ చూసింది.

"ఎలా ఉన్నావు? ఏమంటున్నారు? మీ

నానమ్మ, తాత కాస్త దారిలో పడ్డారా? నీకు ఫ్లాష్‌బ్యాక్ కథలో కొన్ని సందేహాలు న్నాయి కదా? అవి తీర్చడం నాబాధ్యత" అంటూ ప్రారంభించాడు.

ప్రియా! ఆడదానికైనా, మగాడికైనా వైవాహిక జీవితం చాలా ముఖ్యమైన మలుపు. అందుకే పెళ్లి చేసుకునేటప్పుడు అన్నివిధాలా అనుకూలమైన వాళ్లని చూసుకోవాలి అంటారు. ఆ వైవాహిక జీవితం చెల్లాచెదురయిందంటే తిరిగి ఆ జీవితాన్ని సవ్యంగా మార్చుకోడానికి చాలా కష్టపడాలి. ఒక్కోసారి జీవితకాలం పడు తుంది. సరే, అసలు విషయానికి వస్తాను. ఆ రోజు దాదాపు అర్ధరాత్రి కావ స్తుండగా గోపీనీ, అరుంధతినీ తమ కొ డుకుతో పాటు బి.టెక్ చదవడానికి వైజాగ్ వెళ్తున్న ఆర్తి ఇంట్లో దింపి వచ్చారు సుమతి, విశ్వనాధం. తెల్లవారేట ప్పటికి గేటు ఆపకుండా కొడుతున్నారు ఎవరో. సుమతి ఉలిక్కిపడి లేచి బైటకి వెళ్లి గేటు తీసేటప్పటికి అపరకాళిలా నిల బడి ఉంది కామేశ్వరమ్మ. సుమతి దిగ్భ్రాం తితో చూస్తుండగానే సుడిగాలిలా ఆవిడ సుమతిని తోసుకుంటూ లోపలికి వచ్చింది.

"చెప్పు.. ఏడీ నీ కొడుకు? నా కోడల్ని ఎక్కడికి లేపుకుపోయాడు? చెప్పవే.. నంగనాచిలా పిలవని పేరంటానికి వచ్చి నట్టు నా ఇంటికొచ్చి ఇంటి గుట్టు రచ్చకీ డ్చాలనుకున్నావా? నా కోడల్ని చెడగొట్టి నీ కొడుకుతో లేచిపోవడానికి నువ్వే దారి చూపించావని తెలుసు. చెప్పవే.. ఏడీ నీ కొడుకు? " అంటూ రంకెలేయసాగింది.

ఆ అరుపులకి విశ్వనాధం కూడా లేచి వచ్చాడు. వాకిళ్లలో ముగ్గులేసుకోడానికి వచ్చిన వాళ్ళంతా సుమతి ఇంట్లోంచి ఉద యాన్నే వినిపిస్తున్న ఆ కేకలకి ఎక్కడివా ళ్ళక్కడ నిలబడిపోయారు.

కామేశ్వరమ్మ పూనకం వచ్చినట్టు ఊగి పోతోంది. సుమతిని ఏ క్షణానైనా కొట్టడా నికి సిద్ధంగా ఉన్నట్టుగా ఉంది. జుట్టు విడిపోయి, కళ్లు నిప్పు కణికల్లా మండుతూ చూస్తుంటేనే భయం వేసేలా ఉన్న ఆవిడకి ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదా దంపతులకి.

"నాకు తెలుసు.. నా ఇంట్లో పుట్టిన ఆ పిల్ల నీ కొడుకు ద్వారానే పుట్టింది. నా కొడుకు వెర్రివెధవని కదూ.. నువ్వు నీ కొడుకుని పురికొల్పావు. వాడు ఆ రోజు కిటికీలోంచి తినేసేలా చూస్తుంటేనే నాకర్థ మైపోయింది. ఏడీ వాడు.. ఎక్కడు న్నాడు? మాట్లాడవే నంగనాచీ" సివం గిలా ఊగిపోతోందావిడ.

"అమ్మా కామేశ్వరమ్మ!" విశ్వనాధం శాంతంగా పిలిచాడు.

"నోరుముయ్యరా ఆడంగి వెధవా!" అరి చింది ఆవిడ.

అప్పుడు మండింది విశ్వనాధంకి. "ఆపు!" అని అరిచిన ఆయన అరుపుకి ఆవిడేకాదు.. ఆ చుట్టుపక్కల అందరూ కూడా స్తంభించిపోయారు.

"ఏంటమ్మా.. ఏం మాట్లాడుతున్నావు? నా కొడుకుని గురించి ఇంకోమాట మాట్లా డావంటే నాలిక చీరేస్తాను. మీ గురించి, మీ బతుకుల గురించి మాకు తెలియదను కుంటున్నావా? నువ్వే ఆ పిల్లని రాచిరం పాన పెట్టి, చంపి ఎక్కడో పారేసి నాటకం ఆడుతున్నారేమో ఎవరికి తెలుసు? మనుషులని చంపడం మీకివాళ కొత్తకాదు కదా? మీకు బంధాలు, బంధు త్వాలు కూడా ఉన్నాయా? ఇంకొక్క క్షణం ఇక్కడ ఉన్నావంటే పోలీస్ రిపోర్టు ఇస్తాను. ఆ తరవాత వాళ్లే ఇన్వెస్టిగేట్ చేస్తారు. ఆ అమ్మాయి ఎవరో.. మీకూ, ఆ పిల్లకీ ఉన్న బంధుత్వం ఏంటో.. ఆ పిల్లని మీరేం చేశారో వాళ్లే తేలుస్తారు. వెళ్లిక్కడి

నుంచి.. ఊ వెళ్లు.. నీకు సిగ్గనేది ఉంటే ఇంకెప్పుడూ ఈ చుట్టుపక్కలకు రాకు" పులిలా గర్జిస్తున్న భర్తను చూసి సుమతి కూడా భయపడింది.

కామేశ్వరమ్మ ఏం మాట్లాడలేదు. అప్పటికే ఆయన మాటలు ఆవిడ నెత్తిమీద మేకులు కొడుతున్నట్టుగా అనిపిస్తోంటే, రొప్పుతూ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

సుమతి భర్తను నెమ్మదిగా లోపలికి తీసికెళ్లి తలుపేసేసింది. ఏం జరిగి వుంటుందో అర్థంకాని ఆడోళ్ళంతా ఎవరి పనుల్లో వాళ్లు పడిపోయారు.

★ ★ ★

అదే రోజు సాయంత్రం విశాఖ ఎక్స్‌ప్రెస్‌లో గోపి, ఆర్తిలతో పాటు అరుంధతి కూడా వైజాగ్ బయల్దేరింది. సుమతి, విశ్వనాథం స్టేషన్‌కెళ్లి ఆమెని ఓదార్చారు. "పిల్లనెలాగైనా నీ దగ్గరకు చేరుస్తాను అరుంధతీ. బాధ పడకు" అంది సుమతి.

"అయినా ఆ పిచ్చోడికి పుట్టిన పిల్ల నీకెందుకమ్మా? కొంతకాలం ఏదన్నా ఉద్యోగం చేసుకుని, తరవాత ఎవరినైనా మంచి అబ్బాయిని చూసి పెళ్లి చేసుకో. ఆ పిల్లని వాళ్లు చూసుకుంటారులే" అన్నాడు విశ్వనాథం.

"అంతమాటనకండి బాబాయిగారూ! ఎవరికి పుట్టినా నా కడుపు చీల్చుకుని, నా పేగులు తెంపుకుని పుట్టింది. పసిది, వాళ్లు దాన్ని చంపినా చంపుతారు, అలా జరక్కూడదు బాబాయిగారు. ఎలాగూ నా జీవితం నాశనం అయింది. నా కూతుర్నికైనా నేను మంచి జీవితాన్ని ఇవ్వాలి. నాకు పాప కావాలి బాబాయిగారూ. మీకు పుణ్యం ఉంటుంది. నా పాపని నాకిప్పించండి" కన్నీళ్లతో ప్రాధేయపడుతున్న అరుంధతి తల్లి మనసుకి జోహార్లర్పిస్తూ "ఊరుకోమ్మా.. తప్పకుండా ప్రయత్నిస్తాను. ముందు నువ్వు ఈ ఊరినుంచి వెళ్లిపో. మా పెద్దబ్బాయితో మాట్లాడతాను. అక్కడ్నుంచి మీ వాళ్ల దగ్గరకు పంపించే ఏర్పాటు చేస్తాడు, సరేనా? " ఆప్యాయంగా అన్నాడు విశ్వనాథం.

"రైలు బయలుదేరుతోంది, రండి" అన్నాడు గోపి ఆమె పక్కకి వచ్చి.

ఆమె సుమతి, విశ్వనాథం పాదాలకు నమస్కరించి గోపితో కలిసి రైలెక్కింది.

"గోపీ జాగ్రత్తరా! ఆ అమ్మాయిని వాళ్ల వాళ్లకి అప్పచెప్పమని అన్నయ్యతో చెప్తాను. జాగ్రత్త! బాగా చదువుకో"

"అలాగే నాన్నా"

"ఆర్తీ.. బై తల్లీ.. థాంక్యూఫర్ యువర్ కో-ఆపరేషన్" అన్నాడు విశ్వనాథం.

ఆర్తి నవ్వుతూ "ఇట్సాల్ రైట్ అంకుల్.. డోంట్ వర్రీ.. వి విల్ టేక్ కేర్ ఆఫ్ హర్" అంది.

రైలు కదిలింది. గోపి, ఆర్తి చెవిలో ఏదో చెప్పాడు. ఆర్తి భయంగా చూస్తూ "నో" అంది.

"ఫర్లేదు. రేపేదన్నా అయితే వాళ్ల మీద కేసు పెట్టడానికి ఇదొక్కటే ప్రూఫ్. ఆవిడని అడిగే తీయి" అన్నాడు.

ఆర్తి కొంచెం సేపు సందేహించి అంది "నాకు తెలుగు రాదు కదా? "

"ఓ.." గోపి ఆలోచించి నెమ్మదిగా అరుంధతిని అడిగాడు "మీరేం అనుకోకపోతే.. మిమ్మల్నిలా ఒక ఫొటో తీస్తాం.

ఎప్పటికైనా ఏదన్నా ప్రాబ్లెమ్ వస్తే వాళ్లు మీ మీద చేసిన అరాచకానికి ప్రూఫ్ ఉంటుంది"

అరుంధతికి అర్థమైంది అతనెందుకు అడుగుతున్నాడో. కళ్లల్లో గిర్రున నీళ్లు తిరుగుతుంటే నెమ్మదిగా తలమీంచి కొంగు వెనక్కి జరిపి మెడమీదికి జార్చింది. కళ్లు వాలిపోయాయి. ఆర్తి కళ్లల్లో కూడా నీళ్లు తిరిగాయి. నెమ్మదిగా తన కెమెరా బ్యాగ్‌లోంచి తీసి రెండు స్నాప్‌లు తీసి, "థాంక్యూ" అంది.

సుమతి, విశ్వనాథం వెనక్కి తిరిగి వచ్చేశారు.

"మన అదృష్టం బాగుండి వాళ్లకి సాయం చేసేవాళ్లు ఎవరూ లేరుగానీ, ఉండివుంటే ఈ పిల్లని వెతికించి పట్టుకుని చంపేసేవాళ్లు" అన్నాడు విశ్వనాథం.

"మీరు ఉదయం పెట్టిన గడ్డికి మళ్లీ ఆవిడ గుమ్మం దాటి వస్తుందేంటి? " అంది సుమతి.

"ఆ పిల్ల సంగతేం చేద్దాం? ఎలా బైటకి తీసుకురావడం? " సుమతి ఆలోచిస్తూ అంది.

"చూద్దాం.. మనబ్బాయికి పుట్టింది అంటోందిగా.. మా మనవరాల్ని మాకిచ్చేయండి అందాం" తనే అంది మళ్లీ.

"ఛ ఊరుకో.. ఎవరన్నా వింటే నిజమనుకుంటారు" కసిరాడు విశ్వనాథం.

సుమతి గమ్మునుండిపోయింది.

ఇంటికెళ్లాక ప్రసాద్‌కి ఫోన్‌లో విషయమంతా వివరించి "జాగ్రత్త నాన్నా.. ఆ అమ్మాయిదే వూరో, పేరెంట్స్ ఎవరో తెలుసుకుని అక్కడికి తీసికెళ్లి డ్రాప్ చేసిరా. నువ్వైతే పెద్దవాడివి, జాగ్రత్తగా అప్పచెప్తావని చెప్తున్నాను" అన్నాడు విశ్వనాథం.

"అలాగే నాన్నా.. తప్పకుండా చేస్తాను. ఆపదలో ఉన్న ఆడపిల్లని ఆదుకోకపోతే ఇంకెందుకు నాన్నా ఈ జన్మ. ఆదివారం తీసుకుని వెళ్తాను. అంతవరకూ నా ఫ్రెండ్ వాళ్లింట్లో ఉంచుతా" అన్నాడు ప్రసాద్.

ఆ తరవాత నాలుగైదు రోజులు సుమతి, విశ్వనాథంలు తీవ్రంగా ఆలోచించారు పాపనెలా తీసుకురావాలా అని. కానీ వాళ్లకే ఆలోచనా తట్టలేదు.

ఆ రోజు జరిగిన సంఘటన గురించి చుట్టుపక్కలవాళ్లంతా ఒక్కొక్కరే వచ్చి సుమతిని వివరాలు అడగసాగారు.

అందరికీ కూడా ఉన్నది ఉన్నట్టు, జరిగింది జరిగినట్టు చెప్పింది, ఒక్క అరుంధతి తన దగ్గరకు వచ్చిన విషయం తప్ప.

"పాపం ఆ పిల్లని చిత్రహింసలు పెట్టిందమ్మా ఆవిడ. భరించలేక పారిపోయి ఏ హుస్సేన్‌సాగర్‌లోనో దూకి ఉంటుంది" అంది చివరికి.

"అవునాంటీ.. నిన్న టీవీవార్తల్లో చూపించారు, ఒకమ్మాయి డెడ్‌బాడీనీ. బహుశా ఆమే అయివుంటుంది" అంది ఒకమ్మాయి.

"పాపం.. అంతేలెండి. చావకేం చేస్తుంది!" అందొకావిడ.

"నేను పేపర్లో కూడా చదివానండి. అత్తింటి టార్చర్ భరించలేక ఒకమ్మాయి ఆత్మహత్య చేసుకుంది" అంది మరొకావిడ.

అలా తలో మాట మాట్లాడి, కామేశ్వరిని శాపనార్థాలు పెట్టి, 'పాపం ఆ పసిదాన్నేం చేస్తారో' అంటూ సానుభూతి ప్రకటించి వెళ్ళిపోయారు ఒక్కొక్కరే.

★ ★ ★

సరిగ్గా అరుంధతి పారిపోయి వచ్చిన ఆరో రోజు మిట్టమధ్యాహ్నం మగాళ్లంతా ఆఫీసులకి వెళ్ళిపోయాక, పని ముగించుకుని, భోజనాలు చేసి ఆడవాళ్లంతా రిలాక్స్ అవుతున్న సమయం. బైట నుంచి పెద్దగా కేకలు వినిపించాయి. సుమతి దిగ్గున లేచి, బైటికి పరిగెత్తింది.

ఎదురింటి శీను గట్టిగా అరుస్తున్నాడు "నా పెళ్ళాం.. నా పెళ్ళాం కావాలి నాకు. నా పెళ్ళాం కావాలి. లేదంటే దీన్నీ చంపేస్తా"

కెవ్వుమంది సుమతి. వాడి చేతిలో పాప. దాన్ని రెండు చేతుల్తో పైకెత్తి పట్టుకున్నాడు.

కామేశ్వరమ్మ నెత్తి కొట్టుకుంటూ "రారా! లోపలికి రారా" అని పిలుస్తోంది

సుందరయ్య జారిపోతున్న పంచెను చేత్తో పట్టుకుని గేటు తోసుకుని పరుగున వస్తున్నాడు. శీను ఆయనకి అందకుండా పరిగెత్తసాగాడు. సుమతి అప్రయత్నంగానే గట్టిగా "శీనూ.. పాపనిలా ఇవ్వు" అని అరిచింది.

అప్పుడే బట్టలు ఉతకడానికొస్తున్న లక్ష్మమ్మ ఆ దృశ్యం చూసి స్థాణువైపోయింది. క్షణంలో తేరుకుని "ఓలయ్యో.. నా కొడుకో.. గా బిడ్డనేడికి కొంచబోతున్నవు? " అంటూ శీను వెంటపడింది, పిచ్చివాడి పరుగును అందుకోలేక ఒగరుస్తూ లక్ష్మమ్మ. ఆమె వెనకాల ఆయాసపడుతూ సుందరయ్య.

సుమతి గుండె దడదడలాడుతోంది. 'ఆ పిల్లనేం చేస్తాడో భగవంతుడా!' అనుకుంటోంది.

అప్పటికే అందరూ గుమికూడారు. కొంతమంది ఆడోళ్ళు కూడా వాళ్ళ వెనకే పరిగెత్తారు. అప్పటికే వాళ్ళు మెయిన్ రోడ్డుమీదికి వెళ్లిపోయారు.

కామేశ్వరమ్మ వరండాలో కుప్పకూలి పోయి మోకాళ్లమీద తల పెట్టుకుని కూర్చుంది. అప్పుడు వినిపించిందో ఆర్త నాదం. రాయి తగిలి బోర్లా పడ్డాడు శీను. పాప రోడ్డు మీద పడిపోయి కెవ్వుమంది. వేగంగా వస్తున్న కారు శీను మీంచే వెళ్లి పోయింది.

అప్పటికే అక్కడికి చేరుకున్న లక్ష్మమ్మ పాపనందుకుని గట్టిగా గుండెలకు హత్తు కుంది. రక్తం మడుగులో ఉన్న శీనుని చూడలేనిదానిలా కళ్లు గట్టిగా మూసుకుని, పెద్దగా ఏడుస్తూ వెనక్కి తిరిగింది.

అక్కడికి చేరుకున్న సుందరయ్య కుప్ప కూలిపోయాడు.

చూస్తుండగానే విషాదం అలముకుంది.

కామేశ్వరమ్మ మంచుశిల అయింది.

చేతుల్లో బిడ్డతో ఏడుస్తూ వచ్చిన లక్ష్మ మ్మని ఒక్క తోపుతో దూరంగా తోసి గట్టిగా అరిచింది "ఆ పాపిష్టి పిల్లని నా ముందుకు తీసుకురాకు. ఏ క్షణాన పుట్టిందో.. అంతా నాశనమే చేసింది. తీసి కెళ్లి కాలవలో పారెయ్"

లక్ష్మమ్మ బిక్కచచ్చిపోయి పాపతో సహా పరిగెత్తుకుంటూ సుమతి నిలబడిన చోటుకి వచ్చింది. సుమతి చేతులు చాచింది పిల్లనివ్వమన్నట్లుగా.

లక్ష్మమ్మ భయంభయంగా పిల్లని ఆవిడ చేతుల్లో పెట్టింది.

"లోపలికి రా లక్ష్మమ్మ" అంటూ నెమ్మ దిగా లోపలికి నడిచింది సుమతి. ఆమెని అనుసరించింది లక్ష్మమ్మ. కాసేపట్లో అంబులెన్స్ శబ్దం, పోలీస్ విజిల్స్ వినిపిం చాయి. ఇద్దరూ తలుపులేసుకుని భగవం తుడిని తల్చుకుంటూ బిక్కచచ్చిపోయి కూర్చుండిపోయారు.

యాక్సిడెంట్‌లో శీను పోయాడు.

కేసులు, కోర్టులు ఏమీ వద్దు. నష్టపరి హారాలు అసలే వద్దు. ఇంత నష్టం జరి గాక ఎంత పరిహారం ఇవ్వగలరంటూ సుందరయ్య దణ్ణం పెట్టేశాడు.

కొడుకు అంత్యక్రియలు పూర్తిచేసి వచ్చిన ఆ దంపతులు శాశ్వతంగా ఆ ఇంటి గేటు మూసేశారు. గ్రిల్ డోర్ మూసేశారు. లోపలికి వెళ్లి ద్వారం మూసేసి, ద్వారానికి అడ్డంగా మంచాలు జరిపేసి, జీవచ్ఛవాల్లా కూర్చుండిపో యారు.

లక్ష్మమ్మకి జరిగిన విషయం మొత్తం చెప్పింది సుమతి. "పాపం! పిల్లకోసం తల్ల డిల్లింది ఆ అమ్మాయి. ఎలాగైనా పిల్లని కూడా అప్పచెప్తామని మాట ఇచ్చాం కానీ, ఎలాగో.. ఏం చేయాలో మాకర్థంకాలేదు లక్ష్మమ్మా. వాడు చచ్చినందుకు నాకు బాధగాలేదు. కానీ ఈ పిల్లని ఈ విధంగా నా దగ్గరకు చేర్చాడు భగవంతుడు. ఇప్పుడు చెప్పు, ఏం చేద్దాం? " అడిగింది సుమతి.

"ఏం చేసుడేందమ్మా.. కొంచబోయి తల్లి ఒడిలో పండబెట్టు"

"కానీ ఇక్కడ అందరూ జరిగిందేంటో చూశారు. నా చేతుల్లో నువ్వు పిల్లని పెట్టడం చూశారు. రేపు పిల్ల ఏది అని అడిగితే ఏం చెప్పను? "

"నేను గొంచబోయిన అని చెప్పు. నేను చెప్త.. ఆ కసాయోల్ల తాన పెరిగే కన్నా నా ఆడబిడ్డకి బిడ్డల్లేరని సాకనీకి ఇచ్చిన అని చెప్త"

సుమతికి లక్ష్మమ్మ మాటలతో కళ్లు చె మ్మగిల్లాయి. "కులమేదైనా నీకున్న పెద్ద బుద్ధి వాళ్లకు లేకపోయింది లక్ష్మమ్మా. నీకెలా కృతజ్ఞత చెప్పాలో తెలియడం లేదు" అంది.

"ఏందమ్మా.. నేనాడదాన్నే, నువ్వాడదా నివే. ఇంకేంది? బిడ్డను సూస్తసూస్త సంపుతమా? " కళ్లల్లో తడితో అంది లక్ష్మమ్మ.

సుమతి ఆమె రెండు చేతులు పట్టుకుని ముద్దు పెట్టుకుంది.

"నువ్వేం పరేశాను గాకు, నేను చూసుకుంట. కత నేను నడిపిస్త. నువ్వు రేపే ఎల్లిపో.. ఈ బిడ్డను ఆ తల్లికిచ్చెయ్"

"అలాగే" సుమతి లేచింది.

లక్ష్మమ్మ కూడా లేచి వెళ్లిపోయింది.

★ ★ ★

ప్రసాద్ అరుంధతిని తీసుకుని పొన్నూరు వెళ్ళాడు. కానీ, అప్పటికే ఆమె అమ్మమ్మ, తాతగారు పోయారని తెలిసింది. అరుంధతి చెల్లెళ్లు ముగ్గురూ వాళ్లు ప్రేమించిన వాళ్లని పెళ్లిళ్లు చేసుకుని వెళ్లిపోయారని కూడా చెప్పారు పక్కవాళ్లు.

ఇంక అక్కడ ఎవరికోసం ఉండాలో తెలియలేదు అరుంధతికి.

ఆమెని ఎక్కడ వదలాలో ప్రసాద్‌కి కూడా అర్థంకాలేదు.

తండ్రికి ఫోన్ కలపబోతుంటే, అక్కడ్నించి ఇన్‌కమింగ్ కాల్ వచ్చింది.

"ప్రసాద్ ఎక్కడున్నావురా?" అవతలి నుంచి సుమతి స్వరం వినిపించింది.

"అమ్మా.. నువ్వా..? నేనే చేయాలనుకున్నాను. నేను పొన్నూరులో ఉన్నాను. కానీ ఇక్కడ ఆవిడకి సంబంధించిన వాళ్లెవరూ లేరు, ఏం చేయను?" అడిగాడు.

"నువ్వు వైజాగ్ వచ్చెయ్. నేను వస్తున్నాను"

"నువ్వా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవునురా.. నేనూ, నాన్నగారూ ఇద్దరం వస్తున్నాం. వచ్చాక విషయం చెప్తాను. నువ్వు వైజాగ్ వచ్చెయ్, ఆ అమ్మాయిని తీసుకుని"

"అలాగే"

ఫోన్ కట్‌చేసి "రండి, మళ్లీ మనం వైజాగ్ వెడదాం.. మా పేరెంట్స్ వస్తు

న్నారు" అన్నాడు ప్రసాద్. అప్పటికే జరుగుతున్న ఒక్కో సంఘటనకి భయంతో, అవమానంతో కుంచించుకుపోతున్న అరుంధతి మారు మాట్టాడకుండా అతడిని అనుసరించింది.

★ ★ ★

తన చేతులకి అతి భద్రంగా అప్పచెప్తున్న కూతుర్ని అపురూపంగా అందుకుని గుండెలకు హత్తుకుంది అరుంధతి.

సుమతి, విశ్వనాథం కొడుకులిద్దరితో కలిసి మొత్తం విషయం అంతా చర్చించారు.

"మంచోచెడో ఈ పిల్ల మన సాయం కోరి వచ్చింది. ఆమెకేదన్నా దారి చూపిస్తే మన బాధ్యత పూర్తిగా నెరవేర్చినవాళ్లం అవుతాం" అన్నారు.

వైజాగ్‌లో ఆరుంధతి ఇద్దరు బ్యాచిలర్స్‌తో కలిసి ఉండడం సభ్యత కాదు. ఇక ఎక్కడ ఉండాలి?

సుమతికి హఠాత్తుగా గుర్తొచ్చింది ఆవిడ చిన్నప్పటి స్నేహితురాలు. ఆ మధ్య ఉత్తరం రాసింది సుమతికి. నా కూతురు, అల్లుడు డాక్టర్స్. వాళ్లకి ఒక బాబు. వాడికి రెండేళ్లు. వాడినీ, ఇంటినీ చూసుకోడానికి నమ్మకస్తురాలైన అమ్మాయి ఎవరన్నా ఉంటే చెప్పు. ఇంట్లోనే ఉండాలి. స్వంత ఇల్లులా చూసుకోవాలి. తిండి, బట్టా, అకామడేషన్ ఇచ్చి ఏడాదికి ఇంత అని జీతం ఇస్తారు. ఎవరూలేని వాళ్లు ఉంటారు కదా. నీకు ఎవరన్నా తెలిస్తే చెప్పు అని.

సుమతి భర్తనడిగింది "నా స్నేహితురాలు సరోజ ఫోన్ నెంబర్ ఉందా మీ దగ్గర? ఒకసారి మనం తిరుపతి వెళ్లినపుడు కలిసింది. అప్పుడు తన నెంబరు ఇచ్చింది. మీరు డైరీలో రాసుకున్నారు."

విశ్వనాథం జేబులోంచి డైరీ తీసి చూశాడు. "సరోజ, రంగనాథ్"

"ఆ.. ఆ.. అవును"

"ఉంది. రాసుకో నెంబర్"

"ప్రసాద్ నీ సెల్‌లో కలపరా"

"అలాగే"

ఆ విధంగా సరోజకి కాల్‌చేసి, వివరాలన్నీ చెప్పింది సుమతి. వెంటనే ఆ అమ్మాయిని గుంటూరు పంపించు అంది సరోజ అడ్రస్, ఫోన్ నెంబరు ఇస్తూ.

"అబ్బా, మళ్లీ గుంటూరా? ఈ పని ముందే చేస్తే బాగుండేది. అక్కడిదాకా వెళ్లి వెనక్కి వచ్చాం" అన్నాడు ప్రసాద్.

"మేం తీసికెళ్లి దింపుతాంలేరా" అంది సుమతి.

అన్నట్టుగానే అరుంధతినీ, పాపనీ తీసుకుని సుమతి, విశ్వనాథం గుంటూరు వెళ్లి సరోజ కూతురు డాక్టర్ పరిమళను కలిశారు. వాళ్లబ్బాయి పాణిని చూసుకోడానికి ఆ ఇంట్లో అరుంధతిని ఏర్పాటు చేశారు.

ప్రియా! అప్పటి నుంచీ మీ అమ్మ వాళ్ల దగ్గర కొంతకాలం పని చేసింది. పాణి పెద్దవాడు అయ్యాక పరిమళగారే ఏదో స్కూల్లో చిన్నపిల్లలకి ఆటలు, పాటలు నేర్పే టీచర్‌గా మీ అమ్మకు ఉద్యోగం వేయించారు. అలా మీ అమ్మ అనేక కష్టాలు పడి నిన్నింతదాన్ని చేసింది.

మీ అమ్మకి సాయం చేసే పరంపరలో మా పేరెంట్స్ కూడా కొన్ని ఊహించని అవమానాలు ఎదుర్కోవాల్సి వచ్చింది. లోకులు కాకులు అంటారు. అన్నట్టుగానే అసలు శత్రువులు అంధకారంలోకి వెళ్లిపోయినా మిగతావాళ్లు అమ్మని అవకాశం దొరికినప్పుడల్లా.. సూటిపోటి మాటలంటూ, చివరికి అరుంధతికీ, నాకూ అక్రమసంబంధాలు అంటగట్టి, ఆ పాప అంటే నిన్ను నా సంతానం అనీ ప్రచారం చేశారు. ఆ బాధ పడలేక అమ్మావాళ్లు ఆ ఇల్లు అద్దెకిచ్చేసి, బంజారాహిల్స్‌లో వేరే అపార్ట్‌మెంట్ తీసుకుని షిఫ్ట్ అయ్యారు.

అన్నయ్య ఎంఎస్ చేయడానికి అమెరికా వెళ్లి, అక్కడే జాబ్ చూసుకుని సెటిల్ అయాడు. బహుశా నేనూ వెళ్లేవాడినే... కానీ, నాకు క్యాంపస్ సెలక్షన్‌లో మంచి జాబ్ వచ్చి బెంగళూరులో పోస్టింగ్ వచ్చింది. వెంటనే జాబ్‌లో చేరిపోయాను.

అమ్మావాళ్ల తరఫున నేను తరచూ గుంటూరు వెళ్లి మీ యోగక్షేమాలు కనుక్కుంటూ ఉండేవాడిని. అలా మీ అమ్మ నాకు స్వంత అక్కకన్నా ఎక్కువ అయింది. అనుకోకుండా నా భార్య కూడా గుంటూరు అమ్మాయి కావడంతో ఇంకా సన్నిహితం అయ్యాం. నువ్వు నా స్వంత మేనకోడలికన్నా ఎక్కువ అయ్యావు. అప్పటినుంచి కూడా నాకో కోరిక ఉంది. ఏనాటికైనా మానవ రూపంలో ఉన్న ఆ రాక్షసులకి నిన్నూ, మీ అమ్మనీ చూపించి 'చూడండి.. మీరు దూషించి, అవమానించి, చంపాలని ప్రయత్నించినవాళ్లు ఎంత హాయిగా, సంతోషంగా ఉన్నారో' అని చెప్పాలని.

ప్రియా! ఇదమ్మా కథ. వాళ్లు చెడ్డవాళ్లు. నీకు జన్మనిచ్చినవాడు మతిస్థిమితం లేనివాడు. ఇది నిజం. ఇష్టం ఉండి చేసుకున్నా, ఇష్టం లేక చేసుకున్నా మీ అమ్మ పెళ్లి అయింది. పెళ్లి అయిన వెంటనే ఆడపిల్ల ఇంటిపేరు మారిపోతుంది. వారి సంతానం ఇంటిపేరు కూడా అదే అవుతుంది. అనేక సందర్భాల్లో నీ అప్లికేషన్స్ ఫిలప్ చేసేటప్పుడు సర్‌నేమ్ అనే దగ్గర ఆ ఇంటి పేరే రాయాల్సి వచ్చేది. తండ్రి పేరు అంటే అతని పేరే రాయాల్సి వచ్చేది. ఇంకో పేరు రాయలేదు మీ అమ్మ. ఆ అవకాశం లేదు. వాళ్లు చెడ్డవాళ్లని ఆ ఇంటిపేరు మార్చుకోలేదు. తండ్రిని అంతకన్నా మార్చలేదు. ఎట్టిపరిస్థితిలోనూ నువ్వు ఆ ఏటి కెరటానివే. అలాంటప్పుడు మీరెందుకు మీ హక్కుల్ని కోల్పోవాలి? వాళ్లకి మీరు తప్ప ఇంకెవరూ లేరు. చావుకి దగ్గరవుతున్న వాళ్ల దగ్గర ఉన్న ఆస్తి ఆ ఇల్లు. అదన్నా నీకు, మీ అమ్మకీ దక్కాలి. అందుకే నిన్ను అక్కడికి పంపించాను.

నేను చేసింది సరైనదా, కాదా ఆలోచించు. సరైనదయితే నీ హక్కుని పొందడానికి కృషిచేయి. ప్రయత్నించు, విజయం సాధించు. ఆల్ ద బెస్ట్.

ప్రియ నిస్తేజంగా కుర్చీలో వెనక్కి వాలిపోయింది.

యస్.. అంకుల్ అన్నది నిజం. తను ఈ ఏటి కెరటమే. ఇది కాదనలేనిది, జీర్ణించుకోవడానికి చాలాకష్టం. కానీ తను జీర్ణించుకున్నా లేకున్నా ఈ వ్యసస్థ జీర్ణించుకున్న వాస్తవం. అలాంటప్పుడు అంకుల్ అన్నట్టు తన హక్కుని ఎందుకు వదులుకోవాలి?

ఈ ఇల్లు తనక్కాదు అమ్మకి దక్కాలి. అవును దక్కాలి. నేను పాణిని పెళ్లి చేసుకుని విదేశాలకు వెళ్లిపోతే అమ్మ ఎక్కడ ఉంటుంది? ఎంతకాలం చూడగలరు అంకుల్? అమ్మ ఈ ఇంట్లో హక్కుగా, దర్జాగా బతకాలి. అది సాధించాలి తను.

ప్రియ దృఢంగా నిశ్చయించుకుంది.

★ ★ ★

ప్రస్తుతం అరుంధతి అద్దెకుంటున్న ఇల్లు

రెండేళ్ల క్రితం తీసుకున్నారు. అంతకు ముందు ఒకగది, కిచెన్ మాత్రమే ఉండేది. ప్రియ చదువుకోవడానికి ఇబ్బం దిగా ఉందని రెండు గదులున్న పోర్షన్ తక్కువ అద్దెలో దొరికితే షిఫ్టు అయారు. అదే రామశాస్త్రి ఇల్లు. అనుకోకుండా తన ఇంట్లోకే చేరిన అరుంధతిని గుర్తుపట్టిన రామశాస్త్రి ఆమె ద్వారా జరిగింది తెలుసు కుని చాలా బాధపడ్డాడు. సుందరయ్య చేసిన మోసం తెలుసుకుని మండిపడ్డాడు. అప్పటి నుంచీ అరుంధతిని, ప్రియని స్వంత పిల్లల్లా చూసుకోడం మొదలు పెట్టారు ఆ దంపతులు. ఆ క్రమంలోనే ప్రియ ఉద్యోగం చూసుకుని హైదరాబాద్ బయల్దేరడం, సుందరయ్య ఇంట్లో పాగా వేయడానికి ప్లాన్ చేయడం తెలుసుకుని, తన మీద వాళ్లకున్న గౌరవాన్ని ఉపయో గించుకున్నాడు. స్వదస్తూరితో ఆయన ఓ లేఖ రాసి ఇచ్చాడు ప్రియకి.

వాళ్లకి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అన్నీ దగ్గరుండి చెప్పి, పంపించాడు.

మెయిల్ చదవడం పూర్తయ్యాక, ప్రియ రెస్ట్‌రూమ్‌కి వెళ్లి మొహం కడు క్కుని వచ్చి, పౌడర్ రాసుకుంది. జుట్టు సరి చేసుకుని మనసు దిటవు చేసుకుని తిరిగి సీటు దగ్గరకు వెళ్లిపోయింది.

సెల్‌లో సుమతి నెంబర్ నొక్కింది.

"అమ్మమ్మగారూ! నేను ప్రియను.."

సుమతి ఆనందంగా అంది "చెప్పమ్మా.. ఎలా ఉన్నావు? ఏంటి సంగతులు? "

"నేను బాగున్నాను. సాయంత్రం మీ దగ్గరికి వస్తున్నాను. కొంచెం త్వరగా బయల్దేరి వస్తాను"

"అలాగే తల్లీ.. తప్పకుండా రా" ఆప్యా యంగా ఆహ్వానించింది సుమతి.

సెల్ ఆఫ్ చేస్తూ అనుకుంది 'ఏనాటి బంధం అమ్మమ్మగారూ మీతో మాకు? దీన్నేనా పెద్దవాళ్లు రుణానుబంధం అంటారు! మీరెవరసలు.. మాకెందుకింత సహాయం చేశారు, ఇంకా చేస్తున్నారు!'

కళ్లు చెమ్మగిల్లుతోంటే కుర్చీలో వెనక్కి వాలింది ప్రియ.

ఆ సాయంత్రం సుమతిఇంటి ముందు ఆటో దిగుతూ అనుకుంది ప్రియ 'పాణి విషయం నేనెలా ప్రస్తావించనబ్బా? ' అని.

అయితే ప్రియని ఇబ్బంది పెట్టకుండా సుమతే మధురంగా నవ్వుతూ, గేటు లోంచే భుజమ్మీద చెయ్యేసి లోపలికి తీసి కెళ్లింది.

"ఇక్కడికి వచ్చిన రోజు వచ్చావు. మళ్లీ ఇవాళ వస్తున్నావు. అంత బిజీగా ఉన్నావా ప్రియా? " ఆప్యాయంగా అడి గింది.

"బిజీ అంటే అదేం లేదు. కానీ టైం సరి పోవడంలేదు.. ఆఫీస్‌కీ, ఇంటికీ చాలా దూరం. టైం అంతా దాదాపు ట్రాఫిక్‌లోనే అయిపోతోంది" అంది ప్రియ.

"సరేలే.. ఫ్రెషప్ అవుతావా? వెళ్లు. వేడి వేడి బజ్జీలు వేసి పెడతాను" టవల్ చేతికిస్తూ అంది సుమతి.

"నేను ఫ్రెష్‌గానే ఉన్నానమ్మమ్మగారూ. తాతగారు లేరా? " చుట్టూ చూస్తూ అడి గింది ప్రియ.

"లేరమ్మా.. అపార్ట్‌మెంట్స్ మీటింగ్ ఉంటే వెళ్లారు. వచ్చేస్తారులే. దా నేను బజ్జీలు వేస్తుంటాను. నువ్వు కబుర్లు చెబు దువుగాని" అంటూ వంటగదివైపు దారి తీసింది సుమతి.

ప్రియ ఆవిడని అనుసరిస్తూ అంది "ఆ ఇంట్లోంచి ఈ ఇంట్లోకి వస్తే భూగర్భం లోంచి స్వర్గానికి వచ్చినట్టుంది. బాబోయ్! ఏం ఇల్లు అది? ఆ ఇంటిని ఓ కొలిక్కి తీసుకురాడానికి తల ప్రాణం తోక్కొచ్చింది నాకు. ఎంత వాసనో.. మొదటి రోజు లోపలికి వెళ్లగానే.. కాస్సేపు కూడా ఉండ లేకపోయాను"




శెనగపిండిలో ముంచిన బంగాళాదుంప చిప్ కాగిన నూనెలో వేస్తూ అడిగింది సుమతి "నువ్వు తీసుకొచ్చిన సంస్కరణలు చూసి గుండెలు బాదుకున్నారా? "

"చాలా గొడవ చేశారు. కానీ బానే మేనేజ్ చేయగలిగాను. కాస్త ఇప్పుడిప్పుడే మాట్లాడుతున్నారు నాతో" నవ్వింది ప్రియ.

"నువ్వు చాలా గొప్పదానివి ప్రియా! వాళ్లలాంటి వ్యక్తులను ఇంత తొందరగా సంస్కరించావంటే నీ సహనాన్ని మెచ్చుకుంటున్నాను"

"వాళ్లు కూడా చాలా హెల్ప్‌లెస్ కండిషన్‌లో ఉన్నారు అమ్మమ్మా. ఈ వయసులో కూడా పంతాలు పగలు పెట్టుక్కూర్చుంటే వాళ్ల జీవితం గడిచేదెలా? రేపు ఏ అర్ధ

రాత్రో వాళ్ళల్లో ఒకళ్ళు గుటుక్కుమన్నా, ఎవరితో సత్సంబంధాలు లేనప్పుడు ఎవరు మాత్రం వాళ్లకి సాయం చేయగలరు? ఈ వాస్తవం వాళ్లు ఇప్పుడిప్పుడే గ్రహిస్తున్నారేమో అనిపిస్తోంది"

"జీవితం చివరి అంచుమీద నిలబడ్డారు. ఏ క్షణమైనా పడిపోవచ్చు. పట్టుకోడానికి రెండు చేతులు కావాలి. అది అర్థం చేసుకుంటే చాలు" బజ్జీలు ప్లేటులో పెట్టి అందిస్తూ అంది సుమతి.

"ఏం చేసినా ఆ గది తాళం మాత్రం తీయడంలేదు. ఆ గదిలో ఏదో జువెలరీ ఉందంటోంది గౌరి"

"గౌరి ఎవరు? "

"వాళ్ల పనిమనిషి. భలే మనిషిలే. వాళ్లకు తనే కరెక్ట్, దబాయించేస్తుంది"

నవ్వింది సుమతి.

"ఆ గది తాళం తీయించాలి. సమయం కోసం చూస్తున్నాను"

"జువెలరీ నిజంగానే ఉందా? "

"నిజంగా ఉన్నా, లేకున్నా ఆవిడ జువెలరీ నాకెందుకు అమ్మమ్మా? వాళ్లనే ఏమైనా చేసుకోని. బంగారం లాంటి మా అమ్మ జీవితం బలితీసుకున్న వాళ్ల సంపదలు మాకు అవసరం లేదు. కానీ అంకుల్ అన్నట్టు అమ్మకో నీడ ఏర్పాటు చేయడానికి మాత్రమే నేనింత కష్టపడుతున్నాను. పిచ్చివాడైనా ఫలానావాడి భార్యగా, ఫలానావారి కోడలిగా ముద్రపడిన అమ్మకి ఆ ఇంటిమీదున్న హక్కులు ఉపయోగపడాలనేదే నా తాపత్రయం" చలించిపోతూ అంటోన్న ప్రియని దగ్గరకు తీసుకుని అంది సుమతి "నాకు తెలియదా తల్లీ మీ మనసులు.. సరదాకి అన్నాను. అన్నట్టు పాణికి ఒకసారి ఈ మెయిల్ ఇవ్వు. నీతో ఏదో మాట్లాడాలిట" అంది సుమతి.

పాణి ప్రస్తావన రాగానే కళ్ల నుంచి జారిన కన్నీరు తుడుచుకుంటూ నవ్వింది ప్రియ.

"పాణి చదువైపోయింది. ఉద్యోగం కూడా వచ్చిందిట పరిమళగారు చెప్పారు. మీ విషయం నేను చూచాయగా ప్రస్తావించాను. అతను త్వరలో వస్తాట్ట. వచ్చాక మాట్లాడదాం అన్నారావిడ"

ప్రియ చెక్కిళ్లు ఎర్రబడ్డాయి. పెదాలు కంపించాయి. కళ్లు సిగ్గుతో వాలిపోయాయి. మౌనంగా ఉండిపోయింది.

"నేనో స్లిప్ మీద అతని ఈ మెయిల్ ఐడి రాసిస్తాను" అంటూ సుమతి అక్కడే ఉన్న టేబిల్ మీద నుంచి తెల్లకాగితం సగం చింపి దానిమీద రాని, ప్రియకి ఇచ్చింది.

ప్రియ ప్లేటు పక్కన పెట్టి ఆ కాగితం అందుకుంది.

ప్రియ మొహం చూస్తూ అంది సుమతి.

"చాలా మంచిపిల్లాడు. ఇన్నేళ్ల మీ స్నేహంలో ఏనాడూ హద్దుమీరలేదు కదూ. నిన్ను కేవలం స్నేహితురాలిగానే చూశాడు. అక్కడికి వెళ్లి కూడా తిక్కవేషాలేం వేయలేదుట. చాలా బుద్ధిమంతుడమ్మా. నువ్వు అదృష్టవంతురాలివి"

ప్రియ అణువణువూ ఝల్లుమంది. కానీ ఏదో సందేహం.. అతను ఒప్పుకుంటాడా? అతనికిష్టమేనా?

ఆమె మనసులో భావాలు గ్రహించినదానిలా అంది సుమతి "అతనితో చూచాయగా చెప్పారుట పరిమళగారు. నీకు ఇష్టం అవునో కాదో అడగమన్నాట్ట. తనే మాట్లాడతానన్నాట్ట. అయినా మీరిద్దరూ ఫ్రెండ్స్ అయి ఉండీ ఈ రెండేళ్లనుంచీ ఒక్కసారి కూడా మెయిల్స్ ఇచ్చుకోలేదంటే ఆశ్చర్యంగా ఉంది"

"కానీ నేను ఈ మధ్యేకదా అమ్మమ్మగారూ ల్యాప్‌టాప్ కొనుక్కున్నాను"

"ఓ అదీ నిజమే.." ఒప్పుకుంటూ కాఫీ

కలపసాగింది సుమతి.

కాఫీ తాగి, కాస్సేపు కూర్చుని "లేట్ అవుతుంది వెళ్తాను. ఈ సారి వచ్చినప్పుడు తాతగార్ని కలుస్తాను" అంటూ బయల్దేరింది ప్రియ.

"అలాగే, జాగ్రత్త!" అంటూ సాగనంపింది సుమతి.

ఆ రాత్రే ప్రియ పాణికి మెయిల్ చేసింది.

"ఎలా ఉన్నారు? నేను గుర్తున్నానా? ఈ మధ్యే ల్యాప్‌టాప్ కొన్నాను. అమ్మమ్మ గారు మీ ఐడి ఇచ్చారు. మీ స్టడీస్ అయిపోయిందని తెలిసింది. ఎప్పుడు వస్తున్నారు? రిప్లై ఇస్తారని ఆశిస్తాను"

క్లుప్తంగా ఇంగ్లీషులో టైప్ చేసి సెండ్ దగ్గర కాస్సేపు తటపటాయించి నొక్కింది.

సరిగ్గా అరగంటలో ఆమెకి అతని దగ్గర నుంచి రిప్లై వచ్చింది.

"హలో ప్రియా! ఏంటి రెండేళ్ల గ్యాప్ లోనే కొత్తగా ఫీలవుతున్నావా? 'మీరు, మీరు' అని అంటున్నావు. ఎలా ఉన్నావు? నువ్వేదో అడ్వెంచర్ చేస్తున్నావని విన్నాను. మంచిపని చేస్తున్నావు. అయామ్ హ్యాపీ. నీ కోసం మీ అమ్మగారు ఎంత కష్టపడ్డారో నాకు తెలుసు. ఆవిడ కోసం నువ్వు ఈ పని చేయడం నేను హర్షిస్తున్నాను. ఎనీ వే, నువ్వెలా ఉన్నావు? నీ జాబ్ ఎలా ఉంది? అమ్మ నాతో పెళ్ళి విషయం మాట్లాడింది. నీ అభిప్రాయం ఏంటి? మనం ఎప్పుడూ ఈ విషయాలు మాట్లాడుకోలేదు. ఇప్పుడు నేను సడన్‌గా నాకిష్టమే అని చెప్పడం ధర్మం కాదు. నీ అభిప్రాయం కూడా తెలుసుకోవాలి కదా? వెంటనే జవాబిస్తావని ఆశిస్తున్నాను. బై ది బై నీ లేటెస్ట్ ఫొటో ఏదన్నా ఉంటే నాకు పంపించు. అఫ్‌కోర్స్ నువ్వు చాలా అందంగా ఉంటావు. కానీ ఈ రెండేళ్లలో ఏదన్నా మార్పులొచ్చాయా చూస్తాను"

ప్రియకి ఒక్కసారిగా పచ్చిక బయళ్ల మీద పరుగులు పెడుతున్నట్టు, నెమళ్లతో కలిసి నాట్యం చేస్తున్నట్టు, రంగు రంగుల పూలన్నీ తన గుండెలమీద రాలుతున్నట్టు మనసంతా ఉల్లాసంగా, ఆనందంగా, ఆహ్లాదంగా మారిపోయింది. అప్పటి వరకూ ఉన్న ఇన్‌హిబిషన్స్ అన్నీ ఊదేసినట్టు అయింది. చకచకా రిప్లై ఇచ్చింది. అలాగే తను సేవ్ చేసి పెట్టుకున్న ఫొటోల్లోంచి అందంగా తీయించుకున్న ఒక ఫొటో కూడా పంపించింది.

"వావ్.. రియల్లీ యూ ఆర్ బ్యూటీఫుల్ ప్రియా! నాకిప్పుడనిపిస్తోంది ఇంతకాలం ఇంత అందమైన అమ్మాయికి సన్నిహి

తంగా ఉంటూ కూడా ఒక్కసారి కూడా ముద్దు పెట్టుకోలేదు. నేను స్టుపిడ్‌ని కదూ? ”

‘ఛీ.. సిగ్గులేదు’ గుండెల్లో తేనెచుక్కలు పడుతున్నట్లు మధురంగా మారుతున్న తన భావాలకు సిగ్గుపడుతూ కళ్లు అరచేతుల్తో మూసుకుంది.

ఆమె రిప్లై వెళ్లకుండానే పాణి నుంచి మరో రిప్లై “ఏయ్ ప్రియా! సిగ్గుపడుతున్నావా? ఫర్లేదులే... మన పెళ్లి అయ్యాక అప్పటి నుంచి మిస్ అయిన ముద్దులన్నీ ఒకేసారి ఇస్తాను. నేనేదో సినిమాలో చూశాను ఈ మధ్యే.. నా రూమ్‌మేట్ తెలుగు సినిమాలన్నీ డౌన్‌లోడ్ చేసి చూపిస్తుంటాడు. అందులో.. ఒకావిడ ఆ ఆర్టిస్టు పేరు తెలియదు నాకు. నీకు తెలుసుగా నేను సినిమాలు పెద్దగా చూసేవాడ్ని కాదు కదా. ఆమె చిన్నప్పటి నుంచీ మాట్లాడలేదని పెద్దయ్యాక ఆ మాటలన్నీ మాట్లాడేస్తూ ఉంటుంది. మంచి కామెడీ. అలా నేను కూడా..”

ప్రియ ల్యాప్‌టాప్ పక్కన పెట్టేసి బెడ్ మీద బోర్లా పడుకుంది. ఆ క్షణంలో ఆమె మనసులో కలుగుతున్న భావపరంపరలో పాణి, అతనితో గడుపబోయే మధురమైన జీవితం ఊహించుకుంది. ఏవేవో తీయటి ఊహలు. అలా మధురోహలతోటే కళ్లు మూసుకుంది.

ఆ తరవాత నుంచీ రోజూ వాళ్లిద్దరి మధ్యా మెయిల్స్ కొనసాగాయి.

★ ★ ★

ఓ ఆదివారం కామేశ్వరమ్మనూ, సుందరయ్యనూ బలవంతంగా తీసుకుని పబ్లిక్ గార్డెన్స్‌కి బయలుదేరింది.

“కాస్త అలా ఫ్రెష్ ఎయిర్‌లో తిరగాలి. ఇక్కడెక్కడా అది లేదు. రండి పబ్లిక్ గార్డెన్‌కి వెళదాం” అంటూ లేవదీస్తుంటే ముందు మొరాయించినా, జీవితంలో మొదటిసారి తమతో అంత ఆప్యాయంగా, అభిమానంగా మాట్లాడుతూ తమ యోగ క్షేమాలు చూసుకుంటున్న ప్రియపట్ల ఆ వృద్ధులిద్దరి మనసుల్లో ఒకింత పాజిటివ్ అభిప్రాయం ఏర్పడింది.

ఎవరింత ప్రేమగా మాట్లాడారు ఇంతకు ముందు? ఏ జన్మ అనుబంధమో ఈ పిల్లతో వద్దనుకుంటూనే దగ్గరవుతున్నారు. ఎక్కడో అట్టడుగు పొరల్లో నిద్రాణమై ఉన్న వాత్సల్యాభిమానాలు ఆ పిల్లమీద అప్పుడప్పుడు పిచికారి చేస్తున్నట్టు పెల్లుబుకుతున్నాయి.

తను మధ్యలో నిలబడి ఇద్దరి చేతులూ పట్టుకుని బలవంతంగా నడిపిస్తుంటే అప్పుడే అడుగులు వేస్తున్న పసిపిల్లల్లా అనిపించారు ప్రియకి. జాలేసింది.

సామాజిక బహిష్కరణకి గురైన ఇలాంటివాళ్లంతా ఇలాగే పైశాచికంగా మారతారేమో? ! వాళ్లకి కొంచెం ప్రేమాభిమానాలు దక్కితే మనుషుల్లో పడడానికి ఎక్కువ సమయం పట్టదేమో అనుకుంది ప్రియ, వాళ్లల్లో వస్తున్న మార్పులు గమనిస్తూ.

ప్రియ కృషి ఫలిస్తోంది. ఆ వృద్ధుల్లో మార్పు వస్తోంది. ప్రియతో టీవీ సీరియల్స్ గురించి మాట్లాడడం, మధ్య మధ్య ‘మీ అమ్మ ఉత్తరాలు రాస్తోందా? ’ అంటూ అడగటం లాంటివి చేస్తున్నారు.

ఆ రోజు సాయంత్రం ప్రియ ఆఫీసు నుంచి వచ్చాక, టీ తాగివచ్చి వాళ్ల ముందు కూర్చుంది.

“ఎలా ఉన్నారు మీరిద్దరూ? మందులు వేసుకున్నారా మధ్యాహ్నం? ” అడిగింది పెద్దవాళ్లిద్దరినీ చూస్తూ.

“వేసుకుంటున్నాం.. అయినా ఎందుకమ్మాయ్ మా మీద నీకింత శ్రద్ధ? ” అన్నాడు సుందరయ్య.

“అదేంటి తాతగారూ.. అదే నా సొంత

తాతగారయితే చేయనా? మీకెవరూ లేరు చూసుకోడానికి. నేను ఇక్కడ ఉండీ చూసుకోకపోతే ఎలా? అది ధర్మం కాదు కదా? ”

వాళ్లేం మాట్లాడలేదు. వాళ్లకి తెలుసు.. ధర్మాధర్మాల గురించి, న్యాయాన్యాయాల గురించి మాట్లాడే అర్హత తమకి లేదని. అందుకే మౌనంగా ఉండిపోయారు.

ప్రియ నెమ్మదిగా అంది “నేను మిమ్మల్నొకటి అడగాలనుకుంటున్నాను, అడగచ్చా? ”

ఇద్దరూ ఒకేసారి ఆమె వైపు చూశారు. ఏం అడగాలనుకుంటోంది? ఒక్కసారి గుండె జల్లుమంది ఇద్దరికీ. ఆ ఇంట్లో జరిగిన అనేక ఘోరాలకు వాళ్లు మాత్రమే సాక్షులు. ఇంతవరకూ ఆ విషయాలు ఎవరితో చర్చించలేదు. అసలు జరిగిపోయినవి తల్చుకోలేదు. ఈ అమ్మాయికి ఆ విషయాలేమన్నా తెలిశాయా? ఆ వివరాలు అడుగుతుందా? అందుకే ఎవరూ మాట్లాడలేదు.

ప్రియ కొంచెంసేపు మౌనంగా ఉండిపోయింది. వాళ్ళ సమాధానం కోసం చూస్తూ.

చివరికి ఏమనుకున్నాడో సుందరయ్య “అడుగు..” అన్నాడు.

“ఏం లేదండి. వచ్చే నెల రెండో తేదీ ఈ ఊళ్లో మా కజిన్ మ్యారేజ్ ఉంది. అమ్మా, అమ్మమ్మ, తాతయ్యా వస్తున్నారు. మ్యారేజ్‌కి నేనూ వెళ్తాను. వచ్చేటప్పుడు వాళ్లు నాతో వస్తారు. రెండు రోజులు నా దగ్గర ఉండాలనుకుంటున్నారు, మీకేం అభ్యంతరం లేకపోతే”

ఒక్కసారి ఇద్దరూ గట్టిగా శ్వాస తీసుకున్నారు.

“దానికేం.. ఉండమను. రెండు రోజులేగా? శాశ్వతంగా ఉండిపోతారా ఏం? ఫర్వాలేదులేమ్మా, ఉండమను” తేలిగ్గా అంది కామేశ్వరమ్మ.

ప్రియకి మతిపోయినంత పనైంది, ఆవిడంత ఈజీగా ఒప్పుకోవడంతో. ‘ఎందుకు? ఇంకెవరు లేరా? అంతమంది ఇక్కడెక్కడ ఉంటారు? ’ వగైరా ప్రశ్నలేస్తుందేమో అనుకుంది. ‘అమ్మో! ఈవిడలో చాలానే మార్పు వచ్చిందే’ అనుకుంది.

“థాంక్సండీ. కాకపోతే నా రూమ్.. సారీ నేనున్న రూమ్ చాలా చిన్నది. ఒకే మంచం ఉంది. హాల్లో కూడా ఈ రెండు మంచాలు కాక ఖాళీగా ఉన్న ప్లేసు వంట గదిలోకి, అటూఇటూ నడవటానికి మాత్రమే ఉంది. చలికాలం కదా.. వరండాలో పడుకోవడం కష్టం. అందుకని ఆ రూమ్ ఖాళీగా ఉన్నట్టుంది కదా.. తాళం తీయిస్తే నేను క్లీన్ చేయిస్తాను”

“వీల్లేదు!” గట్టిగా అంది కామేశ్వరమ్మ.

ఆవిడ మొహంలో హఠాత్తుగా ఆవేశం కనిపించింది “నీకెందుకా గది? అది ముట్టుకోవద్దు. నీ గదిలో సరిపోతే పడుకోబెట్టుకో, లేదంటే వెళ్లిపొమ్మను. ఆ గది గురించి మాట్లాడద్దు”

ఆ స్వరంలో వినిపిస్తున్న కోపానికి విస్తుబోయింది ప్రియ. ఎందుకంత ఆవేశం వస్తోంది ఈవిడకి? ఆ గదిలో ఏముంది?

“వింటున్నావా? ఎట్టి పరిస్థితుల్లో ఆ గది గురించి ఆలోచించద్దు. ఇప్పటి వరకూ మాకోసం చేస్తున్నావని నువ్వు చేసిన కొన్ని పనులు సమర్థించి ఊరుకున్నాను. కొంచెం హద్దుల్లో ఉండు”

ప్రియ మౌనంగా తలవంచుకుని అక్కడి నుంచి లేచి తన గదిలోకి వెళ్లిపోయింది.

“ఈ అమ్మాయిని ఎక్కడుంచాలో అక్కడుంచాలి. ఇసుంత రమ్మంటే ఇల్లంతా ఆక్రమిస్తోంది” ఆవిడ గొంతు ఇంకా వినిపిస్తూనే ఉంది.

‘ఆపరేషన్ ఫోర్ విఫలమయింది’ అనుకుంది ప్రియ.



ఆ రోజు నవంబరు రెండో తారీఖు. శనివారం ఉదయం తొమ్మిది, తొమ్మిది న్నర.

సుందరయ్య స్నానానికి బాత్‌రూమ్‌లోకి వెళ్లిపోయాడు.

కామేశ్వరమ్మ అప్పుడే స్నానం చేసి తయారై వచ్చి కుర్చీలో కూర్చుంది. ఇప్పుడు ఆవిడ తనంతట తనే స్నానం చేయగలుగుతోంది. కొన్ని పనులు తనం తట తనే చేసుకుంటోంది.

"నానమ్మా.. ఈ రోజు నేను పెళ్లికి వెళ్తు న్నాను" అంటూ వచ్చింది ప్రియ.

ఆవిడ తలెత్తి చూసి ఉలిక్కిపడింది.

రాయల్ బ్లూ పట్టుచీర, మెడలో చిన్న లాకెట్ ఉన్న సన్నటి గొలుసు, చెవులకి జూకాలు, కళ్లకు కాటుక, నుదుట దోస గింజ ఆకారం స్టిక్కర్, జడ వేసుకుని మహాలక్ష్మిలా వచ్చి ఎదురుగా నిల్చున్న ఆ పిల్లని చూడగానే ఆవిడకి ఒక్కసారిగా ఒళ్లు జలదరించింది.

ఇన్ని రోజుల నుంచీ ఆధునిక దుస్తుల్లో కనిపిస్తుంటే పెద్దగా పట్టించుకోలేదు. కానీ ఈ పిల్ల.. ఈ పిల్ల.. ఎవరోలాగా అనిపి స్తోంది. ఎక్కడో చూసినట్టుంది. ఆవిడ

నొసలు చిట్లించి తదేకంగా చూడసాగింది.

"ఏంటలా చూస్తున్నారు? గుర్తులేదా? ఆ రోజు చెప్పానుగా మా కజిన్ పెళ్లని. అమ్మా వాళ్లు ఆల్ రెడీ మ్యారేజ్ హాల్ కి వెళ్లిపోయారు. సాయంకాలం అందరం కలిసి ఇక్కడికి వస్తాం"

ఆవిడకి అవేం వినిపించడం లేదు. 'ఈ అమ్మాయిని ఎక్కడో చూశాను. ఎక్కడో చూశాను? ' అనుకుంటోంది.

"ఉప్మా చేసి పెట్టాను. తాతగారు రాగానే మీరిద్దరూ తినేయండి. ఇదిగో కాఫీ కూడా ఫ్లాస్క్ లో పోసాను. వంట అయిపో యింది. మీకు గౌరి వచ్చి అన్నీ ఇస్తుంది"

అప్పటికే టేబిల్ మీద రెడీగా పెట్టిన ఫ్లాస్క్, హాట్ ప్యాక్, రెండు ప్లేట్లు, గ్లాసులు, మంచినీళ్ల జగ్గు రెడీగా పెట్టింది.

ఆవిడ తనని తాను సర్దుకుని "సరే.. వెళ్లిరా" అంది.

ప్రియ ఆవిడ వాలకానికి కొంచెం ఆశ్చ ర్యపోతూ అక్కడి నుంచి వెళ్లిపోయింది. వరండాలో పెట్టుకున్న కొత్త చెప్పులు వేసు కుని మెయిన్ గేటులోంచి వెళ్తుంటే అంత రాత్మ 'శభాష్ ప్రియా.. సాధించావు' అని వీపు తట్టినట్టు అనిపించింది.

నిజానికి ప్రియ వెళ్తున్నది తన స్నేహి తురాలి పెళ్లికి. ఆ రోజు రైల్లో బయల్దేరి మధ్యాహ్నానికి అరుంధతి వస్తోంది. గోపాల్ కూడా రెండు రోజులు సెలవు పెట్టి మరీ వచ్చాడు బెంగళూరు నుంచి.

సుమతిని, విశ్వనాధంనీ తీసుకుని గో పాల్ స్టేషన్ కి వస్తాడు. అందరూ కలిసి తామనుకున్న చోటుకి వెళ్లాలి. ఈ రోజే తను ఆడుతున్న నాటకంలో ఆఖరి అంకం. ఇది సుఖాంతం అవుతుందో, విషాదాంతం అవుతుందో చూడాలి. ఏం జరిగినా ఎదుర్కోడానికి సిద్ధపడమని అరుంధతికి చెప్పింది.

"నాకెందుకో రావాలని లేదు ప్రియా. ఇంక వాళ్లతో మనకేంటి సంబంధం? తెంచుకుని వచ్చి ఇరవై ఏళ్లయింది. మన బతుకులు మనం బతుకుతున్నాం. మళ్లీ అక్కడికెళ్లి లేనిపోని కష్టాలు కొనితెచ్చు కోడం దేనికి? " అంది నిస్సహాయంగా ఆ ముందు రోజు ఫోన్ లో.

"లేదులేమ్మా. గోపాల్ అంకుల్ చెప్పిన విషయం మర్చిపోయావా? సంబంధం లేదనుకున్నప్పుడు నా తండ్రి పేరుగా అతని పేరెందుకు రాశావు? నా ఇంటిపేరుగా వాళ్లింటి పేరెందుకు రాశావు? కాబట్టి మనకి ఉన్న హక్కు మనం పొందుదాం. వాళ్లెంతకాలం ఉంటారు? నువ్వేం భయప డకు, నేనున్నాను" అని ఎంతో నచ్చచెప్పిన మీదట బలవంతంగా ఒప్పుకుంది అరుం ధతి.

ప్రియ గోపాల్ అంకుల్ కి ఫోన్ చేసింది.

"అంకుల్! నేను బయల్దేరాను. నా ఫ్రెండ్ మ్యారేజ్ అటెండ్ అయి, అట్నుంచి అటే స్టేషన్ కి వస్తాను. మ్యారేజ్ సికింద్రా బాద్ లో, సరేనా? "

గోపాల్ అడిగాడు "అంతా ఓకే కదా? "

"యస్, అంతా ఓకే" నవ్వింది.

"గుడ్! స్టేషన్ లో కలుద్దాం " అన్నాడు.

ఫోన్ డిస్కనెక్ట్ చేసి, ఆటోపిలిచి ఎక్కింది.

మధ్యాహ్నం దాటి, సాయంత్రం వైపు కాలం పరిగెడుతోంది.

కామేశ్వరమ్మ, సుందరయ్య మధ్యాహ్నం నిద్ర ముగించి అప్పుడే లేచారు.

బైట ఆటో ఆగిన శబ్దం. కొన్ని క్షణాల తరవాత గేటు తీసిన శబ్దం వినిపించి, ఇద్దరూ ఒకసారి కిటికీలోంచి బైటకి తొంగి చూశారు.

"వాళ్లొచ్చినట్టున్నారు" అన్నాడు సుంద రయ్య.

"రానివ్వండి. హారతివ్వమంటారా

ఏం? " అంది వెటకారంగా కామేశ్వరమ్మ.

"తలుపు తీయాలిగా? " అంటూ మంచం మీంచి లేచి నెమ్మదిగా నడుస్తూ వెళ్లి తలుపు తీశాడు.

ముందు ప్రియ, ఆమె వెనకాల గోపాల్, ఆ తరవాత విశ్వనాథం, సుమతి, అందరి కన్నా ఆఖరున అరుంధతి లోపలికి వస్తు న్నారు.

ఆయన కళ్లు చికిలించి చూస్తూ "ఏంటి.. ఇంతమంది వస్తున్నారు? " అన్నాడు గొణిగినట్టుగా.

"ఎంతమందేంటి? " ఆవిడ అడుగుతుం డగానే ప్రియ లోపలికి వచ్చి "తాతగారూ! మా వాళ్లు వచ్చారు" అంది.

గోపాల్ ప్రియ వెనకాల నిలబడి తండ్రికి దారిచ్చాడు.

"నమస్కారం సుందరయ్యగారూ!" విశ్వ నాథం చేతులు జోడిస్తూ వచ్చాడు.

సుందరయ్య కళ్లజోడు తీసి ఎగాదిగా చూస్తూ "నువ్వు.. నువ్వు? "

"విశ్వనాథం.. ఈవిడ నా భార్య సుమతి" అంటూ భార్య భుజంచుట్టూ చె య్యేసి చెప్పాడు.

సుమతి నవ్వుతూ "నమస్కారం! కులా సాగా ఉన్నారా? " అంది.

కామేశ్వరమ్మ వాళ్లని చూడగానే తుళ్లి ప డింది "మీరా? " అంది.

"అవునండి"

"మీరు.. మీరు.. ఈ పిల్ల.. ఈపిల్ల? "

తలవంచుకుని భయం భయంగా నిల బడ్డ అరుంధతిని చేయిపట్టి లాగి చూపిస్తూ "ఈవిడ ప్రియతల్లి" అంది సుమతి.

ఒక్కసారి అక్కడ బాంబు పేలినట్టు అయింది.

అరుంధతి.. పచ్చటి రంగు, పెదవి కింద కుడివైపు పుట్టుమచ్చ. అందమైన తలకట్టు! ప్రియ ఆవిడ వెనగ్గా వచ్చి అరుంధతి జడ ముందుకేసింది.

"ఎంత ధైర్యం మీ అందరికీ? మాతో నాటకాలాడతారా? " ఆవిడ ఆవేశంతో వణికిపోతూ లేచి వచ్చి ప్రియని చూస్తూ "ఏవే.. అన్నీ తెలుసుకుని వచ్చి, నా ఇంట్లో చేరి, మమ్మల్నే మోసం చేస్తావా? " అంటూ ప్రియని జబ్బపట్టుకుని లాగింది.

ప్రియ ఆవిడ చేయి విడిపించుకుని శాంతంగా అంది "మిమ్మల్ని మోసం చేయ డానికి రాలేదండి. మీరు చేసిన మోసం మీకే చెప్పడానికి వచ్చాను. ఈవిడే నా తల్లి. మీరు మోసంతో, వంచనతో పిచ్చివా డైన మీ అబ్బాయికిచ్చి పెళ్లిచేసి, చిత్రహిం సలు పెట్టిన అరుంధతి. ఈ జడేకదండీ ఈవిడకి అందాన్నిస్తోందని, ఈ జడతో పరాయి మగాళ్లని ఆకర్షిస్తోందని కట్ చేసి వికారంగా మార్చారు. కానీ ఒక్క విషయం మర్చిపోయారు. జుట్టు కత్తిరించుకున్నా మళ్లీ వస్తుందండి. కానీ గుండె కత్తిరిస్తే రాదు"

"ఏంటే వాగుతున్నావు? అవును చేశాను. అయినా లేచిపోయింది. సిగ్గులేని దాన్ని ఎందుకు తీసుకొచ్చావు మా ఇంటికి? " వగరుస్తూ అంది కామేశ్వరమ్మ.

"ముందు వాళ్లని బైటకి నెట్టవే" అరి చాడు సుందరయ్య.

ప్రియ ఆయన ముందుకెళ్లి సూటిగా చూస్తూ అంది "ఎలా నెడతారు? ఈ ఇంటికి వారసురాల్ని నేను. ఎలా నెడతా రండి? సరే తాతగారూ.. నేను మీతో దెబ్బలాడాలని, మిమ్మల్ని బాధపెట్టాలని ఈ నాటకం ఆడలేదు. ఏదెలా ఉన్నా మీరు నా తాత, నానమ్మ. పెద్ద వయ సులో ఉన్న మీరు ఎవరూ లేక ఎన్ని కష్టాలు పడుతున్నారో అని, మీకు సాయంగా ఉండాలని వచ్చాను. అలాగే నా తల్లి మీద మీరు వేసిన నిందలన్నీ అబద్ధాలని, నా తల్లి పవిత్రురాలని మీకు

తెలియచేయాలని వచ్చాను. ఇప్పుడు చెబుతున్నా వినండి, మా అమ్మ ఎవరితో లేచిపోలేదు. మీరు తనని చంపేస్తారని భయపడి వెళ్ళి, ఈ దేవతలని ఆశ్రయం కోరింది. వాళ్ళు మాకెందుకు ఈ తంటా? అనుకోకుండా పెద్ద మనసుతో మా అమ్మని ఒక సురక్షితమైన చోటుకి చేర్చారు. అలాగే మీ కొడుకు శాడిజానికి బలైపోతున్న నన్ను కాపాడి లక్ష్మమ్మ అనే ఒక పనిమనిషి ద్వారా.. వింటున్నారా? ఆమె కేవలం పనిమనిషి, కానీ ఆమె మనసు ఎంతో ఎంతో ఉన్నతమైనది. అలాంటి మనిషి ద్వారా నన్ను మా అమ్మ ఒడికి చేర్చింది. మా అమ్మ పెళ్ళి చేసుకుని హాయిగా ఉండచ్చు. ఎవరూ అభ్యంతరపెట్టేవాళ్ళు లేరు. కానీ చేసుకోలేదు. తన సుఖాన్ని, తన ఆనందాన్ని నా కోసం వదులుకుని నానా కష్టాలు పడి నన్ను ఇంత దాన్ని చేసింది" అంటూ కుడిచేత్తో తనని తాను నిలువునా చూపించింది ప్రియ.

"మీరు అనుకున్నట్టు మాఅమ్మ లేచిపోయివుంటే, ఎవరితో అయితే లేచిపోయిందని అన్నారో.. ఆయనే నాకు తప్పకుండా తండ్రి అయ్యేవాడు. కానీ నీతి, నిజాయితీ ఉన్న మనిషి కాబట్టి నాకు మేనమామ అయాడు. అతనే ఈయన" అంటూ గోపాల్ చేయందుకుంది.

అక్కడ సూదిపడినా వినిపించేంత నిశ్శబ్దం ఆవరించింది.

సుమతి మృదువైన స్వరంతో చెప్పసా

గింది "కామేశ్వరమ్మగారూ! మీరు ఈ అమ్మాయికి చేసిన ద్రోహానికి ఈమె ఏమైనా చేయచ్చు. ఒక ఆడపిల్ల వెళ్లి పోలీసులకి తనకి జరిగిన అన్యాయం గురించి చెబితే అయిదు నిమిషాలు కూడా ఆలస్యం కాకుండా వచ్చి అరెస్టు చేసేవాళ్లు మిమ్మల్ని. కానీ ఆ పని చేయలేదు. తన క్షేమం, తన బిడ్డ క్షేమం తప్ప మరేం ఆలోచించలేదీ అమ్మాయి. సుందరయ్యగారూ ఆవిడకి తెలియకపోయినా మీకు అంతో ఇంతో చట్టంగురించి తెలిసే ఉండచ్చు. చట్టం ఆడపిల్లలకి ఎంత అనుకూలంగా ఉందో మీకు తెలుసు. ఆ చట్టాన్ని ఈ అమ్మాయి ఉపయోగించుకుని మిమ్మల్ని అరెస్టు చేయించలేదంటే అది ఆ అమ్మాయి మంచితనం తప్ప మరేం కాదు. ఏరోజైనా ఈ అమ్మాయి మీరు పెడుతున్న చిత్రహింసలు మాకు చెప్పినా మేమైనా పోలీస్ రిపోర్టు ఇచ్చి ఉండేవాళ్లం. కానీ ఏనాడూ నోరు విప్పి చెప్పుకోలేదీ పిల్ల.. తెలుసా? "

ఇద్దరూ నోటమాట రానట్టు శిలల్లా కూర్చున్నారు.

విశ్వనాథం అన్నాడు "సుందరయ్యగారూ.. మనిషి సంఘజీవి. సంఘంలో ఒకడిగా బతుకుతూ, సంఘంతో మమేకమైపోతే ఆ సంఘమే చివరిదాకా తోడు వస్తుంది. కానీ మీరిద్దరూ తోటి మనుషులకి దూరంగా, ఒంటరిగా బతికారు. జీవితంలో అనేక సమస్యలు వస్తుంటాయి, పోతుంటాయి. అవి ఎదుర్కోవాలన్నా, వాటితో పోరాడాలన్నా మరో తోడు కావాలి. ఆ తోడు మీచుట్టూ ఉన్న సమాజం నుంచే వస్తుంది. పిల్లలు సరిగా పుట్టకపోడం మీ నేరం కాదు. అందుకని వాళ్లని ద్వేషించి, మిమ్మల్ని మీరు ద్వేషించుకుని, మీ చుట్టూ ఉన్నవాళ్లని ద్వేషించి జీవితం అంతా ద్వేషపూరితం చేసుకుని, మానవత్వం చంపేసుకుని, రాక్షసుల్లా బతికారు. ఈ జీవితంలో మీరేమన్నా సుఖపడ్డారా? వెనక్కి తిరిగి చూసుకుంటే మరిచిపోలేని మధురజ్ఞాపకాలంటూ మీకేమన్నా ఉన్నాయా? అసలు మనుషుల్లా బతికారా? నేను అర్థం చేసుకోగలను మీ బాధ. కానీ, అర్థం చేసుకుని మిమ్మల్ని ఓదార్చి మీకు కొంత మనశ్శాంతినిచ్చే అవకాశం మీరెవరికన్నా ఇచ్చారా? అయినవాళ్లతో వేరుపడ్డారు. మిత్రులనేవాళ్లు లేకుండా చేసుకున్నారు. చుట్టుపక్కల వాళ్లని శత్రువుల్లా చూశారు. ఈ ప్రియ మీ దగ్గరకు రాకముందు మీరెలా బతికారు? ఇప్పుడెలా బతుకుతున్నారు? ఒక్కసారి మీ మనసులో ఉన్న ద్వేషాన్ని పక్కన పెట్టి ఆలోచించండి. తేడా మీకే తెలుస్తుంది"

"ఈ అమ్మాయిని చూడండి, కళ్లు తెరిచి చూడండి. మీ మనోనేత్రంతో చూడండి, మనుషుల్లా చూడండి" అరుంధతిని వాళ్ల ముందుకు లాక్కొచ్చి మాట్లాడసాగింది సుమతి "ఇంత మనోహరమైన రూపం ఉన్న ఈమెకి మంచి అబ్బాయి లభించేవాడు కాదా? మీ స్వార్థంకోసం ఈ అమ్మాయి జీవితాన్ని బలి తీసుకున్నారు. పోనీ పెళ్లి చేశాక అయినా ఆ అమ్మాయిని మనిషిలా చూశారా? కొంచెం ఆప్యాయత, కొంచెం అభిమానం చూపించి ఉంటే తన రాత అంతే అనుకుని చివరిదాకా ఉండేది కాదా ఈ సుగుణమూర్తి"

"ఆపండి.." సుందరయ్య రెండు చేతులెత్తి తలమీద పెట్టుకుని తలవంచుకుని వణుకుతున్న స్వరంతో అన్నాడు "ఆపండి.. దయచేసి ఆపండి.. చాలు, ఇంక చాలు. నిజమే మేం చాలా చాలా ఘోరాలు చేశాం. మేం ఘోరాలు చేస్తున్నామనీ తెలుసు. అందుకే అందరూ మమ్మల్ని నేరస్థులుగా చూస్తారనే ఇలా

నాలుగుగోడల మధ్యా మమ్మల్ని మేం బందీలుగా చేసుకున్నాం. మీరన్నట్టు సమాజానికి దూరంగా, సమాజంతో వెలివే తకు గురై బతికాం. మమ్మల్నిలాగే బతక నివ్వండి, వెళ్లండి"

"లేదండి. సమాజం మిమ్మల్ని వెలేయ లేదు. మీరే సమాజాన్ని వెలేశారు"

కామేశ్వరి తలెత్తింది. ఆవిడ కళ్లు గాజు కళ్లలా ఉన్నాయి. ఏ క్షణంలోనైనా కళ్లు తిరిగి పడిపోతుందేమోనన్నట్టుంది ఆవిడ.

ఆవిడనలా చూడగానే సుమతి మనసు ఆర్ద్రమైంది. దగ్గరగా వెళ్లబోతుంటే ఆవిడ రెండు చేతులెత్తి దండం పెట్టింది. "ఇంకేం మాట్లాడద్దు. మేం సిద్ధంగా ఉన్నాం. మమ్మల్ని జైలుకి పంపించండి"

"అంతమాటెందుకండీ? గతంగతః ఏదెలా ఉన్నా వీళ్లిద్దరూ మీ వంశంలో వాళ్లు, మీ కుటుంబంలో వ్యక్తులు, మీ వాళ్లు"

ఆవిడ సుమతికి దూరం జరిగి మొహం పక్కకు తిప్పుకుంది. ఆవిడలా తిప్పుకో డంలో 'ఇంక నాకేం చెప్పద్దు' అన్న భావన కనిపించి సుమతి భర్తవైపు చూసింది. ఆయన పెదవి విరిచాడు. గోపాల్ ప్రియంవద వైపు చూశాడు.

ప్రియంవద దృఢంగా, స్థిరంగా అంది "రండి అమ్మమ్మగారూ.. లోపలికి రండి తాతగారూ, అంకుల్ మీరు కూడా" అంటూ అరుంధతి చేయి పట్టుకుని "రా మ్మా" అంటూ నెమ్మదిగా లోపలికి తీసుకొ చ్చింది.

సుందరయ్య, కామేశ్వరమ్మ నోటమాట రానట్టు నిలబడినచోటే ప్రమాన్పడిపో యారు. వాళ్లకేం జరుగుతోందో అర్థం కాలేదు. ఎవరు వీళ్లంతా? ఇప్పుడు ఎందు కొచ్చారు? ఏం చేయబోతున్నారు? ఏంటి ఈ దండయాత్ర? ఇద్దరూ ఒకళ్లనొకళ్లు చూసుకుంటూ చేష్టలుడిగి చిత్తరువులై నారు.

వాళ్లనలా చూసి కంగారుగా అంది అరుంధతి "లోపలికెందుకు ప్రియా.. వాళ్లు రమ్మనకుండానే? వెళ్లిపోదాం"

"ఇప్పుడే కదమ్మా వాళ్లకి బ్రెయిన్ వాష్ అయింది. అయినా వాళ్ల పర్మిషన్ ఎందుకు? ఇది మనిల్లు. పద" అంది మొండిగా.

"గుడ్ ప్రియా.. ఇదే స్పిరిట్, ఇదే ధైర్యం నేను ఆశిస్తున్నాను" అన్నాడు గోపాల్ నెమ్మదిగా.

"వదిలెయ్.. కాస్సేపలా వాళ్లని వది లెయ్. నువ్వు లోపలికి పద. కాస్సేప యాక వాళ్లే సర్దుకుంటారు" అంది సుమతి.

అరుంధతి తనని చిన్నపిల్లలా నడిపి స్తున్న ప్రియని ఆసరాగా చేసుకుని లోప లికి నడుస్తుంటే ఆమె కళ్లు వర్షించసా గాయి.

ఈ హాల్లో, ఈ వంటగదిలో, ఈ పరిస రాల్లో తిరిగిన, అనుభవించిన భయంకర మైన జీవితం ఆమె కళ్ల ముందు గిర, గిరా తిరగసాగింది.

ఎన్ని కష్టాలు? ఎన్ని కన్నీళ్లు? ఎంత నరకం? మళ్లీ ఇక్కడికి వస్తుందను కుందా?

దుఃఖంతో వణికిపోతున్న అరుంధతిని

తన గదిలోకి తీసుకొచ్చి మంచంమీద కూర్చోబెడుతూ అంది ప్రియ "కూర్చోమ్మా, కొంచెం రిలాక్స్ అవు"

అరుంధతి చివ్వున మంచంమీంచి లేచి వణికిపోతూ అంది "వద్దు.. నేనిక్కడ కూర్చోలేను. నేనిక్కడ ఉండలేను. నాకు భయం వేస్తోంది.. వెళ్లిపోదాం ప్రియా. నాకీ ఇల్లు వద్దు. ఈ మనుషులు వద్దు. వెళ్లిపోదాం"

ప్రియతోపాటు సుమతి, విశ్వనాథం, గోపాల్ కూడా విభ్రాంతిగా చూశారు.

"అరుంధతీ!" విశ్వనాథం హిస్టీరిక్‌గా ఏడుస్తున్న అరుంధతి భుజాలు పట్టుకుని కుదుపుతూ అన్నాడు "ఏంటమ్మా ఏమైంది? ప్రియా! తలుపేసెయ్ వాళ్లు వింటారు" కంగారుగా అన్నాడు.

ప్రియ తలుపు వేసేసింది.

గోపాల్ జాలిగా అన్నాడు "అరుంధతీ.. నేనర్థం చేసుకున్నాను నీ ఆవేదన. నీ గత జీవితం గుర్తొస్తోంది ఇక్కడికి రాగానే, కదూ!? "

సుమతి ఆప్యాయంగా ఆరుంధతిని దగ్గరకు తీసుకుని ఆమె కళ్లు తుడుస్తూ అంది "మామూలు కష్టాలు పడిందా ఈమె మర్చిపోవడానికి. కానీ తప్పదు అరుంధతీ. పెద్దదాన్ని చెబుతున్నాను. ఒక్కసారి వాళ్ల స్థానంలో నిలబడి ఆలోచించు. మామూలు మనుషులు వాళ్లు. వాళ్లేం ఉత్తములు కాదు. నిజానికి ఈ ప్రపంచంలో ఉత్తములు కొద్దిమందే, అధములు చాలామంది ఉంటారు. అధముల బలహీనతలను క్షమించడమే ఉత్తముల లక్షణం. అలా అని నీ అంతరాత్మని చంపుకుని వాళ్లకి సేవలు చేయమని నేను అనను. కానీ ఆలోచించు. ఇంటిపేరు మార్చుకోలేక పోయావు. ప్రియ తండ్రిపేరు మార్చలేక పోయావు. అలాంటప్పుడు నీకున్న హక్కుని ఎందుకమ్మా వదులుకుంటావు? "

"హక్కు!" విరక్తిగా నవ్వుతూ "హక్కు కోరుకునేటప్పుడు బాధ్యత తీసుకోవాలి కదా పిన్నీ. వాళ్లకు సేవలు చేసేంత పెద్ద మనసు నాకు లేదు. ఈ ఇల్లు నాకు దయ్యాల కొంపలా అనిపిస్తోంది. పిశాచాలు తిరుగుతున్నట్టు.. అవన్నీ నా గొంతు పిసుకుతున్నట్టు అనిపిస్తోంది పిన్నీ.. నాకు భయంగా ఉంది" అంది అరుంధతి.

"నీ ఇష్టం అరుంధతీ. నిన్ను బలవంతం చేయడం మా అభిమతం కాదు. నువ్వు ఈ ఇంటినుంచి బైటికి వచ్చినప్పుడే మరో పెళ్లి చేసుకుని ఉంటే కథ వేరుగా ఉండేది. చేసుకోలేకపోయావు. కారణం ఏంటి చెప్పు? " అంది సుమతి.

అరుంధతి మాట్లాడలేదు.

"ఈ పిల్లకోసమేగా, పిచ్చిదానా! తల్లిగా ఈ పిల్ల భవిష్యత్తుకోసం నువ్వెంత ఆరాటపడ్డావో, మరిప్పుడు ఎదిగిన కూతురిగా నీకోసం అది తపన పడడంలో తప్పుందా? " అంది సుమతి.

"అరుంధతీ! మన వివాహ వ్యవస్థ గొప్పదో, కాదో నేను చెప్పలేను. కానీ బలీయమైందని మాత్రం చెప్పగలను. అందుకే నువ్వు రాంభొట్లవారి కోడలిగానే ఉండిపోయావు చూశావా? " అన్నాడు విశ్వనాథం.

అరుంధతి రెండు చేతుల్లో మొహం

దాచుకుని వెక్కివెక్కి ఏడవసాగింది.

ప్రియ కూడా తల్లి పరిస్థితి చూసి ఏడవసాగింది.

గోపాల్ ప్రియని ఊరడించసాగాడు. "ప్రియా! ఇంతచేసి ఇప్పుడు అధైర్యపడితే ఎలా? ఊరుకో. నువ్వు కేవలం వాళ్ల ఆస్తి కోసమే కాదుగా వచ్చింది. మీ అమ్మ మీద వాళ్లు చేసిన నింద నిజం కాదని రుజువు చేయడం కూడా నీ ధ్యేయం, అవునా? "

విశ్వనాథం అన్నాడు "సరే అరుంధతీ.. నీకు ఈ ఇంట్లో ఉంటే ఆ జ్ఞాపకాలు నిన్ను బాధపెడతాయి. ఓ పని చేయి" అందరూ ఆయనవైపు ఆసక్తిగా చూశారు.

"ఎలాగూ ఇల్లంతా బాగా పాడైపోయింది. చాలా పాత ఇల్లు. వాళ్లు పెద్దవాళ్లయ్యారు. ఇల్లు రీమోడల్ చేయించి దీన్ని వృద్ధాశ్రమంగా మార్చు. అప్పుడు నీకూ, వాళ్లకీ ఉన్న బంధుత్వం మర్చిపోయి కేవలం వృద్ధులకి సేవ చేస్తున్నా నన్న తృప్తి ఉంటుంది. నీకొక నీడ ఉంటుంది. తోటి వృద్ధులతో వాళ్లకీ కాలక్షేపం అవుతుంది. చిన్నతోట కూడా పెంచావంటే వాళ్లకీ ఓ వ్యాపకం కల్పించచ్చు"

"ఔను. నాన్నగారు చెప్పింది కరెక్ట్. నువ్వేమంటావు ప్రియా" అన్నాడు గోపాల్.

"తాతగారి ప్రపోజల్ నాకు నచ్చింది" అంది ప్రియ.

"అవునమ్మా.. బాగుంది ఈ ఆలోచన" సుమతి కూడా అంది.

అందరూ అరుంధతివైపు చూశారు.

కొన్ని క్షణాల తరవాత కళ్లు తుడుచుకుంటూ అంగీకారంగా తల ఊపింది అరుంధతి. అందరూ నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నారు.

ఆ రాత్రి అందరూ పడుకున్నా, ఎవరికీ నిద్రరాలేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్లుండిపోయారు. ప్రియ మాత్రం మధ్య మధ్యలో హాల్లోకి వెళ్లి పెద్దవాళ్లిద్దరూ ఏం చేస్తున్నారో చూడసాగింది.

కదలకుండా, మెదలకుండా పడుకున్నారు. భోజనం చేశారో లేదో.. తను అడగలేదు. తినే ఉంటారులే అనుకుంది.

'నిశ్చింతగా నిద్రపోతున్నారు.. చాలా స్ట్రాంగ్' అనుకుంది ప్రియ.

అయితే అనూహ్యంగా జరిగిన ఓ సంఘటనతో పెద్దవాళ్లిద్దరు కూడా రాత్రంతా కన్ను మూయకుండా, చేసిన తప్పులన్నీ ఒక్కొక్కటే గుర్తుకు తెచ్చుకుంటూ, ఆ తప్పులు చేయడానికి దారితీసిన పరిస్థితులను తల్చుకుంటూ కుమిలిపోతున్నారన్న విషయం ఆమెకి తెలిసింది.

అదేమంటే ఆ రాత్రంతా పెద్దవాళ్లిద్దరికీ నిద్ర పట్టలేదు. గతంలో తాము చేసిన తప్పులు వారికి గుర్తుకొస్తున్నాయి.

కామేశ్వరమ్మకి కొన్నేళ్ల క్రితం తోటికోడలు తనతో దెబ్బలాడుతూ అన్నమాట ఆవిడకి ఇప్పుడు చెంపమీద చెళ్లున కొడుతూ వినిపిస్తోంది.

'మీకసలు మానవత్వం లేదు. కుళ్లు, కుతంత్రాలతో ఎంతకాలం బతుకుతారు? ఎప్పుడో ఒకరోజున మిమ్మల్ని పదిమందీ మొహం మీద ఉమ్మేసి తరిమి తరిమి కొడతారు. అప్పుడు తెలుస్తుంది మీకు బతుకు విలువ'

ఇవాళ ఆమె శాపం ఫలిస్తోంది. ఎంతమంది తనమీదికి వచ్చారు. ఉమ్మకపోయినా ఉమ్మినంత పనిచేశారు. నిజంగా ఎలాంటి బతుకు నాది? ఇంత వయసు వచ్చినా మేలిమి బంగారంలా మెరిసిపోతున్న ఆ అమాయకురాల్ని ఎంతగా క్షోభ పెట్టాను? అసలు ఇంత అందమైన అమ్మాయిని ఎలా పిచ్చి కొడుకుకిచ్చి పెళ్లి చేయగలిగాను? ఆమె ఉసురు తగిలి ఈ ఇల్లు ఇవాళ ఇలా తయారైంది. ఇంత జీవితంలో నాకేం ఆనందం మిగిలింది?

ఏం అనుభవించాను నేను?

ఆవిడకి జీవితంలో మొదటిసారిగా దుఃఖం అంటే ఏమిటో అర్థమవుతున్నట్లు గుండెల్ని ఎగిసి తంతూ దుఃఖం పెల్లుబుకుతోంది.

ఆడదాన్నై ఉండీ ఎలాంటి పనిచేశాను? ఓ ఆడపిల్ల నూరేళ్ల జీవితం నాశనం చేశాను. ఎవరికోసం అయితే అంత రాక్షసంగా ప్రవర్తించానో వాడేపోయాడు. అర్ధాయుష్షు కొడుకుకోసం ఈ పిల్ల జీవితం నాశనం చేసిన నన్ను భగవంతుడు క్షమించలేదు కనకే ఇంత నికృష్టమైన జీవితం ఇచ్చాడు. ఎందుకు బతుకుతున్నాను.. ఎవరికోసం.. అసలు నాలాంటి పాపిష్టిదానికి ఇంత సుదీర్ఘమైన జీవితం ఎందుకిచ్చాడు దేవుడు? ఇది శిక్షే. ఏ సుఖం లేదు.. ఏ ఆనందం లేదు. చచ్చినా స్మశానికి తీసుకెళ్లేవాళ్లు లేరే. నాకీ బతుకు అవసరమా?

సుందరయ్య అవమానంతో, బాధతో క్రుంగిపోతున్నాడు.

ఎనభై ఏళ్ల వయసుకి చేరువ అవుతూ తనకన్నా చిన్నవాళ్ల దగ్గర నేరస్థుడిగా నిలబడిన ఆయనకి అవమానంతో చచ్చిపోవాలనిపిస్తోంది. ఆయన అంతరాత్మకి తెలుసు తను చాలా పాపాలు చేశాడని. ఆ పాపాలు చేయడానికి ప్రేరేపించిన పరిస్థితులు ఎవరు కల్పించారు? ఎందుకలా చేయాల్సి వచ్చింది. తల్చుకుంటుంటే ఆయనకీ దుఃఖం ఆగడం లేదు.

ఆవిడ వెక్కిళ్ల శబ్దం ఆయనకి విన్పించలేదు. ఆయన గుండెల్లో రగులుతున్న బడబాగ్ని ఆవిడకీ కనిపించలేదు. ఆ రాత్రి వాళ్లకి కాళరాత్రిలా అనిపించింది.

అందరూ కూడా తెల్లవారుజామున మగతగా కళ్లు మూసుకున్నారు.

తెల్లవారింది. చాలా మామూలుగా.. గౌరి వచ్చి తలుపు కొట్టింది.

ప్రియ తలుపు తీసింది. ఎర్రగా ఉన్న ప్రియ కళ్లు చూసి ఆశ్చర్యంగా అడిగింది గౌరి "ఏంటమ్మా.. అట్టా ఉన్నారేంటి? "

"ఏం లేదులే. వెళ్లి పాల ప్యాకెట్లు రెండు లీటర్లు ఎక్కువ తీసుకురా. చుట్టాలున్నారు"

"చుట్టాలా? " ఆశ్చర్యంగా చూసింది.

"ఊ" ముక్తసరిగా అని లోపలికి వెళ్లి డబ్బులు తీసుకొచ్చి ఇచ్చింది ప్రియ.

తీసిన తలుపు సందులోంచి ప్రియ గదిలో నేలమీద పడుకున్న వాళ్లని చూసి 'ఎవరబ్బా ఇంతమంది చుట్టాలీ కొంపకి? ' అనుకుంటూ వెళ్లిపోయింది గౌరి.

ప్రియ లేవగానే అందరూ లేచేశారు. అరుంధతి కూడా లేచి అలాగే మౌనంగా కూర్చుండిపోయింది.

"లేమ్మా.. బ్రష్ చేసుకో, కాఫీ తాగుదువుగాని" ఆమె భుజమ్మీద చెయ్యేసి మృదువుగా అంది ప్రియ.

అరుంధతి ఒక్కసారి అందర్నీ కలయ చూసింది. ఏదో నిర్ణయించుకున్నట్టు నెమ్మదిగా లేచింది.

"రండి పిన్నీ.. మొహాలు కడుక్కుందురుగాని" అంది నిద్రలేక నీరసంగా కూర్చున్న సుమతితో.

అరుంధతి తేరుకోవడం చూసి అందరూ హాయిగా నిట్టూర్చారు. ఆమె వెనకే అందరూ లేచి హాల్లోకి వచ్చారు.

పెరట్లోకి వెళ్లి మొహాలు కడుక్కుని ఒక్కొక్కరే తల వంచుకుని గదిలోకి వెళ్లిపోయారు.

గౌరి పాలు తెచ్చింది. ప్రియ కాఫీలు కలిపి అందరికీ ఇచ్చింది.

"వాళ్లని లేపి మొహాలు కడిగిస్తావా? " అంది గౌరితో ప్రియ.

ఏం జరుగుతోందో, వీళ్లంతా ఎవరో అర్థంకాని గౌరి మౌనంగా తలాడించి కామేశ్వరమ్మ మంచం దగ్గరకు వెళ్లి

"మామ్మగారూ!" అని పిలిచింది.

ఏదో భళ్లుమన్నట్టు ఒక్కసారిగా పెద్దపెట్టున శోకం వినిపించింది. అందరూ స్తంభించిపోయారు. గౌరి దిమ్మెరపోయి పరుగెత్తుకుని వచ్చేసింది.

కామేశ్వరమ్మ ఓ పక్కకి తిరిగి కుళ్లి కుళ్లి ఏడుస్తోంది. ఆవిడ భుజాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

ప్రియ, సుమతి పరుగున వెళ్లారు ఆవిడ దగ్గరకి.

"కామేశ్వరమ్మగారూ! ఏవండీ.. మిమ్మల్నే. ఏమైంది లేవండి. మెలకువ తెచ్చుకోండి" సుమతి గాభరాగా ఆమె వీపు మీద కొడుతూ లేపసాగింది.

ఆవిడ ఆపడంలేదు. అలా ఏడుస్తూనే ఉంది. సుందరయ్య మంచంమీద లేచి కూర్చున్నాడు. భార్యని ఓదార్చే ప్రయత్నం చేయకుండా తలవంచుకుని కూర్చున్న ఆయనవైపు అందరూ ఆశ్చర్యంగా చూశారు.

నిశ్శబ్దంగా దుఃఖిస్తున్నట్లు ఆయన భుజాలు ఎగిరెగిరిపడుతున్నాయి.

అది చూసిన సుమతి భర్తను పిలిచి "ఏవండీ.. ఆయన్ని చూడండి. పెద్దవాడు ఏదన్నా అవుతుంది" అంది.

విశ్వనాథం ఆయన దగ్గరగా వెళ్లి పిలిచాడు "సుందరయ్యగారూ! ఏంటండి చిన్నపిల్లల్లా.. ఊరుకోండి. ఇలా చూడండి"

సుమతి కూడా బలవంతంగా కామేశ్వరమ్మను లేపి కూర్చోబెట్టి "ఏంటండి ఇది? ఊరుకోండి" అంది.

"నానమ్మా.." సుడులు తిరుగుతున్న దుఃఖంతో బొంగురుగా పిలిచింది ప్రియ.

ఆవిడ తల అడ్డంగా తిప్పుతూ అంది "వద్దమ్మా.. నన్నలా పిలవకు. నాకే బంధాలూ లేవు"

"ఊరుకోండి. ఏంటి మీరు.. చిన్నపిల్లలాగా. జీవితం అన్నాక ఒడిదుడుకులు తప్పవు" ఓదార్పుగా అంది సుమతి.

"లేదమ్మా.. చాలా తప్పులు చేశాను. నాకీ శిక్ష కావాల్సిందే. కన్నీళ్లంటే ఏంటో నాకు తెలియాలి కదా. ఆ పిల్లలిద్దరూ అలా పుట్టినప్పుడు గుండెలు బాదుకున్నాను కానీ, కన్నీళ్లు కార్చలేదు. ఎందుకంటే నా గుండె పగిలి రక్తం కారిందేకానీ, కన్నీళ్లు రాలేదు. మేనరికాలు చేసుకోకూడదని డాక్టర్లు చెప్తున్నా పెడచెవిన బెట్టి నాకు మేనరికం చేశారని నా అత్తమామ్మల్ని తిట్టాను. నా మీద మోజుతో, నా ఇష్టంతో సంబంధం లేకుండా పట్టుబట్టి నన్ను పెళ్లి చేసుకుని నాకు ముచ్చటైన పిల్లలు లేకుండా చేశాడని ఈయనని తిట్టాను. నా తోడికోడళ్లకి బంగారంలాంటి పిల్లలు పుట్టారని అసూయతో వాళ్లని తిట్టాను. ఈ ప్రపంచంలో అందరికీ మంచి పిల్లలు పుట్టారు. నాకే ఎందుకీ శిక్ష అని దేవుడిని తిట్టాను. అందర్నీ తిట్టాను. అందర్నీ ద్వేషించాను. రాక్షసినైనాను"

ఆవిడ నెత్తి కొట్టుకోసాగింది.

"ఆఖరికి, ఆఖరికి వికృతంగా పుట్టడమే కాకుండా పైశాచికంగా ప్రవర్తిస్తున్నాడని వాడిని, వాడిని.. నా కొడుకుని గదిలోకి ఈడ్చిన రోజు తగలరాని చోట తగిలి వాడు చచ్చిపోయినప్పుడు కూడా నాకు కన్నీళ్లు రాలేదు. మొత్తం సమాజం నన్ను హంతకురాలు అన్నా నాకు కన్నీళ్లు

రాలేదు. ఇప్పుడైనా నన్ను ఏడవనీ. ఏడిస్తే ఇంత సుఖం ఉంటుందని నాకు తెలియదు సుమతమ్మా, నన్ను ఏడవనీ. నా గుండె లవిసేదాకా ఏడవనీ"

ప్రియకి వాళ్లనలా చూస్తుంటే దుఃఖం ఆగలేదు "నానమ్మా" అంటూ ఆవిడను వాటేసుకుంది.

ఆ పిలుపుతో ఆ స్పర్శతో ఆవిడలో నిద్రాణమైపోయిన మానవత్వం తుళ్లిపడి లేచినట్టు అయింది.

"తల్లీ!" అంటూ ప్రియని గుండెలకి హత్తుకుంది. "ఎందుకొచ్చావమ్మా ఈ ఇంటికి? ఈ రాక్షసుల దగ్గరికి ఎందుకొచ్చావు? "

ఆ క్షణం అక్కడ ఎన్నేళ్లుగానో వీరవిహారం చేస్తున్న పిశాచాలు హాహాకారాలు చేస్తూ పరుగులు పెడుతున్నట్టనిపించింది.

ఆ మనుషుల్లో మొదటిసారిగా ప్రేమానురాగాల పరిమళాలు వెదజల్లుతున్నట్టు గాలి చల్లగా వీచింది.

కొంచెందూరంగా, ఏం జరుగుతుందో తెలియనిదానిలా స్థాణువై నిలబడిన అరుంధతికి దగ్గరగా వచ్చి గోపాల్ "వెళ్లమ్మా.. దగ్గరకు వెళ్లు. వాళ్లు నీ వాళ్లు. ఓదార్చు" అన్నాడు.

అరుంధతి అదోరకంగా చూసింది. ఆ చూపులో 'నా గుండెల్లో బద్దలవుతున్న లావాని ఎవరు చల్లారుస్తారు? ' అన్న భావన కనిపించింది.

సుమతి అరుంధతి వైపు చూసి "అరుంధతీ.. రామ్మా.. ఇలా రా" అంది.

అరుంధతి నిలబడిన చోటు నుంచి కదల్లేదు.

ప్రియ లేచి తల్లి దగ్గరకి నడిచి "రామ్మా.. వాళ్లని క్షమించేంతటి ఔదార్యం నీకుందని నా నమ్మకం" అంది.

అరుంధతి నిశ్శబ్దంగా కామేశ్వరమ్మని చూడసాగింది.

ఆవిడ కళ్లెత్తి అరుంధతిని చూసింది. బంగారు బొమ్మలా నిలబడిన ఆమెనలా చూస్తుంటే ఆవిడకి తను చేసిన పాపాలన్నీ పెళపెళ్లాడుతూ కళ్లముందే విరిగిపడుతున్నట్టు అనిపించింది.

కామేశ్వరమ్మ నెమ్మదిగా చేతులు చాచింది.

ప్రియ ఆనందంతో నిలువెల్లా వణికింది. తల్లిని నడిపించుకుంటూ తీసికెళ్లింది కామేశ్వరమ్మ దగ్గరకు.

"నన్ను క్షమించు తల్లీ. నా వయసు అడ్డం పడుతోంది కానీ, నీ కాళ్లు పట్టుకోవాలని ఉంది"

అప్పుడు మాట్లాడింది అరుంధతి "అంత మాట అనకండి. నా కర్మకి మీరేం చేస్తారు? "

"కాదు, నీ కర్మకాదు. నా రాక్షసత్వం. నాశనం అయిపోయిన నీ జీవితాన్ని నేను తిరిగివ్వలేను. కానీ అరుంధతీ! మాకంటూ ఉన్నది ఈ ఇల్లు మాత్రమే, ఈ క్షణం నుంచీ ఇది నీది"

ప్రియ మనసులోనే భగవంతుడికి నమస్కరించింది.

విశ్వనాథం అన్నాడు "అరుంధతీ! గతం గతః నిస్సహాయ స్థితిలో ఉన్న ఈ వృద్ధులను ఆదుకోవాల్సిన బాధ్యత నీదే. వాళ్లకెవరూ లేరు. ఈ సహృదయత నీకుందని నే

నసుకుంటున్నాను"

గోపాల్ అందరికీ వినిపించేలా అన్నాడు "అరుంధతీ.. ఆ రోజు నువ్వు, నేను లేచి పోయానని అన్నారు. అది అబద్ధమని తేల్చడానికి నేను ఇంతకాలం ఎదురుచూశాను. నేను అనుకున్నది సాధించాను. వాళ్లని క్షమించు"

"మనది కర్మభూమి అరుంధతీ. సెంటిమెంట్స్ మన ఊపిరి. బంధాలు, అనుబంధాలు, బాధ్యతలు, జీవితాంతం వెంట వస్తుంటాయమ్మా" అన్నాడు విశ్వనాథం.

అరుంధతి తల ఊపింది "క్షమించడం లాంటి పెద్దమాటలవసరం లేదు. నా బాధ్యత నేను నెరవేరుస్తాను"

ప్రియ హాయిగా అంది "హమ్మయ్య! నేను పెళ్లిచేసుకుని వెళ్లిపోతే అమ్మ ఎక్కడుంటుంది? ఎలా ఉంటుంది? అని చాలా దిగులు పడ్డాను. ఇంకనుంచీ అమ్మ నానమ్మా, తాతయ్యల దగ్గర ఉంటుంది"

"కాదమ్మా.. మేమే మీ అమ్మ దగ్గర ఉండే వయసులో ఉన్నాం. ఇక నుంచీ ఈవిడే మాకు కూతురు, కోడలు, తల్లి, తండ్రి" అంది కామేశ్వరి మనస్ఫూర్తిగా.

వెంటనే ఏదో గుర్తొచ్చినట్టు నడుం దగ్గర చీర మడతలో దాచిన తాళం చెవి తీసిస్తూ "ప్రియా! ఇదిగో ఆ గది తాళంచెవి. అందులో ఏమీ లేవమ్మా.. మా చిన్నకొడుకు ఫొటో. వాడిని చూస్తే అందరూ భయపడతారు, అసహ్యించుకుంటారు. అది నేను తట్టుకోలేను. అందుకే ఎవరికీ చూపించను. అలాగే అందులో నాకున్న కొద్దిపాటి నగలు, ఈ ఇంటి రిజిస్ట్రేషన్ కాగితాలున్నాయి. గౌరిని పిలిచి శుభ్రం చేయించి, హాయిగా వాడుకోండి" అంటూ ప్రియ చేతిలో తాళంచెవి పెట్టింది.

ప్రియ దాన్ని అరుంధతి చేతికిచ్చి "అమ్మా ఈ క్షణం నుంచీ ఈ ఇంటి బాధ్యతలు నీవే. ఏం చేయాలనుకుంటున్నావు? " అంది.

మృదువుగా, లలితంగా, వినయంగా, ఆహ్లాదంగా వినిపించింది అరుంధతి స్వరం "ఈ ఇల్లు ఇంతకాలం నుంచీ భయంకరమైన నిశ్శబ్దంతో నిండిపోయి ఉంది. ఇక నుంచీ సందడిగా, మనుషులతో కళకళ్లాడాలి. అందుకే అత్తగారు, మావగారి అనుమతితో ఈ ఇంటిని వృద్ధాశ్రమం చేయాలనుకుంటున్నాను. ఖాళీ స్థలం చాలా ఉంది. అక్కడ రెండోమూడో గదులు కట్టించచ్చు"

అందరూ పెద్దవాళ్ల సమాధానంకోసం చెవులు రిక్కించారు.

సుందరయ్య అన్నాడు "చాలా మంచి ఆలోచనమ్మా. మేమింక సమాజంలోకి రావాల్సిన సమయం వచ్చింది. నీ ఇష్టం వచ్చినట్టే చేయి"

"మీరేమంటారు? " అంటూ గోపాల్ కామేశ్వరమ్మ వైపు చూశాడు.

"మీరందరూ ఏదంటే అదే నాకు అంగీకారం. నాకంటూ ఇంక వేరే ఆలోచనలేం లేవు నాయనా" అందావిడ.

అందరి మనసుల్లో సంతోషతరంగాలు ఎగిసెగిసి పడ్డాయి.

సరిగ్గా ఆరు నెలల తరవాత ఆ ఇంటి రూపు రేఖలు మారిపోయాయి. మరో రెండు గదులు వచ్చాయి. ఇంటికినాలుగు పక్కలా కుండీల్లో మొక్కలు, గేటుకిరువైపులా కొబ్బరిచెట్లు.. వాటికి కొంచెం దూరంలో అందమైన పూలపాదులు. ప్రతి రోజూ ఉదయం ఆ ఇంట్లోంచి సుప్రభాతం, హనుమాన్ చాలీసా చదువుతున్న వృద్ధుల స్వరాలు, సాయంత్రం తన తోటి వృద్ధులతో బాతాఖానీ కొడుతూ సుందరయ్య, తోటి ఆడవాళ్లతో భజనలు చేస్తూ కామేశ్వరమ్మ, వాళ్లని కంటికి రెప్పలా కాపాడే అరుంధతీ.

ఆ అరుదైన, అద్భుతమైన దృశ్యాన్ని కెమెరాలో బంధిస్తూ తల్లివైపు చూసి నవ్వింది ప్రియ. ఆ నవ్వులో అంతులేని ఆత్మవిశ్వాసం, కించిత్ గర్వం తొణికిసలాడాయి. Ⓒ